# రాజశిల్పి

రచన:

పాటిబండ మాధవశర్మ




ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే ప్రకటితము

1958

వెల రు. 1.50

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

వారి

1957 వ సంవత్సరము

పోటీలో

బహుమతి

పొందిన

గ్రంథము

# అంకితము

ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి గౌరవనీయులు

శ్రీ

## నీలం సంజీవరెడ్డిగారికి

అతఁడు రాజకీయముల నారియు తేరిన దిట్ట, పాలనా
రీతుల లోతుపాతుల నెఱింగిన ప్రోడ, మహాంధ్రరాష్ట్ర ని
ర్మాతలలోన మేటి, యఖిలాంధ్ర జనమ్మునకేక నేత, వి
ఖ్యాత విశుద్ధవర్తనుఁడు, కావ్యరసజ్ఞుఁడు, కావ్యవిజ్ఞుఁడున్.

రెడ్డిజాతి కతండు కీర్తి ధ్వజమ్ము,
నీలము కులాన నతఁడింద్ర నీలమణియు,
కల్పశాఖ కార్మికులకు, కర్షకులకు
కేవలము వేల్పుగిడ్డి, సంజీవరెడ్డి.

వరియించె నతనిఁ బతిగా
పరమరసాకృతి మదీయ వరకృతి, దీనిన్
భరియించి ఆయురారో
గ్యరమా ప్రాభవములతఁడు కాంచుత సతమున్.

పాటిబండ మాధవశర్మ

శ్రీ

# రా జ శి ల్పి

అక్షయవసంత శుభారంభము. ప్రాతర్మందానిలములు వెలిమంచు వలిపముల వలెవాటులుధరించి కొండపీటఁ బెండ్లినడకలు పోవుచుండెను. శిథిలశిశిర వేళాశీతల స్పర్శములగు నా వాయువులకుఁ బుష్పభారావనమ్రములగు భూరుహములు మంజుల కిసలయ రంజితములగు నగ్రశాఖాంజలులచే సగంధకుసుమ మధుపర్కముల నర్పించి సంభావించుచుండెను. గండుకోయిల కావించు వసంతభూపాల రాగాలాపనమును గూడ మ్రానుకోయిల తన మర్దళధ్వనులతో విభజించి తాళమునకు సరిపెట్టుచుండెను. ఆరోహణావరోహణములఁ గైశికీ నిషాదమును మాటిమాటికి నొక్కుచు, నొక్కునొక్కునను నమృతపుఁ జుక్కలఁ జిలుకునా గానమునకుఁ జొక్కి తరురాజి పారవశ్యమునఁదలలూపుచుండెను. సుకుమారతాడనముల నా నొక్కులకు మెఱుంగులువెట్టు నా మృదంగనాద తరంగముల కంతరంగము లుప్పొంగఁ గిసలయరోమాంచితలుఁ గుసుమదరహాసితలు నగు లతాతన్వంగులు లాస్యతన్మయ లగుచుండిరి. కర్ణికారములు కర్ణావతంసములుగాఁ గింశుకములు చీనాంశుకముగాఁ బారిజాతములు ప్రావారకముగాఁ గురవకములు శిరోవేష్టనముగా, లోధ్రతామ్రోష్ఠుఁడుఁ, గుందమందహాసుఁడుఁ గాంచనకుండలాలంకృత గండమండలుఁడు నవమాలికారోపిత వక్షఃస్థలుఁడు నగుగిరిరాజు వసంతోత్సవ మంగళాలంకృతుఁడై కన్నులకుఁ బండువుసేయుచుండెను.

నిర్మలనీలగగన సాగరమున నొక నీలిమబ్బుతునుక పశ్చిమ దిశగావచ్చి వేమ బురుజుపైఁ గస్తూరి గురిసిపోయినది. ఉత్తర దిశగా నొక ధవళమేఘశకలము వచ్చి యనపోతబురుజుపైఁ గర్పూర రజో రాసులు గ్రుమ్మరించి పోయినది. కనకగౌరవమగు నొక యభ్రఖండము దక్షిణాశాంతమునుండివచ్చి యన వేమబురుజుపై మలయజ రజఃపుంజము లొలికించిపోయినది. ప్రాగ్దిశాప్రాంగణమునుండి యొక యరుణరాగ రంజితమగు నంబుదశకలమువచ్చి కుమరగిరి బురుజుపైఁ గుంకుమపూవు దింపిపోయినది. దిగిన సరుకు దిగినట్లు చేరల కొలందిగాఁ బట్టి యొడ లెల్లఁబులుము కొనుచు నరనారీ వివేకము లేక దారిం బోవు వారి మొగములఁ జెక్కుల, మెడల నొడళ్ళఁ బులుముచుఁ బిల్లగాలులూర నెల్లెడల నల్లరిగాఁ దిరుగుచుండెను. జిలిబిలిగాఁ జుట్టునుందిరుగుచుఁ జేతికందని యా చిలిపిగాలుల చేతలకు జనులెల్లరుఁ జిఱునవ్వులఁ బులకరింపులు నగుచుండిరి.

తూరుపున నరుణరేఖలారి కుమరగిరి బురుజున కరుణప్రావారక మయ్యెను. బాలభాస్కరబింబము దాని కాంచనోష్ణీషమునఁ బద్మ రాగమణి యయ్యెను. నాఁడు కుమరగిరి మహాప్రభువు బ్రాహ్మ ముహూర్తముననే మేల్కాంచి, యరుణోదయముననే యభ్యంజనము ముగించి, సూర్యోదయ మగుసరికి వసంత సుందర వేషుఁడై ముహూర్త మున కెదురు చూచుచుండెను. హజారమున వీరాస్వామి యప్పుడే వసంత భూపాలము ముగించి మాయామాళవగౌళ రాగాలాపన మారంభించెను. వీరాస్వామి సన్నాయి వాద్యము విని యెంతకాల మైనది! వామనభట్టున కొడలు పులకించెను. సింహద్వార మింకను వండధనుస్సులు పై నున్నది. వామనభట్టు సన్నాయివాద్యము వచ్చుచున్న దిక్కునఁ దలయెత్తిచూచెను. రాజభవన ప్రాకార

గోపుర శిఖరమున బంగరుకలశము లేయెండలో ధగధగ మెఱసి పోవుచుండెను. వామనుని కన్నులు మిఱుమిట్లు గొని యించుక చెమర్చెను. కుడిచేతిమీఁదుగా నించుకమలుపు తిరిగి యాతఁడు సింహద్వారముకడ నశ్వము నవరోహించెను. ద్వారశిఖరస్థయగు పురలక్ష్మికి నమస్కరించి ద్వారరక్షకుల మందహాసపూర్వక నమస్కారముల నందుకొని కుశలమడిగి యాతఁడు కోటలో నడుగిడెను. పది యడుగులు సాగి తలయెత్తిచూచి యాశ్చర్యచకితుఁడై నిలిచిపోయెను. ఇంతకు మున్ను తాను రాజద్వార గోపురకలశమును కొనినదాని కించుక పూర్వోత్తరముగా దేదీప్యమానమగు కలశము వేఱొండు కానవచ్చుచుండెను. ఇంతవఱకు నీరెండును నొక్కటిగనే కాన్పించినవి. ఇప్పుడు రెండును వేర్వేఱుగాఁ గాన్పించుచున్నవి. వామనభట్టునకు క్షణములో గుఱుతువచ్చెను. ఈ క్రొత్తకలశము కుమరగిరిప్రభు వీనడుమఁగట్టించిన సౌధము మీఁదిది. వామనభట్టు తనలోఁ దాను నవ్వుకొనుచు ముందునకు సాగిపోయెను.

రాజవీథియుఁ బ్రధాన వీథులును గస్తూరీ శ్రీగంధసమ్మిళిత పటీర జలములఁ గలయంపిచల్లఁబడి యుండెను. చతుష్పథములందెల్లఁ గాశ్మీరఘనసారములతోఁ జిత్రచిత్రములుగ రంగవల్లులు తీర్పఁబడి యుండెను. ఎడనెడఁ జాతీకింశుక కుసుమగుచ్ఛములు ఉభయ పార్శ్వస్థాపితములగు క్రముకాశోక తరుశేఖరములనుండి తోరణములుగాఁ గట్టఁబడి యుండెను. యాతాయాతప్రజాశ్రేణులు వీథుల కిరువైపులఁగట్టఁబడిన నానావర్ణ కిర్మీరిత కుసుమతోరణ దామములవలె నయనోత్సవ సంధాయకము లగుచుండెను. వివిధ పరిమళభార మంధరమైన చైత్రపవనతరంగములపై నుత్సాహపారవశ్యలాఘవమునఁ బౌరులెల్లరు దేవతలవలెఁ దేలిపోవు చున్నట్లుండిరి. ఎల్లవారును

రక్తాంశుకధారులు. క్లృప్తకర్ణావతంసులు, కంఠప్రాలంబినవమాలికా దాములు, కస్తూరీమిళితచందన సమలంకృతోరస్కులు, కరకీలిత చూత కిసలయకుసుమమంజరులు. ఎల్లవారును నా సమరక్తలోచనాంచలులు, వసంతరాగచ్ఛాయాముఖరితముఖులు, మధుగంధిలవదనులు, తాంబూల తామ్రాధరులు. ఎల్లవారును నవమన్మథమూర్తులు. చైత్ర మైత్రీలబ్ధ ప్రతిష్ఠుఁడగు వసంతరాయని వైభవ మీటీరునఁ గొండ పీటఁ దాండవ మాడుచుండెను.

వామనభట్టు స్వగృహమునకేఁగి వృద్ధజననికిఁ బ్రణమిల్లి కుశలము నివేదించి, స్నాతాలంకృతుఁడై కాటయవేమభూపతి భవనమున కరిగెను. అంతకుమున్నె యాతఁడు సపత్నీకుఁడై రాజభవనమున కేఁగియుండుట తెలిసికొని తానును హుటాహుటినడల మోహరి వాడమీఁదుగా రాజభవనమున కరిగెను. బంగరుహౌదాయెత్తిన పట్టగజము రాజద్వారమునెదుట నైరావణ ప్రథమసంతానమువలె నిల్చియుండెను. తగటుపటములు దంటగాఁగూర్చిన గంతలు కుదురుగా వెన్నునఁ గూర్పఁబడినవి. వానిపై ముఖమలు పఱపులు బఱచఁబడినవి. పదునాఱువన్నియ బంగారుతో రచియించి దానికి రత్నములు దాపితీర్చిన చౌడోలు కట్టబడినది. మణిగణతపనీయమయమైన చప్పరము సమకూర్పఁబడినది. పద్మరాగ ప్రభాపటల భాసురమైన కాంచనకలశ మద్దానిపై ఘటింపఁబడినది. దానిచుట్టును ముత్యాల పేర్లు మువ్వలగుత్తులుఁ గట్టఁబడినవి. ముత్యాలజల్లులు మొనసిన పటము కుంభస్థలమునఁ గొమరొప్ప నిలుపఁబడినది. తుండమున జిరు మువ్వలచేరులును, గంఠమునఁ గూష్మాండప్రమాణమగు కాంస్యఘంటికయు నిరుదెసలఁ దాళఫలప్రమాణములగు జోడుగంటలును గట్టఁబడి వి. శుభ్రదంతములఁ గాంచన వలయములు కూర్పబడినవి. ఘాల

మునఁ బంచవర్ణములతోఁ బద్మకము దిద్దఁబడినది. ఒడలెల్లఁ బూలగుత్తులలో గ్రుచ్చి యెత్తఁబడినది. దానికిరువైపులఁ గనకపల్యాణసజ్జితములు, మణిముక్తాపుష్పమాలికాలంకృతములునగు రెండు శ్వేతభద్రాశ్వములు నిలిచియుండెను.

వామనభట్టు ద్వారపాలకులఁ జిఱునవ్వులతోఁ బలుకరించుచు శిరఃకంపములతో సంభావించుచు లోని కరిగెను. రాజభవన ప్రాంగణము పురోహితామాత్య దండనాథ సామంతజనముతో సమ్మర్దముగ నుండెను. పుష్పితజంగమలతలువోని పరిచారికాగణముల ససంభ్రమాసారప్రసారములచే నాప్రాంగణమంతయు నొక నాట్యశాలవలె నుండెను. ద్రుతగమనముచేఁ జెదరిపోవుచున్న కాశ్మీరసంవ్యానము సవరించుకొనుచు వామనభట్టు ముఖశాలఁ బ్రవేశించెను. సంధ్యాతపరమణీయమైన కైలాసగిరి శృంగమువలెఁ గుమరగిరి మహాప్రభువు శాలామధ్యమున దంతపీఠికపై నాసీనుఁడై యుండెను. ఆయన దక్షిణపార్శ్వమునఁ గాటయవేమభూపతియు, వామపార్శ్వమున జతనము పెద్దిరాజును నిల్చియుండిరి. అంగరక్షకుఁడగు వృద్ధనాయప్ప ప్రభువు పాదమునందలి యందియలు సవరించుచుండెను. కుమరగిరిమహీపతి బరువైనకనుఱెప్పలెత్తి వామనభట్టును దిలకించెను. వామనభట్టుపై బొండుమల్లియలజల్లు కురిసినట్లయ్యెను. ప్రభువు మందహాసముచేసెను. వామనుని కంఠమును పారిజాతమాలికలు కౌఁగిలించినట్లయ్యెను. మావిచివురులగుత్తివంటి చేయెత్తి ప్రభువు వామనభట్టును గుశలమడిగెను. ఆతఁడు వినతుఁడై కుశలము నివేదించెను. "ప్రభువుల దయవలన నీయేడు వసంతోత్సవము చైత్ర సంక్రాంతమగుట నాయదృష్ట" మని వామనభట్టు విన్నవింపఁ బ్రభువు కడకంటి చిఱునవ్వులు కాటయవేమ

భూపతిపై విసరెను. అరవిరిసిన జూకామల్లెపూవువంటి యాయన మందహాసము వామనభట్టు కన్నులలోఁ దళుకులొత్తెను.

రాజపురోహితుఁడు పెద్దియజ్వ యొకపర్యాయము ద్వారము ముందుఁ దారాడెను. ఆసన్నఁగైకొని జతనముపెద్దిరాజు అంతఃపురము దెసఁ బరికించెను. ఇంతలో అంతఃపురమునుండి "యొకవంక ముహూర్తము సమీపించుచున్నది. ఈ యాఁడువారి యలంకరణ మింతలోఁ దెమలదాయేమి ?" యను వృషభగర్జయు దానివెంట "నిదిగో యువరాజు సిద్ధ" మను కోకిలాలాపమును వినవచ్చెను. సంభ్రమము రూపుఁదాల్చినట్లున్న యాల్లాడరెడ్డియు, నాయనవెనుకఁ బూలగుత్తి వలెనున్న కుమారాన్న పోతారెడ్డిని జంకనిడికొని మల్లాంబికయు ముఖశాలలోఁ బ్రవేశించిరి. ఆ వెనుకఁ దన చిన్నకుమారుఁడగు వీర భద్రారెడ్డినెత్తికొని వేమాంబ వచ్చెను. ఆ వెన్నంటి చిఱుగంటలతోడి మదనధ్వజములవంటి పదిమంది నట్టువపడుచులు వచ్చిరి. అపదిమం దియు గలగలని మువ్వలతోఁ గిలకిలని నవ్వులతోఁ బువ్వుల రువ్వుల వలెఁ గుమరగిరి ప్రభువును బొదివికొనిరి. ఆపాదచూడము వసంత పుష్పాలంకృతలగు నా సుందరాంగుల నడుమఁ జుక్కల నడుమఁ జంద్రునివలె నాప్రభువు కలకలలాడెను. ఇప్పటికాయనకుఁ బ్రాణములు వచ్చెను. యౌవన సన్నికర్షముచేఁ బ్రభువు ముఖమున యౌవనకాంతి తొణికిసలాడెను.

ఈ సందడిలోఁ గాటయవేమభూపతి వామనభట్టు నల్లనఁ గౌఁగి లించుకొని, సలోభ మందహాసమునఁ దమ్ముఁ దిలకించు చున్న భార్యచంకనుండి యువరాజును దీసికొనెను. మగని మెయిసోఁకి నంతనే మల్లాంబిక మెయిదీవ నిలువెల్ల మొగ్గదొడిగి చెక్కుల గులాబులు పూఁచెను. ఇరువురు యువతులనూఁతగాఁగొని కుమరగిరిప్రభువు ముఖ

శాలాద్వారమునకుఁ గదలెను. ప్రాంగణమున వారెల్లఁ బ్రభువునకు గౌరవము నెఱపిరి. ప్రాంగణమునఁ గస్తూరీపటీర కర్దమమున నలుకఁబడి కాశ్మీరఘనసారములరంగవల్లులు తీర్పఁబడి, సకలవసంతకుసుమాస్తృత మైన వేదిక నెదుట శుభ్రదుకూలముచేఁ గప్పఁబడిన కాంచనపీఠ మునఁ గుమారగిరి మహీపతి ప్రాఙ్ముఖుఁడై కూర్చుండెను. మల్లాంబిక గంధపుష్పాక్షతలతోడి బంగరుపళ్ళెరమునఁ గర్పూరము వెలిగించి కల కంఠకుల కంఠముతో గళము మేళవించి మంగళకైశికీ వృత్తిని ప్రభు వునకు వందనగీతముఁ బాడెను. ప్రభువు ఫాలమునఁ గస్తూరీ తిలకము దిద్ది కర్పూర నీరాజనము నర్పించెను. చూతపల్లవ దీక్షాబంధమును ముంజేతఁ గట్టెను. శ్రీచందన లిప్తమగు చూతకుసుమ ప్రసాదముఁ జేతి కందిచ్చెను. ప్రభువు ప్రసాదము భక్షించి లేచినిలువఁబడెను. ఉభయ పార్శ్వములను శ్రేణులుదీర్చిన పరివారము నడిమి మార్గమున నృత్యగానములతో నట్టువరాండ్రు పుష్పాంజలులు జల్లుచుండఁ బ్రభువు రాజద్వారమునకు నడచెను.

పట్టగజము నాలుగుకాళ్ళపై మోకరిల్లెను — రాయప్ప తెచ్చి యుంచిన గందపుఁ బీటపైఁగాలూది ప్రభువు గజాధిరోహణము గావించెను. కాటయవేమభూపతి యువరాజును బ్రభువు నొడిలోఁ గూర్చుండఁబెట్టెను. పట్టగజము జయఘీంకార మొనర్చి ప్రభువు శరీ రము లోనికకుండునట్లు లేచినిలిచెను. వీరాస్వామి శంకరాభరణ రాగాలాపము నలముకొని మంగళవాద్యములు భోరనమ్రోగెను. ప్రభువునకు దక్షిణపార్శ్వమునఁ గాట యవేమారెడ్డియు, వామపార్శ్వ మున నల్లాడరెడ్డియు శ్వేతభద్రాశ్వముల నారోహించిరి. పట్టపుటే నుఁగు ముందు నాట్యసుందరులు, వారిముందు వీరాస్వామి మేళము, దాని ముందు వివిధ మంగళవాద్యములు — ఈ తీరున నూరేగింపు

బయలుదేరినది. ప్రభువువెనుకఁ బురోహితమంత్రిదండనాథ సామంతులు, కవి పండిత నర్తకగాయకులు, ప్రధానపౌరులు నడచిరి. ఉభయ పార్శ్వములను రాజభటులు మోచి తెచ్చు బంగరు తట్టల యందలి పూవులగుత్తులను బట్టపుటేనుఁగు తుండాగ్రమున గ్రహించి యూర్ధ్వముఖముగఁ బ్రభువుపైఁ జల్లుచు సవిలాసమందగమనమున సాగిపోవుచుండెను.

రాజమార్గమున కిరువైపుల స్థానిక వైదేశిక ప్రజాసమూహములు ప్రభుదర్శనమునఁ బున్నమనాటి మున్నీటి పొంగులు పోవుచుండెను. సౌధాగ్రములనుండియు, జాలకమార్గములనుండియు జలజలరాలు పూల జల్లులచే రాచబాటయంతయుఁ బూలతోఁట యయ్యెను. వివిధవాద్యములయు, జయజయధ్వానములయు నులివు మిన్నందుచుండ నాసందునుండి వీరాస్వామి శంకరాభరణ రాగాలాపము జనుల హృదయములలో నమృతము లొలుకఁబోయుచునే యుండెను. నాలుగు గడియల ప్రొద్దెక్కునప్పటి కూరేగింపు వేణువనము ప్రధానద్వారము ముందు నిలిచినది. వేమభూపతియు నల్లాడరెడ్డియు నశ్వములవరోహించిరి. మావటి వాడు పట్టపుటేనుఁగును బన్నుండఁబెట్టెను. ప్రభువు పృథివిపై నవతరింపఁగనే వకుళ, వంజుల, మాలతీ, మంజుల, భ్రమరి, మయూరి, కలకంఠి, కీరవాణి యొక్కుమ్మారుగా నాయనను బొదివికొనిరి.

వసంతరాయని యాగమనమునకై వేణువనము ప్రభాతసమయమునుండియు సర్వసంభారములు సంగ్రహించుకొని సన్నద్ధమైయున్నది. వామహస్తమున గంధపుష్పాతలతోడి బంగరుపళ్లెరమును, దక్షిణహస్తమునఁ బటీరజలభరితమగు బంగరుకలశమును ధరించి ప్రభువునకు స్వాగతి నెఱపుటకై లకుమాదేవి యారామద్వారమున నిల్చి

యున్నది. ఆమె కుసుంభరాగారుణమైన యంగదట్టముపై జ్యోత్స్నా ధవళమగు దుకూలము ధరించినది. బంగరుపూలుకుట్టిన నెమలిపట్టు కంచులిక తొడిగినది. సరిగంచుల సంపెంగపూరంగు చీనాంశుకముఁ గప్పుకొనినది. సిగలోఁ బారిజాతములు చెరివినది. నుదుటఁ గస్తురి బొట్టు పెట్టినది. పదముల బారాణి యలఁదినది. కర్ణములఁ గొకట్లు, నాసికఁ బటికపుముంగర, గళమున ముత్తెపుసరులు, కరములఁ గంబు వలయములు, చరణముల మంజీరములు నలంకరించుకొనినది. పరమ శివుని కంటిమంటలఁ బ్రళయమందిన మన్మథదేవుఁడు నేఁడామె చూపులపాలవెల్లిలో నమృతమూర్తియై యవతరించుచుండెను. ఆమెను గాంచినంతనే ప్రభువునకుఁ బ్రాణములు కన్నులలో మెఱసెను. కొండ వీటివసంతలక్ష్మి తనయెదుట సాక్షాత్కరించినట్లయ్యెను. గంధపుష్పా క్షతలనర్పించి లకుమాదేవి ప్రభుపాదములఁ బటీరజలములఁ గడిగి యంశుకాంచలములఁ దడియొత్తెను. అంతసేపును ప్రభువాక యనిర్వా చనీయానుభూతిలోఁ బరవశుఁడై పోవుచుండెను. ఆయన నేత్రములర్ధ నిమీలితములై మాధుర్యములు చిప్పిలుచుండెను. అంతసేపును నాయన దక్షిణహస్త మామె శిరమును నిమురుచుఁ గబరీబంధమునఁ జెదరుచున్న పారిజాతములను సరిచేయుచుండెను.

ప్రభు వుద్యానవనదేవతకుఁ బ్రణమిల్లి యుద్యానపాలకులఁ బ్రసన్నవిలోకనముల సంభావించి యాత్మీయమగు మూర్త్యంతరము వలెనున్న యారామము ప్రవేశించెను. వేణువనము పనూరు ధనుస్సుల యాయతిగల చతురస్రారామము. కొండవీటి నాగరకుల విలాసభూమి. కొండవీటిస్వర్గమున రసికదేవతల విహారమునకై వసంతరాయ దేవేం ద్రుఁడు సృష్టించిన నందనోద్యానమది. అది సర్వఋతు రమణీయము. ప్రభువు పాదముమెట్టినంత వేణువనము పులకితమైనది. ఒక్కొక్క

వృక్షమొక్కొక్క పురుషుడు. ఒక్కొక్క లత యొక్కొక్క లలన. ఆపురుషులందఱుఁ గుమరగిరి ప్రభువులు. ఆలలనలందఱు లకుమాదేవులు. ప్రభువునకుఁ దానే యారామమైనట్లుండెను. అందరకును నారామమే ప్రభువైనట్లుండెను.

వేణువనమధ్యమందు విరియఁబూచిన యొకతియ్యమామిడి చెట్టున్నది. దానిక్రింద రంభాస్తంభములతో నొక లామజ్జకకాయమానము నిర్మింపఁబడియున్నది. మించునలిపముల మేల్కట్లతో బంగారు తోరణములతో రతనాలగుత్తులతో నలంకరింపఁబడి మదనమహీపతి యాస్థానమంటపమువోని యామంటపమునఁ బ్రభువు లకుమాపురస్సరుఁడు వకుళావంజులాది పరివారపరివేష్టితుఁడునై ప్రవేశించెను. పురోహిత నిర్దిష్టమగు మణిపీఠికపైఁ బ్రభువు ప్రాఙ్ముఖుఁడై యుపవిష్టుఁడయ్యెను. ఆయనయెదుటఁ గాంచనమణిగణనిర్మితమైన వేదికగలదు. మృగనాభీపంకమున నలికి కర్పూరమున రంగవల్లులుదీర్చిన యావేదిక నడుమ శ్రీగంధరజోరాశిపైఁ జిత్రవర్ణకుసుమకల్పితమగు నాస్తరణముపై మణికలశమున్నది. ఆకలశము మరువకచూతాంకురములచేఁ గంఠపర్యంతమావృతమై యుండెను. పెద్దియజ్వ సమంత్రకముగఁ బ్రభువుచేత నామంటపముపై క్షేత్రపాలకుఁడగు వసంతుని, లోకపాలకులగు రతిమన్మథులను, లక్ష్మీనారాయణులను, గౌరీశంకరులను, శచీపురందరులను నావాహనము చేయించెను. ప్రభువా దేవతలను షోడశోపచారముల నర్చించుచుండ వీరాస్వామి వసంతరాగము నందుకొనెను. వీరాస్వామి సన్నాయి వాద్యమున సప్తస్వరములకుఁ బ్రాణప్రతిష్ఠచేయును. ఆస్వరములుపోయినంతమేరఁ బ్రాణశక్తులను వెదఁజల్లును. అచేతనములుగూడ నాగానమునఁ జైతన్యవంతములై యేదో వివరింపరాని యాంతరవికారము లుదయించి యంతరాంతరములఁ

దానందమున స్పందించును. ఆరామమంతయు నాతని గానమునఁ బులకిత బ్రహ్మానందమునఁ బ్రకాశించుచుండెను. ప్రభువునంతరంగము విశ్వమంత విస్తారమయ్యెను. కాంచనమణి వేదిక ప్రభువునంతరంగము. ఆ దేవతలందఱు ఆయన యంతరంగమునఁ బ్రతిబింబించిరి. ధూపదీప నైవేద్యములర్పించి ప్రభువు మణిపీఠమున మస్తకమునాని నా దేవతలకు నమస్కారము గావించెను. ఒక్కుమ్మడి భేరీమృదంగ పణవతూర్యాది మంగళవాద్యములు మ్రోసెను. ప్రభువు కన్నులు తెఱచి లకుమాదేవి వంకఁజూచెను. తనకళాతపస్సునకు మెచ్చి దేవతలు ప్రసాదించినయప్సర యామె. కుమరగిరిప్రభువు నేత్రములందు తాను కృతార్థుఁడనన్న యొకతృప్తి ప్రదీప్తమయ్యెను.

వసంతనవరాత్రోత్సవములకు నాంది యైనది. ప్రభువు భర్గుండ కింశుకచూతాశోకాది కుసుమరజోమిళితమగు పటీరజలమును మణిమయశృంగమున నాకర్షించి వేదికోపవిష్టులగు దేవతలపైని, బురోహితునిపైనిఁ జల్లెను. పిదప లకుమను, గాటయవేమారెడ్డిని, నల్లాడ రెడ్డిని బటవాసక్షేప వసంతరసాసేచనముల సంభావించెను. పిమ్మట నొక విశాలమగు లతామంటపమున సుఖాసీనుఁడై ప్రభువు నానా దేశాగతులయిన దుర్గాధిపతులకును సీమాధిపతులకునుఁ గొలువిచ్చెను. కాటయవేమారెడ్డి దుర్గాధిపతుల నొక్కొకరిని బ్రభువునకు నివేదించెను. కోరుకొండదుర్గాధిపతి మంచికొండ కూనపరెడ్డి, నిరవద్యప్రోలు దుర్గాధిపతి భీమదేవ చోడుఁడు, అద్దంకి దుర్గాధిపతి కోటారెడ్డి, బెల్లంకొండ దుర్గాధిపతి యరియేటి లింగనమంత్రి, వినుకొండ దుర్గాధిపతి పెదవెంకప్పరెడ్డి, త్రిపురాంతకదుర్గాధిపతి వెలుగోటి రాయపనాయకుఁడు, కందుకూరు దుర్గాధిపతి పినకోమటిరెడ్డి వరుసగాఁ బ్రభువునకు నివేదింపఁబడిరి. వారు సమర్పించిన కప్పములను నమూల్యోపహారము

లను స్వీకరించి ప్రభువు వారిని పటవాసక్షేప, వసంతరససేచన, కస్తూరి కాదానములచే సంభావించెను. పిదప సీమాధిపతులును, ప్రధానరాజోద్యోగులును, నాగరప్రముఖులును సమర్పించు కట్నములు స్వీకరించి ప్రభువు వారిని యథార్హముగ సత్కరించెను. లతామంటపము వెడలి వచ్చుచున్న ప్రభువునకుఁ దన్ను కాన్పించికొని యవచిదేవయసెట్టి వసంతోత్సవసంభారములు దర్శింపుఁడని ప్రార్థించెను. పటికపుఁదొట్లలోఁ బటీరజలములు. వెండితట్టలఁ గర్పూరకస్తూరికారజములు, బంగరు పళ్లెరముల గంధపుటుండలుఁ గుంకుమపువ్వు సిద్ధముగా నుండెను. ప్రభువు వాని నల్లనల్ల నస్పృశించి యుత్సవాగతులకు వినియోగింప నాదేశించెను. అల్లాడరెడ్డి కనుసన్నంబడి సర్వాలంకార భూషితులగు యువతీ యువకులా సుగంధద్రవ్యముల నెల్లరకుం బంచిపెట్టిరి. వకుళావంజులాదులు చర్చరీ ధ్వనులగావించుచు హిందోళరాగమున వసంత గీతములు పాడుచు లకుమాదేవిచుట్టును మండలాకారమునఁ బరిభ్రమించుచు నొకగడియసేపు గొండ్లి సలిపిరి. అనంతరము వివిధమంగళ వాద్యములు బోరుకలంగఁ బటవాసక్రీడ యారంభమయ్యెను. ఉత్సవాగతులయిన నరనారీజనము లుత్సాహావేశమున నొడలు మఱచి యొకజాముసేపు వసంతక్రీడలఁ దేలియాడిరి. ఎల్లరకు నొడళ్ళఁ బులకల చివుళ్ళును మొగముల నవ్వులపువ్వులు నయ్యెను. లతలకు లలనలకును, దరువులకుఁ బురుషులకును భేదమేర్పరుపరాక సృష్టియంతయు వసంతమయమైపోయెను.

౨

నామనభట్టు విద్యానగరమునకేఁగి రెండేండ్లయినది. కాటయ వేమారెడ్డితోఁ గలిసి యాతఁడు కోలాచల పెద్దిభట్టుకడఁ బంచకావ్యములుఁ జదువుకొనెను. పెద్దిభట్టు రసజ్ఞుఁడైన పండితుఁడు. కావ్య

ములు పారముచెప్పిన నాయనయే చెప్పవలెను. విశేషించి కాళి దాసుని కావ్యములాయన కాత్మవిషయములు. ఆ మహాకవి వ్యంగ్యా నైభవములు వివరించుపట్ల నాయన యొక మాంత్రికునివలె భాసించును. ఆయన శ్లోకమును బఠించు పద్ధతియే వేఱు. కాళిదాసుని శబ్దమాధుర్య మూయన ముఖమున సంగీతమై శ్రోతల నానంద శిఖరముల నెక్కించును. కాళిదాసుని యర్థచమత్కృతులనాయన వివరించుచో శ్రోతకుఁ దానెక్కిన యానందశిఖరము త్రోవలు స్పష్టముగ గోచరించును. ఇది పదియేండ్లక్రిందటిమాట. అప్పుడప్పుడే శబ్దములు ప్రారంభించిన పదియేండ్ల కుఱ్ఱవాఁడు మల్లినాథుఁ డన్నగారి వ్యాఖ్యానధోరణి నట్టె నోటు తెలిచుకొని యాకర్ణించుచుండువాడు. నాట్యశాస్త్రవ్యాఖ్యాన రచనా సందర్భమునఁ గుమరగిరి ప్రభునునకుఁ దోడ్పడవచ్చి కొండవీట నివసించుచుండిన లొల్లమహాదేవపండితులకడఁ గాటయవేమారెడ్డియు వామనభట్టును గలసి కాళిదాసనాటకత్రయమును జెప్పికొనిరి. మహా దేవపండితులు భరతముని యపరావతారమని ప్రసిద్ధికెక్కిన లొల్ల భట్టాచార్యులకుఁ బ్రత్యక్షశిష్యులు. అందుచేతనే యాయన లొల్ల మహాదేవుఁడయ్యెను. ఆయన నాట్యమునందే కాక సాహిత్యము నందును గొప్పపండితుఁడు. ఆయన కాళిదాసుని నాటకములను వ్యాఖ్యానించు పద్ధతి మిగులఁ జిత్రమైనది. నాటకమందలి ప్రతివాక్య ము నాయన యభినయించుచు వ్యాఖ్యానించును. అక్షరాక్షరము, పదపదము నాట్యాభిముఖముగను రసాభిముఖముగను వ్యాఖ్యానించుచు నామూఁడు నాటకములను ముగించుట కాయనకైదేండ్లు పట్టెను. దుష్యంతాదిపాత్రముల నభినయముఖమున వ్యాఖ్యానించునప్పుడాయన ముఖములో నొకానొక పారవశ్యరేఖ పొడచూపుచుండును. దుష్యం తాది పాత్రములయందే రసమున్నదని యాయన సిద్ధాంతము. వారు ప్రకటించు కటాక్షాది చేష్టలను, చింతాదిభావములును గారణముగా

రసమను కార్యముత్పన్నమగుచున్నదని యాయన మతము. అనుసంధాన బలముచే నటుఁడారసము ననుభవించుచున్నాఁడు. ఆ యనుభవమును దిలకించి సామాజికు లానందించుచున్నారు. రామాది పాత్రములందు నిండియున్న రసమును నటుఁ డాస్వాదించుచుండ సామాజికుఁడు గ్రుడ్లప్పగించి చూచుచు వట్టి గుటకలుమ్రింగుచున్నాఁడనుట కాటయ వేమారెడ్డికిని వామనభట్టునకును నచ్చెడిదికాదు. అది వారి యనుభవమున కేదో విరుద్ధముగాఁ దోచెడిది. ఆ యనుభవమును విప్పిచెప్పుట యెట్లో తెలియక వారు తమలోఁదాము గుజగుజలు పోవుచుండువారు. మహాదేవపండితుని యీ యపూర్వ వాదమునందలి సత్యా సత్యములను నిర్ణయించుటకు దార్శనిక జ్ఞాన మావశ్యకమనితలఁచి వామనుఁడు విద్యానగరమున కేఁగెను. ఈ రెండేండ్లనుండియు నాతఁడు విద్యారణ్యస్వామి పాదము లాశ్రయించి సర్వదర్శనములను సంగ్రహరూపమున గ్రహించెను. సూత్రభాష్యాధ్యయనము గావించెను. బ్రహ్మసూత్రార్థములను రససూత్రార్థములతో సమన్వయించుకొనెను.

విద్యారణ్యస్వామి శతవృద్ధు. నిరుడు విద్యానగరమున జరిగిన శ్రీ విరూపాక్షదేవుని చైత్రయాత్రామహోత్సవములలో శ్రీ విద్యారణ్యస్వామి శతవసంతోత్సవముగూడ జరిగినది. ఆయుత్సవముల సందర్భమున వామనభట్టు రచించిన శృంగారభూషణభాణము ప్రదర్శింపఁబడెను. ప్రతిసంవత్సరమును నరుణగిరినాథ డిండిమ కవిసార్వభౌముని యోగానంద ప్రహసన మాయుత్సవములలోఁ బ్రదర్శింపఁబడు టాచారముగ నుండెడిది. నిరుడాయనయే వామనభట్టును బ్రోత్సహించి యీ క్రొత్తరూపకమును వ్రాయించెను. హరిహర రాయలవారా రూపకమును మెచ్చి వామనభట్టును సాహిత్యచూడామణి బిరుదముచే సత్కరించిరి.

రాక రాక రెండు సంవత్సరముల కింటికివచ్చిన కుమారునకుఁ దల్లి పంచభక్ష్యపరమాన్నములతో విందమర్చినది. ప్రియమారనాతని చెంతఁగూర్చుండి కడుపారఁ గుడిపించినది. తనయభ్యుదయముల నభివర్ణించి జననికి వీనుల విందొనర్చుచు మార్గాయాసము భుక్తాయాసము నుపశమింప వామనభట్టించుకసేపు విశ్రమించి యేదో గుబులువచ్చినట్లు చివాలునలేచి నూతనవస్త్రములు ధరించి గళమున బిరుదపతకము నలంకరించుకొని బంగరుటంచుల పట్టుశాలువు పైగప్పుకొని బయలుదేరెను. పదియడుగులరుగునప్పటికిఁ గాటయవేమారెడ్డి పంపిన పల్లకి యెదురయ్యెను. తానింత యాలసించినందులకు సిగ్గుపడుచు నాతఁడు మిత్రుని హృదయమువలె మెత్తగానున్న పల్లకినెక్కి వేమారెడ్డి భవనమున కరిగెను.

పంచబొగుని యాయుధాగార మనఁదగిన విశాలసుందరోద్యానమునడుమ నొకచంద్రశాల. దానివెనుక నల్లంతదవ్వులఁ బశ్చిమోత్తరదిశయందు ధనకపదాకృతియగు భవనము కాటయవేమారెడ్డి యావాసము. దాని యెట్టయెదుట నైరృతిదిశగా వరుణపదలక్షణమైన మందిరము మల్లాంబిక యంతఃపురము. వామనభట్టు చంద్రశాల పూర్వద్వారమునఁ బ్రవేశించుచు బశ్చిమద్వారమున జూపుఁ సారించెను. కాటయవేమారెడ్డి యొకమందారమును మల్లాంబిక కర్ణమూలమునఁ జెరువుచుండెను. మల్లాంబిక పతివక్షఃస్థలమందలి పద్మరాగముపై దొరఁగిన గంధపుఁబొడి తుడిచివేయుచుండెను. వామనుని మనస్సులోఁ గాటయవేమారెడ్డి శాకుంతలవ్యాఖ్యాచిత్రములు తళుకున్న మెఱసెను. ద్వారబంధపుఁ జట్రమున బిగించిన చిత్రపటమువలె నున్న యాదృశ్యమును దిలకించుచు నాతఁడచ్చటనే నిలిచిపోయెను. మల్లాంబికయు, నామెవెనుకఁ గాటయవేమారెడ్డియు మందిరముఁ బ్రవేశిం

చుచు వామనభట్టునుగాంచిరి. మల్లాంబిక నమస్కారమును, గాటయ వేమారెడ్డి మందహాసమును జివ్వుళ్ళలో బాదివిచ మల్లెపూగుత్తినివలె స్వీకరించుచు "క్రొత్తగా నీ నమస్కారము లేమి ?" యని వామ నుఁడు కనుబొమ లెగురవైచెను.

"బిరుదముద్రిక మెఱయించి నీకనులు మిఱుమిట్లు గొలుపవలె నని" యని వేమారెడ్డి పరిహాసముచేసెను.

"వ్యాఖ్యానమించుక విపులీకరణము నపేక్షించుచున్న" దని వామనుఁడు కన్నులు నులుపుకొనెను.

"తంబురాతీవలపై మిలమిలలాడవలెనని ప్రభువు తన చెల్లెలికి రత్నాంగుళీయకము బహూకరించెను" అని వేమారెడ్డి మీసములలోఁ గులుకులు పోయెను.

"అవును. ఈ వజ్రాలయుంగరము మాయన్నగారే చేయించి పెట్టినారు" అని మల్లాంబిక మగనివంకఁ జురుక్కునఁజూచి "వ్యాఖ్యానములనఁగా నిట్లేయుండునుగాబోలు" నని యొయ్యారముగ ముక్కువిఱుచుకొనెను.

"వ్యాఖ్యానములు నిగూఢభావములను బట్టబయలుచేయు" నని వేమారెడ్డి తీర్పుచేసెను.

ఆల్మగల సరసములకు వామనభట్టు విఱుగఁబడినవ్వెను. ఆనవ్వుటలో జారిపోవుచున్న పట్టుసాలువు నాతఁడు విసరి వలివాటు వైచుకొనెను. ఉరమందలి పతక మాసందునఁ దళుక్కుమనెను "ఈ మంగళసూత్ర మెచ్చటి ?" దని మల్లాంబిక మేలమాడెను.

వామనభట్టు :— హరిహరరాయలవారు కట్టినది.

వేమారెడ్డి :— కొండవీటికి విద్యానగరమునకుఁ బెండ్లికుదిర్చితి వన్నమాట. మొత్తముమీద గడుసువాఁడవే ! ఇందులకేనా నీవు విద్యానగరమున కరిగినది ?

మల్లాంబిక :— మాకుఁగూడఁ దెలియపఱచినఁ గాదందుము కాఁబోలు !

వామన :— నాకుమాత్రమేమి తెలియును ? డిండిమకవి సార్వభౌము లీయాకస్మిక సంధానము గావించినారు.

ఇట్లనుచు వామనభట్టు నడచిన వృత్తాంతమంతయు వివరించి సాలువమఱుఁగునఁ జంకలో దాచిన గ్రంథమును వేమారెడ్డి చేతి కందిచ్చెను. స్వర్ణలతాపరిష్కృతమైన ముఖపత్రముపై "శృంగార భూషణభాణః. సాహిత్యచూడామణి వామనభట్ట విరచితః" అని చదివి వేమారెడ్డి "ఈ యక్షరశిల్పి యెవరు ? " అని యడిగెను. "రాజకుమారి హీరాంబిక" యని వామనుఁ డుత్సాహము మెఱయ బదులు పలికెను. "ముత్యాలకోవవలె ముద్దుగొలుపుచున్న" దని వేమారెడ్డి మెచ్చుకొనుచుండ సిగనుండిజారిన మల్లెపూవును మునివ్రేళ్ళతో ద్రిప్పుచు నక్షరముల యందమున కచ్చెరువందుచుండిన మల్లాంబి మగనిమాటకు మొగమింతచేసికొని చేతిలోని మల్లెపూవు నాతనిపై విసరి చివాలున లేచిపోయెను. వామనునిమోము తెల్లఁబోయెను. వేమారెడ్డిమనస్సునం దేదో వింతభావము స్ఫురించి యాతని కపోలము లందెఱుపుచాయ లీలగాఁ దోచెను.

"మల్లికా ! మాట మాట ! అదిగో ! జడలోని జాజిపూవులు నీవెఱ్ఱినిజూచి వికవికనవ్వుచున్నవి" అని వేమారెడ్డి కలకల నవ్వెను. విసురుకొనుచుఁబోవుచున్న మల్లాంబిక గిఱ్ఱునఁ దిరిగి మగని నవ్వులపై

మంకెనలురువ్వి పీపునవ్రేలు వాలుజడ ఱొమ్మునకుఁ గ్రమ్మరించుకొని గమనప్రియారాగమువలె మెలికెలు దిరుగుచు నంతిపురములోనికిఁ బోయెను. పోవుచున్నయామె మెయిదీవ వంపులలో వేమారెడ్డికి హీరాంబిక వ్రాతసొంపులు కానవచ్చెను. “అక్షరములు మెచ్చినందులకే మొగమంతయు మోదుగులు పూయవలెను గాఁబోలు” నని యాతఁడు లోలోనవ్వుకొనెను. “మల్లెపూవు తగిలినందులకే యుల్లమింత తల్లడిల్లవలెనుగాఁబోలు” నని వామనుఁడు పరియాచకము చేసెను.

ఇరువురునుఁ బటికశాల మెట్లెక్కి చంద్రశాలలోని కేఁగిరి. చిలిపికోపముచే జేవురించిన మల్లాంబిక మొగమును దలపించు వామనుని సాలువును స్పృశించుచు “నిది వర్ణస్పృహణీయమగుటయేకాదు. స్పర్శరమణీయముగఁగూడ నున్నది.” అని వేమారెడ్డి యాసాలువును గొనియాడెను.

వామనుఁడు :— విద్యారణ్యులు వృద్ధులగుటతో నిప్పుడు విద్యానగరమున డిండిములదే పైచేయిగా నున్నది. ఆయన శృంగారము మిక్కిలి రాజసమైనది. నాశృంగారభూషణము ఘాటు తక్కువగా నున్నదని యాయన యభిప్రాయము. రాయలవా రాయన కవిత్వమనిన ప్రాణము పెట్టును. శాస్త్రచర్చలకు పలుకుబడి సన్నగిల్లినది. విద్యానగరమున నిప్పుడు సంగీతసాహిత్యములదే పైచేయి. ఇటీవల గాండ్లనాగమణియని యొక గాయని వచ్చినది.

వేమారెడ్డి .— నాగమణియా ?

వామనుఁడు :— అది గానమోహిని. అది కొండపల్లినుండి వచ్చినదఁట.

వేమారెడ్డి :— పే రెచ్చుటనో విన్నట్లున్న ది.

వామనుఁడు :— నాకును దాని మొగ మెచ్చుటనో చూచినట్లే యున్న ది. అది నాగస్వరమూఁది రాయలవారి నాడించుచున్న ది.

వేమారెడ్డి యొక్కసారి పాదములు విదిలించుకొనెను.

వామనుఁడు :— ఏమట్లులికి పడితివి ?

వేమారెడ్డి :— ఏమియులేదు. పాదముల కేదో చుట్టుకొన్న ట్లయినది.

ఇరువురునుఁ బకపక నవ్వుకొనిరి. దాసియొక తె ద్వారముకడఁ బ్రత్యక్షమై "అమ్మగారు రాజభవనమునకు బయలుదేరుచున్నారు" అని నివేదించెను. "మేమును రాణిగారి ననుసరింపఁగలమని విన్న వింపు" మని వేమారెడ్డి నవ్వులను మాటలలోఁ దేల్చివై చెను. అది కులుకుకొనుచుఁబోయి యామాటలు మల్లాంబిక చెవిలో నూదెను. ఆమె పట్టపు టేనుఁగు నెక్కినట్లు పల్లకియెక్కి రాజమందిరమున కేఁగెను. మిత్రులిరువురును మేడదిగివచ్చి చెరియొక పల్లకియెక్కి బయలు దేరిరి.

వామనభట్టు లకుమాదేవి మందిరమున కేఁగెను. సమున్నత ప్రాకారపరివేష్టితమైన యారామమున లకుమాదేవి భవనము మహారాణుల యంతఃపురమును శ్రేణిసేయుచుండును. ద్వార గోపురోపరిభాగమునఁ గాంస్యనిర్మితమగు నటరాజవిగ్రహము ఉగ్రసుందరముగనుండెను. ద్వారమున కిరుకెలంకులను దృఢపరిపుష్టగాత్రలు, సమవిభక్తాంగలు నగు ప్రౌఢాంగనలు పహరా యిచ్చుచుండిరి. వారిరువురును వామనభట్టునకు వంగి నమస్కరించి త్రోవయిచ్చిరి. వామనభట్టున కాభవనము చిరపరిచితమైనదే. కాని యీ రెండుసంవత్సరములలో నం దెన్ని యో మార్పులు జరిగినవి. చంద్రకాంత శిలానిర్మితమైన గోష్ఠీమందిరము

పూర్వములేదు. దానియెదుట బద్మాకృతియగుజలకుండికయు, నద్దాని మధ్యమున నింద్రనీలశకల నిర్మితమును వేణుగోపాలాకృతియునగు జలయంత్రమును గ్రొత్తవే. ఆవేణుగోపాలమూర్తి వ్యత్యస్తపాదుఁడై వామభుజముపై కించుకవంగిన మస్తకముతో ముఖమునఁ జిఱునవ్వులొలుక మురళివాయించుచుండెను. ఆమురళిరంధ్రములనుండి యొక్కొక్కటిగా జారిన జలబిందువులు సన్ననిధారయై జాలువారుచుండెను. గోష్ఠీమందిరమువెనుక నాట్యమందిరము. దానివెనుక లకుమాదేవియావాసము. దానిని బరివేష్టించి నృత్యవిద్యార్థినుల నివాసములు. ప్రాకారము నాలుగుమూలల సాయుధలగు వీరాంగనలు. ఆరామమంతయుఁ గోలాహలమధురముగనుండెను. చిలుకలకుఁ బలుకులు నేర్పువారు, మయూరములకు నృత్తము గఱపువారు, నంచబోదలకు నడకలుదెలుపువారు, రంగురంగులపూలతో రకరకముల దండలు గ్రుచ్చువారు, కలపములుగూర్చువారునై మెఱపుఁదీవలవంటి మెలతలు పుష్పలతల క్రామేసితము లగుచుండిరి. ఒకపరిచారిక వచ్చి వామనభట్టును గోష్ఠీమందిరములోనికిఁ గొంపోయెను. సుపరిష్కృతమైన యామందిరమున సర్వమును దంతనిర్మితము, రత్నఖచితమునై యుండెను. అందొక దంతపుఁబీటపై వామనుని గూర్చుండవేడి యాపరిచారిక యభ్యంతరభవనములోని కేఁగెను. వామనభట్టున కా గోష్ఠీమందిరమును దిలకించినకొలందియు నాశ్చర్యము పొంగులువారుచుండెను. అది కొండవీటి సామ్రాజ్యలక్ష్మీనివాసమో! లకుమాదేవి నాట్యసౌభాగ్యమును గుమరగిరి మహాప్రభుని నాట్యరసికత్వమును నా మందిరమునఁ దాండవించుచుండెను. ద్వారములపై నెదురెదురుగా గుమరగిరిప్రభుని రూపచిత్రము, లకుమాదేవి రూపచిత్రమును నలంకరింపఁబడియుండెను. ఆయిరువురి నేత్రములనుండియు ధవళనిర్మల జ్యోతిర్మాలికలు ప్రసరించి యామందిరమునఁ బూలతోరణములు గట్టుచుండెను.

ఆ యిరువురిచూపులును మందిరమధ్యమునఁ గలిసికొని కళాసరస్వతికి నమృతాభిషేకము గావించుచుండెను. వామనభట్టీ భావనలో మునిఁగియుండఁ బరిచారిక వచ్చి బంగరుపళ్లెరమున ఫలములను కాచపాత్రికలో ద్రాక్షరసమును వామనభట్టుముందున్న బల్లపై నుంచెను. మఱుక్షణమునఁ జేతులుజోడించి నమస్కరించుచుఁ జిఱునవ్వులస్వాగతి నెఱపుచు లకుమాదేవి యరుదెంచెను. ఆమె సరిగంచు తెలివలిపము ధరించినది. బంగరుపూల వెలిపట్టు వలెవాటు దాల్చినది. మృదువుగా నల్లిన జడల నిరుగడలఁ జొల్లెములు చుట్టినది. కన్నులఁగాటుక కర్ణమూలములఁ దులసీదళములు, నుదుటఁ గస్తూరీతిలకము కంఠమున నేకావళియుఁ దాల్చినది. వామనభట్టామె నాశీర్వదించి "కుశలమా?" యని ప్రశ్నించెను.

లకుమ :— తమ దయవల్ల.

వామనుఁడు :— మా దయ కేమున్నది? నీ చలువ వల్లనే కొండవీటి రాజ్య మంతయుఁ జల్లగా నున్నది.

లకుమ :— ప్రభువు అమృతమయుఁ డైనప్పుడు రాజ్యమున వెన్నెలకేమి కొదువ!

వామనుఁడు :— ఆ ప్రభువు నీవేకదా!

లకుమ :— అది కేవల ముత్ప్రేక్ష.

వామనుఁడు :— నీ వింత పండితురాల వెప్పుడైతివమ్మా?

లకుమ :— ప్రభువు నాట్యమునకును, ప్రబంధ నాటకములకును వ్యాఖ్యాతలైనప్పుడు కొండవీటఁ బండితులు గానివా రుందురా వామనయ్యగారూ! మాటలలో మఱచితిని. కొంచెము ఫలాహారవ స్వీకరింపుఁడు.

వామనభట్టు ఫలములను జేతితో స్పృశించి ద్రాక్షరసము నించుక యాస్వాదించుచు "ఇంతసేపుగా నిలువఁబడియే యుంటివి" అనెను. పరిచారిక యొక దంతపుఁబీట తెచ్చి లకుమాదేవి చెంత నుంచెను. ఆమె దానిపై నాసీన యగుచు "విద్యానగర విశేషము లేమియుఁ జెప్పితిరిగాదు" అనెను.

వామనుఁడు :— చెప్పెదనుగాని నీవు గాండ్ల నాగమణి యను దాని నెఱుఁగుదువా ?

లకుమ :— ఎఱుఁగకేమి. ఆమెదస లీయూరే. కంఠమున మాధుర్యము కొంత తక్కువయైనను నామె గొప్ప సంగీత విద్వాంసురాలే. కుమరగిరి ప్రభువు నాట్యము నాదరించినట్లు గానము నాదరించుట లేదనియుఁ, దనకిచ్చట జరుగవలసినంత గౌరవము జరుగుటలేదనియు నామె కొంతకాలము క్రిందటఁ గొండపల్లికిఁ బోయినది.

వామనుఁడు :— కోమటి వేమారెడ్డి సంగీతప్రియుఁడుగదా !

లకుమ :— ఇచ్చట నుండగా నామెను నాగు లనుచుండువారు.

వామనుఁడు :— సరిసరి — ఇప్పుడు గుర్తు వచ్చినది. ఆమె యీనడుమ విద్యానగరముఁ జేరినది. రాయలవారి హృదయమును వశపఱచుకొనుచున్నది.

లకుమ :— కోమటి వేమారెడ్డిగా రామెయందు బద్ధాసక్తులని కూడ వింటిని. పోనిండు. ఆమెగొడవ మనకెందులకు ? విద్యానగరమున మీ విద్యావ్యాసంగ మెంతవఱకు వచ్చినది ?

వామనుఁడు :— శిష్యత్వము దాటి గురుత్వములోఁ బడినది.

లకుమ :— అయిన నింతలోఁ గొండవీటికిఁ దిరిగి రారన్న మాట.

వామనుఁడు :— రావలయుననియే యున్నది. కాని హీరాంబికను విడిచివచ్చుట యెట్లా యని చూచుచున్నాను.

లకుమ :— రాజకుమారి హీరాంబికయా ? మంచి శిష్యురాలినే సంపాదించితి రే.

వామనుఁడు :— ఆమె డిండిమ కవిసార్వభౌములకడ వ్యాకరణము క్షుణ్ణముగాఁ జదివినది. ఆమె పెదతల్లి గంగాదేవి పేరుగూడ నీవు వినియే యుందువు. ఆమె మహాకవయిత్రి. కాళిదాసుని కావ్యములామెకుఁ గరతలామలకములు. హీరాంబిక కామె కావ్యములు పాఠము చెప్పినది. ఆమె యిప్పుడు మధురా విజయ మనుపేరఁ దన భర్తయగు వీరకంపరాయల విజయములు వర్ణించుచు నొక కావ్యము వ్రాయుచున్నది. వ్రాసినది వ్రాసినట్లామె యా గ్రంథమును డిండిములకు వినిపించుచుండును. ఆ డిండిములతో నేనుగూడఁ బోయి వినుచుండువాఁడను. వినినవాఁడ నూరకుండక కాళిదాసుని శ్లోకములకు నామెశ్లోకములకుఁగల పోలికలను ప్రస్తుతించు చుండువాఁడను. ఇది యంతయు జూచుచుండిన హీరాంబికకు నా పాండిత్యమునం దేదియో ప్రత్యయము గలిగినది. నాటకములు పాఠము చెప్పుఁడని పెదతల్లి గారిచే నడిగించినది. సరేయని మొదలు పెట్టితిని.

లకుమ :— అభిజ్ఞాన శాకుంతలమే యారంభించితిరను కొందును.

వామనుఁడు :— అది నాటకరాజముగదా మఱి.

లకుమ :— దానికి మిత్రపక్షపాతముగూడఁ దోడు కావచ్చును గదా.

వామనుఁడు పకాలున నవ్వెను. లకుమాదేవి తనకంటె నొక యడుగు ముందే యూహించుకొని పోవుచున్నట్లుండెను.

వామనుఁడు .— నా పక్షపాతము సరియే. ఆమె పక్షపాతము చూడుము.

ఆమెకు, గావ్యము కంటె వ్యాఖ్యానమునం దాసక్తి యెక్కుడగుచున్నది. ఆమె యాకృతిలోఁ బ్రకృతిలో నచ్చముగ నీవే యనిపించును.

లకుమ .— వామనయ్యగారూ! భగవంతుఁడు మీ ద్వారమున నేదో మహాకార్యమునే సంకల్పించినట్లున్నది.

ఇంతలో నొక పరిచారిక వచ్చి మణిదీపములు వెలిఁగించినది. అప్పుడే సంజచీకటి పడుచున్నది. వేఱొక పరిచారిక వచ్చి "అమ్మా! పల్లకి సిద్ధముగా నున్నది" అనెను.

లకుమ :— నూత్న రాజసౌధమునం దీరాత్రియే ప్రవేశము జరుగును. మీ విద్యానగర విశేషములలో మునిఁగి వర్తమానమును మఱచితిని. ప్రభు వీపాటికి నాట్యశాలకు వచ్చియే యుందురు. తాముగూడ నచ్చటికే వత్తురుగదా.

వామనుఁడు :— అవశ్యము.

పరిచారిక తెచ్చిన వక్కలాకులు వామనునకిచ్చి లకుమాదేవి యాయనపల్లకి ముందును, దనపల్లకి వెనుకనుగా నాట్యశాలకు బయలు దేరెను.

## 3

హజారమున వీరాస్వామి భూపాలాలాపము ప్రభువును జక్కిలిగింతలువెట్టి మేలుకొలిపెను. గతదినమంతయు నాయన యుపవసించెను. ప్రాణమునకుఁ బ్రాణమైన యాసవమునుగూడ ముట్టలేదు. పగలంతయు

వేణువనమునందే గడపెను. వేణువనమందలి సుగంధబంధురములగు వసంతమందానిలము లాయనకుఁ బ్రాణవాయువులై యాకలిదప్పు లగపడకుండఁ జేసెను. ఆయన సుఖనిద్రచేసి ప్రసన్న చిత్తుఁడై మేల్కాంచెను. వరదగోపీనాథుని యాలయమువంకఁ దిరిగి గోపాలసంకీర్తనము గావించుచు గోపురశిఖరమునకు నమస్కరించెను. కాల్యములు నిర్వర్తించి పన్నీటజలకమాడి నుదుట గోపీచందనము ధరించి, గళమునఁ దులసీదామము గీలించి ధవళదుకూలముగట్టి ప్రయతాత్ముఁడై ముహూర్తమాత్రము అష్టాక్షరిజపించి వకుళావంజులులచేఁ బరిమితాలంకరణము చేయించికొని యంతఃపురప్రాంగణమునకు విచ్చేసెను. వాకిట సిద్ధముగనున్న భద్రగజమున కశ్వత్థపత్ర గుచ్ఛమునుఁ, ఒట్టాశ్వమునకుఁ జణకాంకురములును, గపిలధేనువునకు దూర్వాగ్రములునందిచ్చి సభామందిరమునకు నడచెను. సభాంగణమునఁ గాటయవేమారెడ్డి, యల్లాడరెడ్డి, లకుమాదేవియు నెదురై ప్రభువును బురస్కరించుకొని సభామందిరము ప్రవేశించిరి.

సభయంతయు నానాసీమాగతులైన బ్రాహ్మణోత్తములతోఁ దేజోమయముగనుండెను. ప్రభువుసభలో నడుగిడినంత నెల్లరును నిలువఁబడిరి. విప్రమండలియంతయు నేకకంఠమునఁ బ్రభువున కైంద్రములగు మంత్రముల నాశీస్సులు పఠించిరి. ప్రభువా యాశాసనములు శిరసా స్వీకరించి యాసనము నలంకరించెను. సభయంతయు నాసీనమయ్యెను. దుర్గాధిప సీమాధిపు లొకవంకను నమాత్యదండనాథు లొకవంకను వారినడుమఁ బ్రభువు సమక్షమునఁ మంత్రిపురోహితులును నాసీనులైరి. కాటయవేమారెడ్డి లేచినిలిచి ప్రభువు ననుమతి గైకొని యిట్లుపలికెను.

"పరమపురుషుని పాదారవిందములఁ బ్రభవించిన పంటాన్వయము అమరసింధువువలె భువనములఁ బవిత్రము చేయుచున్నది.

ఆ పంటాన్వయపయోరాశిలోఁ గల్పవృక్షములుఁ, గామధేనువులు నుద్భవించి యాంధ్రదేశమున బంగరువులు పండించినవి. పాలేటులు పాతించినవి. దక్షిణాంధ్రమునఁ బ్రోలయవేమారెడ్డి యద్దంకిలో నారోపించిన రాజ్యాంకురము అనపోతప్రభువు పోషణమునఁ గొండవీటి కెగఁబ్రాకినది. అనవేమ మహాప్రభుని నిరంతరకృషి ఫలితముగా నయ్యది రాజమహేంద్రవరమువఱకు వ్యాపించినది. అంకురించి, పల్లవించి, కుట్మలించి, పుష్పించిన యారాజ్యలత నేఁ డఖిలాంధ్రమునకును జల్లని పందిరి కట్టినది. సకలకలానిధియగు కుమారగిరిమహీపతి పరిపాలనము ఆంధ్రదేశమున వాసంతచంద్రికలు వెలయించుచున్నది. ఆచల్లనివెన్నెలలోఁ బందిరియంతయుఁ బూవులువిరిసి కలకలలాడుచున్నది. దిగంతములవఱకుఁ దనపరిమళములఁబఱపి లోకమును బరవశము గావించుచున్నది. గజపతులకు, నశ్వపతులకు, నరపతులకుఁ గన్నెఱ్ఱ గలిగించుచున్నది. నేఁడీ రాజ్యమునకుఁ బర్వదినము. రెడ్డిరాజ్యముపుట్టి నేఁటికెనుబది యాతేండ్లు. కుమారగిరిమహీపతి సింహాసన మధిష్ఠించి నేఁటికాతేండ్లు. విశేషించి నేఁడు యువరాజు జన్మదినము. త్రివేణీసంగమము వలెఁ బవిత్రమైన యీ సమయమునఁ బ్రభువులు రాజ్యమునకుఁ బ్రజలకు, రాజవంశమునకు నభ్యుదయ పరంపరాభివృద్ధి యగుటకై గోభూహిరణ్యదానములు గావింపఁగోరుచున్నారు."

పురోహితసమాదిష్టుఁడై ప్రభువులేచి నిలువఁబడెను. సభయంతయు బ్రభువుతోపాటులేచి నిలువఁబడెను. విశాలమగు సభాప్రాంగణమునఁ బ్రభువు పురోహితామాత్య సహితుఁడై వేంచేసి ప్రతిగ్రహీతలఁ బేరుపేరఁ బిలిపించెను. కాటయవేమారెడ్డి తొలుదొల్త శ్రీమత్తిరుమల నల్లాండిచక్రవర్తి అయ్యవార్ల నాహ్వానించెను. ఆయన కుమారగిరిప్రభువునకు వైష్ణవదీక్షయిచ్చిన యాచార్యుఁడు. ప్రభువాయన పాద

ముల సాష్టాంగప్రణామమాచరించెను. ఆయనతో పాటుగా నేబంద్రుడు వైష్ణవాచార్యులకు గోచర్మాగ్రహారములు ధారవోసెను. పిమ్మట ఘోడెరాయ త్రిపురాంతక దేవుని యనుచరులును, శ్రీశైలగోళకీ మఠాధిపతి శాంతభిక్షావృత్తి యనుచరులును నగు నేబంద్రుడు శైవా చార్యులకుప్రభువు గోచర్మాగ్రహారములు ధారవోసెను. కాటయ వేమారెడ్డి పేర్వేరఁ బ్రతిగృహీతల నాహ్వానించుట, పెద్ది యజ్వ సమంత్రకముగఁ దనహస్తమందుంచెడు దానజలమును బ్రభువు ప్రతి గృహీతహస్తమునవిడుచుట, రాయసబాచయ్య యందించు దాన పత్రముల నల్లాడరెడ్డి ప్రతిగృహీతల కరములందుంచుట — ఈవిధముగ నగ్రహారదానము నిర్వర్తింపఁబడినది. అనంతరము ప్రభువు నూర్వురు విప్రులకు బాడియావులను దానముచేసెను. అప్పటికే పంద్రెండు గడి యలు ప్రొద్దెక్కెను. ఉపవాసపరిక్లాంతుఁడైన ప్రభువు నిలుచుటకుఁ గూడ చాలకుంట గుర్తించి తులాపురుషమహాదానము సాయంకా లము జరుగునని కాటయవేమారెడ్డి ప్రకటించెను. లకుమాదేవి కైదండ యొసఁగి ప్రభువు సభ్యాంతరమందిరములోనికిఁ గొనిపోయెను.

మట్టమధ్యాహ్నము. వసంతకాలపు జిఱుతయెండ చురుకు చురుకుమనుచుండెను. ధూళిధూసరితములగు జీర్ణవసనములవాఁడు, వికీర్ణమై పింగళవర్ణమైన కేశకలాపమువాఁడు, కంఠావలగ్నమైన యిష్ట లింగమువాఁడు, నూనూగుమీసములవాఁడు, యువకుఁడొకఁడు కొండ వీటి కోటవాకిటికి వచ్చెను. అతనిచంకలో నొక తాతలనాటి సాలువు. ఆసాలువు మడతలలోఁ దాళపత్రములు. అతనికడుపులోని యాకలి మంటలు కన్నులలో నెత్తునిసెగలు గ్రక్కుచుండెను. ఆకటఁదూలుచు నాసలఁ దేలుచు నాతఁడు లోనికిఁ బోఁబోయెను. అతనివాలకముఁజూచి ద్వారరక్షకు లడ్డగించిరి. అతనికిఁ బ్రాణములు నిలువున నెగిరిపోయిన

ట్లన్యెను. "కొండవీటివసంతోత్సవములు జరుగుచున్నవని కొండంత యాసతోఁబడి వచ్చితిని. నేను కవిని. కుమరగిరిప్రభువునకు నాకావ్యములు వినిపింపవచ్చితిని" అని యాతఁ డనుచుండఁ బకపకనవ్వుచు నొకద్వారరక్షకుఁడు "పిచ్చివాఁడుగావలె" ననెను. రెండవవాఁడు "బిచ్చగాఁడుగావలె" ననెను. అందులకా యువకుఁడు శుష్కముగ నవ్వుచు "అవు నవును. నేనుపిచ్చివాఁడనే. నాకుఁ గవిత్వపుఁ బిచ్చిపట్టినది. నేను బిచ్చగాఁడనే. నాకుఁ గస్తురిబిచ్చము కావలెను. నేను తిండికి మొగమువాచి కొండవీటికిరాలేదు. కుమరగిరి మహాప్రభువు వసంతోత్సవములలోఁ గస్తూరి పంచిపెట్టుననివింటిని. నేనా కస్తూరికా భిక్షకై వచ్చితిని" అనెను. ద్వారరక్షకుల కాతనిపైఁ గనికరముగలిగినది గావలె. మాకొండవీటఁ గవులందఱుఁ బంచకళ్యాణిగుఱ్ఱములవలె నుందురు. నిన్నుజూచిన జాలిపుట్టుచున్నది. పొమ్ము. కోటలోనికిఁ బొమ్ము. నీయదృష్ట మెట్లున్నదో!" యనుచు వా రాతనికిఁ ద్రోవ విడిచిరి.

అతఁడట్లే తూఁగాడుచు వీధి వెంటఁ బోవుచుండెను. ఎచ్చటికిఁ బోవలెనో యాతనికిఁ దెలియలేదు. ఒక్క దగ్గుబల్లి తిప్పయగారుతప్ప కొండవీటిలో నాతఁడెఱిఁగిన వారెవ్వరునులేరు. ఉత్సవాగతులగు కవిపండితులకుఁ బ్రభువు ప్రత్యేకముగవిడిదలలు, విందుగుడుపులునేర్పాటు చేయించునని యాతని కేమి తెలియును? కనిపించినవారినెల్లఁ "దిప్పయ్యగారి యిల్లెచ్చట?" "దగ్గుబల్లి తిప్పయ్యగారి యిల్లెఱుఁగుదురా?" యని యడుగుచు నాతడు వీథివీథియుఁ దిరుగుచుండెను. అతనిమాట వినిపించుకొనినవారే తక్కువ. అతనిదిక్కు చూచినవారు మఱియు దక్కువ. అతనికి బదులుపలికినవారంతకంటెఁదక్కువ. తిప్పయ్యగారి యిల్లు చూపినవాఁ డొక్కఁడును లేఁడు.

దగ్గుబల్లి తిప్పయ్యగారు గంపెడుపిల్లలతోఁ గడుపుచేతఁబట్టుకొని యేడాదిక్రిందటఁ గొండవీడుచేరినాఁడు. ఆయన పాకనాఁటిబ్రాహ్మణుఁ డగుటచే నరియేటి యన్నయమంత్రిగారాయన నభిమానించి తనవద్ద దినవహిగా నుంచుకొన్నారు. తిప్పయ్యగారు వయస్సుమళ్ళినవాఁడు, నిరాడంబరుఁడు, నిరుపేద. నలుగురిలోఁ దిరుగనేర్చినవాఁడుకాఁడు. ఇఁక గొండవీటిమహాపట్టణమునందాయన యెవ్వఁడో!

పగలు మూఁడవయామము నడచుచుండెను. హజారమున పీరాస్వామి శుభపంతువరాళిరాగము నాలాపనమొనర్చుచుండెను. మొగసాలపై గడియారమునఁ బండ్రెండుమారులు టంగు టంగు మని మ్రోగెను. ఉదయము సభాభవనముననే జరిగియుండవలసిన తులాభారము పౌరులయభ్యర్థనపై ప్రభువునుమతితో నగరివాకిట విశాల సమతలముననేర్పాటుచేయఁ బడెను. సర్వాలంకార రమణీయమగు మంటపమధ్యమున బంగరుబల్లలు, వెండిచేరులు, దంతపుదండముగల తులాదండము వ్రేలాడుచుండెను. విప్రుల యాశీర్వాదనాదములు ప్రజల జయజయధ్వానములలో లీనములగుచుండఁ బ్రభువు యువరాజ సహితుఁడై యమాత్యసామంతాద్యనుగమ్యమానుఁడై మంటపము ప్రవేశించి తులాదండపు టుత్తరఫలకమునం దాసీనుఁడై యువరాజును తొడపై నిడుకొనియెను. వేమారెడ్డి కనుసన్నఁగైకొని యల్లాడరెడ్డి నవరత్నములుఁ, గట్టాణిసుపాణి ముత్యములుఁ బంచలోహములుఁ బళ్లెరములతోఁదెప్పించి దక్షిణఫలకమునందుంపించెను. లకుమాదేవి సర్వాంగముల నుజ్జ్వలాభరణములుమెఱయ నేతెంచి ప్రభువునకు నమస్కరించి యొక్కొక్కటిగా మేనిరవణములన్నియు నొలిచి ప్రభువుచుట్టుం దిగిచి తులయందుంచెను. కాటయవేమారెడ్డి మొదలుగానెల్ల యమాత్యులును, దండనాథులును వారివెంట దుర్గాధిపతులును సీమాధిపతు

లును నమూల్యములగు నాభరణములను తులయందుంచిరి. ఇది యంతయుఁగాంచుచుండిన జనసామాన్యమున కుత్సాహము పట్టరానిదయ్యెను. ప్రభువున కభ్యుదయమునకై తాము దృణమో పణమో తులయందుంతుమనిరి. ప్రభువు సమ్మతింపఁగాఁ బౌరులు జానపదులు ద్రోక్కిసలాడుకొనుచువచ్చి కలిగినవారు కలిగినంతగాఁ, దోఁచినవారు తోఁచినంతగా సమర్పించిరి. ప్రభువునైపు ఫలక మెప్పుడో పైకిలేచెను. అయిననుఁ గానుకలు కురియుచునే యుండెను. ఆ ధనమునం దొకవంతు కొండవీటను మిగిలినమూడువంతులు రాజ్యమునందలి వివిధ సీమలయందును వినియుక్తము గావలెనని ప్రభు వాదేశించెను.

ఎఱసంజదాసనములు గురియుచుండఁ బ్రభువు మావంతుఁడు తోడితెచ్చిన పట్టగజము నధిరోహించెను, రేవంతులు తెచ్చియుంచిన భద్రాశ్వముల నారోహించి యమాత్యదండనాథులు, దుర్గాధిపతులుఁ బ్రభువువెంటబయలుదేరిరి. వివిధమంగళవాద్యములు మిన్నందుచుండ నుత్సవము సాగిపోయెను. పట్టగజమునకించుక ముందుగా రెండుపెద్ద గౌరులపైఁ గూర్చుండి యల్లాడరెడ్డియు, బెద్దిరాజును వెండిబంగరు నాణెములను కస్తూరికా కాశ్మీరములతోఁ గలిపి యిరుదెసలఁ గలయఁ జిమ్ముచుండిరి. ఊరేగింపు ప్రధానవీథులవెంటఁ బోవుచున్నకొలందియుఁ బ్రజాసమూహము పెరిగిపోవుచుండెను. కురియుచున్న నాణెములను గురియుచున్నట్లే కుట్టకుంకలెగనెత్తుకొనిపోవుచుండిరి. ధూళిధూసరితములగు జీర్ణవసనములవాఁడు యువకుఁడొకఁడు సాయంసంధ్యారుణి లలో మిలమిలలాడుచు నెగిరివచ్చుచున్న యొకవస్తువును బద్మరాగ డమనుకొని యెగిరియందుకొనెను. ఊరేగింపు గృహరాజసౌధాభి ఖముగఁ దరలిపోయెను. కుప్పలుకుప్పలుగ వీథియంతటఁ గలయఁ యున్న కస్తూరికారజముఁ జేరలతోనెత్తి యొడలంతయుఁ బులుము

కొనుచు నాయువకుఁ డానందోన్మత్తుఁడై యా యెఱసంజలోఁ దాండ వింపసాగెను.

## ४

రాజసౌధము మధ్య వికృష్టలక్షణములు గల నాట్యశాల, అఱువదినాలుగు హస్తముల పొడవు, ముప్పదిరెండు హస్తముల వెడల్పుగల యా శాలయందు పశ్చిమాగ్రమున నేపథ్య గృహమును, దానికిఁ దూర్పున రంగశీర్షమును, దానిముందు రంగపీఠమును, దానికిరువైపులను మత్తవారణులును నిర్మింపఁబడియున్నవి. వీనికిఁ దూర్పున, ముప్పదిరెండుహస్తముల చతురస్రమగు రంగమండలమున్నది. రంగశీర్షమునకు నేపథ్యగృహమునకు నడుమఁ బ్రవేశ నిష్క్రమణములకై రెండుద్వారములున్నవి. రంగపీఠము నున్నగా నద్దమువలె మెఱుఁగులీనుచున్నది. రంగశీర్షము షడ్దారుకసమన్వితమై యుబ్బెత్తులులేక సమముగనున్నది. మత్తవారణులందలి స్తంభములు స్ఫటికశిలానిర్మితములై నానామణిగణ ఖచితములై యున్నవి. రంగమండలము చతుఃస్తంభోపశోభితము. బ్రహ్మక్షత్రవైశ్యశూద్రులను చతుర్వర్ణములకు నవి చిహ్నములు. రంగశీర్షరంగ పీఠములకునడుమ కనకలతాలంకృతమును, చిత్రవర్ణ మనోహరమునగు యవనిక యున్నది. కుడ్యము లిష్టకానిర్మితములై నున్నగా సున్నపుఁబని చేయఁబడియున్నవి. ప్రాగ్దక్షిణోత్తరముల సింహద్వారము లున్నవి. ద్వారములు, గవాక్షములు నానాపుష్పలతాపక్ష్యాదుల శిల్పములలో నగిషీపనిమెఱయు దంతపుఁబలకలతోఁ గూర్పఁబడియున్నవి. గవాక్షములు నానావిధవిన్యాసములతోఁ గూడిన యంత్రజాలకములతోఁ గప్పఁబడియున్నవి. స్తంభములన్నియు నానా నాట్యభంగిమములఁ బ్రదర్శించు సాలభంజికలచేఁ బరివేష్టిత,

ములై యున్నవి. రంగపీఠమునందును, రంగశీర్షమునందును ప్రేక్షా
గృహకుడ్యములందునుఁ జిత్రవర్ణములగు మణిదీపము లమర్పఁబడి
యున్నవి.

లొల్లమహాదేవాచార్యుఁడు త్రిరాత్రోపవాసానంతరము గతరా
త్రమునసే యథావిధి బలిపూజావిధానములొనరించి నాట్యశాలఁ బ్రవే
శించెను. మహాదేవ పితామహాదిసర్వదేవతలను, దేవఋషులను, భూత
ములను యథాస్థానముల నావాహనముచేసి నాట్యప్రయోగసమయము
లందు నాట్యకారులయు, సామాజికులయు రక్షణభారము వహింపుఁ
డని వారినెల్లఁ బ్రార్థించెను. పిమ్మట దానవసూదనమును, విఘ్ననాశ
కమునగు జర్జరమను నింద్రాయుధమును బూజించెను. కుతపముల నారా
ధించెను. దేవతాప్రతిష్ఠగావించుటకై ప్రభువురాక కెదురుచూచుచు
మహాదేవాచార్యుఁడు నాట్యశాలాముఖద్వారమున నిలిచియుండెను.
ముత్యాలపల్లకినెక్కి నాట్యసరస్వతి లకుమాదేవివచ్చి నాట్యాచార్యుల
పాదములకు నమస్కరించి యాయన సమీపముననిలువఁబడెను. మఱి
యొకక్షణములోఁ జెరియొకపల్లకినెక్కి యవచిదేవయసెట్టియుఁ దిప్పయ
సెట్టియు వచ్చిరి. అనంతామాత్యుఁడు వామనభట్టు, పెద్దిభట్టు,
పరహితభాస్కరాచార్యుఁడు, ప్రకాశభారతీయోగి, ఎఱ్ఱయావ
ధాని, నిశ్శంకకొమ్మనమున్నగు వారొక్కరొక్కరే వచ్చిచేరిరి.
ఇంతలో నూరేగింపుకూడ వచ్చిచేరెను. ప్రభువు పట్టగజము నవరో
హించెను. లకుమాదేవి యెదురేఁగి యువరాజునుదీసికొనెను. వేమా
రెడ్డియు, నల్లాడరెడ్డియు నుభయపార్శ్వములఁ గేలూతయిచ్చుచుండఁ
బ్రభువు మందిరద్వారమును సమీపించెను. నాట్యాచార్యుల కభివాదన
మొనర్చి యాయన మున్నుగాఁ బ్రభువు నాట్యశాలయందడుగుపెట్టెను.
'వీరాస్వామి చలనాటా రాగమున ధీరమధురస్వరములఁ దీవలు తీవలు

గా నల్లుచుండెను. మంత్రి దండనాథ సామంతాదులును, గవిపండిత పౌరప్రధానులందఱును నాట్యమందిరముఁ బ్రవేశించిరి.

రంగపీఠమునెదుట నేర్పఱుపఁబడిన చతురాస్రాకారమగు మండలమున నడుమఁ బద్మాసనస్థుఁడగు బ్రహ్మయుఁ దూర్వునఁ సపరివారుఁడగు నీశానుఁడు నారాయణుఁడు, నింద్రుఁడు, స్కందుఁడు మున్నగువారును, దక్షిణమున యమ మిత్ర పితృగుహ్యకోరగులునుఁ బశ్చిమమున వరుణ సముద్రులును, నుత్తరమున యక్షధనదులును, నీశాన్యమున నందీశ్వర గణేశ్వరులును వాయవ్యమున సప్తవాయువులును గరుడుఁడును, నైరృతిని భూతరాక్షసాదులును, నాగ్నేయమున ఛాయాసహితుఁడగు నగ్నియును గంధర్వరుద్రాదులును మంత్రపూర్వకముగ నావాహనము గావింపఁబడిరి. వీరాస్వామి ద్వారముననిల్చి చలనాటరాగమున గలగలమని మూర్ఛనలు గురిపించుచుండెను. రివ్వున ద్వారమునకెగసి యటనుండి గిలిగింతలుగొట్టుచు నుడ్డీనచంక్రమణ రమణీయములగు పారావతముల వలె మంద్రమునకు దిగుచుండెను. ఆమూర్ఛనలు పైఁడికంటులు కిలకిలలాడినట్లు, పూరేడులు గలగలలాడినట్లు, దైవతపారిజాతములు జలజల రాలినట్లు కుమరగిరిప్రభువును బులకింపఁజేయుచుండెను. ఆమూర్ఛనల వెంటదిగివచ్చి బ్రహ్మేశాననారాయణమహేంద్రాదిదేవత లందఱుఁ గుమరగిరిప్రభువునెదుటి మండపమున నాట్యాచార్యనిర్దిష్టములైన తమ తమ స్థానముల నలంకరించుచుండిరి. నాట్యాచార్యుఁడా దేవతల నందఱను గంధమాల్యమధుపర్క పాయసాదులతోడను, భూతగణములను మధుమాంసాదులతోడను నర్చించెను.

అనంతరము నాట్యాచార్యుఁడు రంగమధ్యమునఁ గుంభమునిల్పి దానిని జలపూర్ణమునుఁ బుష్పమాలాలంకృతము గావించి యందొక సువర్ణఖండము నుంచెను. పిమ్మట నాతోద్యములను, విఘ్న జర్జరమును

వస్త్రములతో నాచ్ఛాదించి గంధమాల్యాదులతో నర్చించి ధూపాదు లొసంగిస్తుతించెను. తరువాత మంత్రపూర్వకముగా నాజ్యహోమము గావించి ప్రదీప్తములైన యుల్కలతోఁ బ్రభువునకును నర్తకీగణము నకును బరిమార్జనము గావించెను. మంత్రపూతములైన జలములు వారిపైఁ జల్లి "మీరు మహాకులప్రసూతులరు, మహాగుణాలంకృతులరు. మీ జన్మవలెనే జీవితమును గణోపేత మగుఁగాక! సరస్వతి, ధృతి, మేధ, హ్రీ, శ్రీ, లక్ష్మి, మతి యను సప్తనాట్యమాతలు మీకు సౌమ్యలు సిద్ధి ప్రదలు నగుదురుగాక!" అని వారి నాశీర్వదించెను. పిదప నాట్యాచార్యుఁడా కుంభమును బగులఁగొట్టెను. అది సరిగా రెండుముక్క లగుటఁ గాంచి యా శుభసూచనకు సభ్యు లెల్లరుఁ బ్రభువునకు జయవెట్టిరి.

కుంభభేదనానంతరము నాట్యాచార్యుఁడు చేత దీపికను బట్టు కొని క్ష్వేడిత స్ఫోటితవల్గితధావితములతో రంగస్థలమంతయుఁ దిరిగి రంగదీపనము గావించెను. వార్ధకమునకుఁ జిరాగ్రోపవాసము తోడైనను మహాదేవాచార్యుని రంగదీపన కోలాహల మెల్లరను విస్మయ ముగ్ధులను గావించెను. సముజ్జ్వలమైన యా రంగస్థలమున సర్వాతోద్యములు నొక్కుమ్మడిగా మ్రోగింపఁబడెను. నేపథ్య గృహద్వారములు తెఱచికొని సర్వాభరణభూషితులు సాయుధులు నగు యోధులు దూసికొనివచ్చి ముహూర్త మాత్రము కోలాహల ముగ యుద్ధక్రీడ గావించి వెడలిపోయిరి. రంగస్థలము నందచ్చటచ్చట నెత్తురునెత్తురులు చిందెను. శకునము నాట్యసిద్ధి సూచకముగ నుండుటచే నెల్లరునుఁ బ్రభువునకు మరల జయవెట్టిరి. నాట్యాచార్యుఁడు రంగశీర్ష మధ్యమున నిల్చి రంగపీఠముపైఁ బుష్పాంజలి యర్పించి నాట్యశాల ఇప్పుడు నాట్యప్రదర్శన యోగ్యమైనదని ప్రభువునకు నివేదించెను.

ప్రభువు ననుమతి వడసి కాటయవేమారెడ్డి రంగస్థలమున నిల్చి యిట్లు పలికెను.

"వేదశాఖోపశోభితము, శాస్త్రపుష్పసమాకీర్ణము, విద్వద్భ్రమర సంయుతము, సప్తాంగలక్షితము నగు సభాకల్పతరువునకు నమోవాకము. 'దేవానా మిద మామనంతి మునయః శాంతం క్రతుం చాక్షుషం' అని కాళిదాస మహాకవి నాట్యమును గీర్తించి యున్నాఁడు. ఋగ్వేదమునుండి పాఠ్యమును, సామవేదమునుండి గీతమును, యజుర్వేదమునుండి యభినయమును, నథర్వవేదములనుండి రసములను గ్రహించి సర్వశాస్త్రార్థసంపన్నమును సర్వశిల్పప్రదర్శనము నగు నీ నాట్యవేదమును భగవంతుఁడగు బ్రహ్మ సృష్టించెను. వేదవిహితమైన కర్మయజ్ఞమైనట్లు నాట్యవేదవిహితమగు కర్మయు యజ్ఞమే. వైదికయజ్ఞము పశుమారణకర్మచే దారుణమైనది. నాట్యయజ్ఞ మన్ననో శాంతమై చక్షుః ప్రీతికర మగుచున్నది. దేవత లీ నాట్యయజ్ఞముచేఁ బ్రీతులగుదురు. వైదిక కర్మకువలెనే నాట్యకర్మకును ఫలము స్వర్గమే. ఎవఁ డీనాట్యకర్మను అనుష్ఠించునో, యెవఁడు సావధానుఁడై దీనిని తిలకించునో వాఁడు వేదవేత్తలు, యజ్ఞ యాజకులు, దానశీలురుఁ బొందునట్టి యుత్తమగతిని బొందుచున్నాఁ డని బ్రహ్మయే యాదేశించెను. వామార్ధజాని యగు మహాశివుఁ డీ నాట్యమును తాండవలాస్య భేదమున ద్వివిధాకరించెను. శివకృతమైన యుద్దండ నాట్యము తాండవము. ఉమాకృతమైన లలితనాట్యము లాస్యము. లాస్యతాండవాత్మకమగు నీ నాట్యమునందు సత్వరజస్తమోగుణ సముద్భూతమై నానా రసాశ్రయమైన లోకచరితము ప్రదర్శితమగుచున్నది. ఇందు ప్రదర్శింపఁబడని జ్ఞానముగాని, శిల్పముగాని, విద్యగాని, కళగాని, యోగముగాని, కర్మగాని లేనేలేదు. త్రైలోక్యభావానుకీర్తనమైన యీ నాట్య

మున ధర్మప్రవృత్తులకు ధర్మము, కామోపజీవులకుఁ గామము, అర్థోప జీవుల కర్థము, నుద్విగ్నచిత్తులకు ధృతియు నుపలభ్యమానము లగు చున్నవి. సుఖదుఃఖ మిశ్రాత్మకమగు లోకచరితమునుఁ బ్రదర్శించున దయ్యు నీ నాట్యము భిన్నరుచి యగు లోకమును ఆనందైకరూపము ననే యారాధించుచున్నది. త్రిగుణముల యొక్క న్యూనత్వాధికత్వ ములచే జంతువుల చిత్తవృత్తులు మూఢ ఘోర శాంత రూపములఁ ద్రిధాభిన్నము లగుచున్నవి. తమఃప్రధానమగు మూఢవృత్తి సర్వ జంతుసామాన్యము. రజఃప్రధానమగు ఘోరవృత్తి జనబాహుళ్య సామాన్యము. సత్వప్రధానమగు శాంతవృత్తి వసంతరాయ మహా ప్రభువువంటియే యొక్కనియందో యుండును. రౌద్రకరుణ బీభత్స భయానక రసములుగ్రములు, ఉద్దండతాండవజన్యములు, మాహేశ్వ రములు. వీరశృంగారహాస్యాద్భుతములు ప్రసన్నములు, లలితలాస్య జన్యములు, వైష్ణవములు.

ప్రభువు శాంతచిత్తవృత్తి, పరమవైష్ణవుఁడు, లలితలాస్య వినోది, ప్రసన్నరసలోలుఁడు. వసంతరాయమహాప్రభువు నాట్యశాస్త్ర మహాదేవాచార్యుఁడు నాట్యశిక్షకుఁడు. లకుమాదేవినటి. పరిషత్తు రసజ్ఞము. ఈసన్నివేశము లోకోత్తరమైనది. గృహరాజసౌధస్వర్గ మున, వసంతరాయ దేవేంద్రుని సమక్షమున, లకుమాదివ్యసుందరి నాట్యమొనరించి పరిషద్దివ్యుల నానందపరవశులఁ గావించుఁగాక!" ఇట్లని కాటయవేమారెడ్డి సభకుఁ బ్రణమిల్లి స్వీయాసనము నలంకరిం చెను. కరతాళధ్వనులతో, జయజయధ్వానములతో సభయంతయు గగనాంగణమువలె శబ్దమాత్ర మయమయ్యెను.

రంగమండలమున దీపికాకాంతులు మందీకృతములగుచుండ సామాజికుల కరతాలకోలాహలము విరళవిరళమై యుపశాంతమ

య్యెను. రంగపీఠము సహస్రమణిదీపికా సందీపితమై స్తంభభిత్తికాగత ములగు శిల్పచిత్రములమీఁదినుండి సామాజికుల దృష్టుల నొక్కసారిగాఁ దన మీఁదికాకర్షించుకొనియెను. క్షణమాత్రము నిశ్శబ్దము. వియదంతరాళమునం దెచ్చటనో యారంభమై వాయువీథులఁ దరంగములు తరంగములై విస్తరిల్లి వాసంతమధుకర ఝంకారమంజులమైన తంబురాశ్రుతి క్షీరసాగర సముద్ధూత ఘుమంఘుమారావమువలె రంగమంటపము గర్భమునం దనంతపరివర్తన పరిణతప్రతిధ్వనిరూపమై సామాజికుల శ్రవోగోళములఁ జల్లగాఁ బ్రవేశించుచుండెను. సర్వేంద్రియములును చక్షుఃశ్రవణేంద్రియములఁ గేంద్రీకృతములై సామాజికుల యంతరంగములు నాట్యరంగమువలెఁ దేజోమయములు, నాదమయములునై పోయెను. ముఖయవనిక యల్లనల్లన నూర్ధ్వాభిముఖముగఁ దిరోహితమయ్యెను. రంగశీర్షమధ్యమునఁ గలశపయోరాశి గర్భమున లక్ష్మీదేవివలె లకుమాదేవి యక్షిగోచరమయ్యెను. ఆమె సౌమ్యశిరస్క, సమదృష్టి, సహజభ్రుపు, పతాకహస్త, కుంచితపాద. లలాటఫలకమునఁ గస్తూరీతిలకము, వక్షఃస్థలమునఁ గౌస్తుభము, నాసాగ్రమున నవమౌక్తికము, కంఠమున ముక్తావళి, కరయుగమునఁ గంకణములు ధరించి వైష్ణవియగు మోహినీమూర్తి యామెయైనట్లుండెను. ఆమె దక్షిణపార్శ్వమునఁ దాళధారి, వామపార్శ్వమున గీతకారుఁడు, నుభయపార్శ్వముల మార్దంగికులుఁ బృష్ఠభాగమున శ్రుతికారుఁడు నుండిరి. కాంస్యతాళములు కంగుమనెను. మృదంగములు ధణంధణలాడెను. పాదకింకిణులు ఘల్లుఘల్లురన లకుమాదేవి పదునాలుగు శిరోభేదములు, నిరువదినాలుగు దృష్టిభేదములు, ఆఱుభ్రూభేదములు, నాలుగు గ్రీవాభేదములు, నిరువదియెనిమిది హస్తభేదములు నవలంబించి నానావిధరణాంగహారములతోఁ దోళలయానుగుణముగ స్థానచారీభేదములఁ బ్రదర్శించుచు నాట్యమునకుఁ బ్రాణభూతకునుగు

నృత్తముయొక్క సమగ్రస్వరూపమును సామాజికుల కన్నులముందు సమర్పించి విరాట్స్వరూపమగు సభకుఁ బ్రణామాంజలి పట్టెను. అనంతరము శ్రుతిసాగర ఘనపరిణతమై యమృతధారా సహచారియగు మధురకంఠస్వరమున మాళవరాగాశ్రిత్రిగావించి గీతకారుఁడు

"వేదానుద్ధరతే, జగన్నివహతే, భూగోళముద్బిభ్రతే,
దైత్యాన్ దారయతే, బలిం ఛలయతే, క్షత్రక్షయం కుర్వతే,
పౌలస్త్యంజయతే, హలం కలయతే, కారుణ్యా మాతన్వతే,
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే, దశాకృతికృతే, కృష్ణాయ, తుభ్యంనమః"

అను గీతగోవిందశ్లోకమును బఠించుచుండ లకుమాదేవి దశావతార ముద్రలు పట్టి శ్లోకార్థమునకు నృత్యవ్యాఖ్యానము విరచించెను. "కృష్ణాయతుభ్యం నమః" యనుచో నామె వైష్ణవ స్థానక వంశీధారణ ముద్రలచేఁ 'కృష్ణాయ' యనుపదమును, పురఃప్రసారిత పతాకాహస్తములచే "తుభ్యం" అనుపదమును, లలాటస్థాంజలి చేతను విధూతశిరోభేదముచేతను 'నమః' అనుపదమును నభినయించెను. సభయందెల్ల వానికిని యభినయ మాత్రోద్దిష్టముగ భాసించెను. వామసభట్టున కది యెల్లఁ గాటయవేమారెడ్డిని సంకేతించుచున్నట్లు భాసించెను. కాటయ వేమారెడ్డి నిర్నిమీలిత నేత్రముల నాయభినయ పీయూషమును గ్రోలుచుండెను. ఈషద్వికసితకపోలతలుఁడై దరస్ఫుట దంతకాంతియై యపాంగరేఖారూపిత మందస్మితుఁడై కుమరగిరి మహీపతి కాటయవేమభూపతి ధీరసుందరమూర్తిని దిలకించుచుండెను.

మరల తాళమర్దళములు గలగలలాడెను. గీతకారుఁడు మాళవ రాగమునఁద్రిపుటతాళమున —

"ప్రళయపయోధిజలే ధృతవానసి వేదం" అని యష్టపది నారంభించెను. లకుమాదేవి మత్స్యకూర్మవరాహావతారములను లయమాత్రాశ్రయముగను, నారసింహ వామనావతారములను లయభావమాత్రాశ్రయముగను, దక్కిన యవతారములను లయభావ రసాశ్రయముగను ప్రదర్శించి చివరి చరణమును కృష్ణావతారపరముగ శృంగార రసాదిగా శాంతరసపర్యవసాయిగ నభినయించెను. దశావతార నాట్యమొక నాల్గుగడియలు నడచినది. అంతసేపును సభయంతయు నొక స్వాప్నిక మధురావస్థయందు మగ్నమై యుండెను. రంగస్థలమున యవనికావతరణము సామాజికుల యంతరంగముల నవిద్యావరణము నేకకాలమందయ్యెను. లకుమాదేవి నాట్యప్రదర్శనమును పరిపరి విధములఁ బ్రశంసించుకొనుచు నెల్లరును దమతమ నెలవులకేఁగిరి.

ధూళిధూసరితములగు జీర్ణవసనములవాఁడు, యువకుఁడానాఁటి మొఱసంజలోఁ గస్తూరీఘనసారగంధబంధురములగు కొండవీటి మత్త వాయువులనుఁ బ్రగాఢోచ్ఛ్వాసపరిపీడిత నాసాపుటుఁడై యాఘ్రాణించుచుఁ దిప్పయ్యగారి యింటికై వాడవాడలఁదిరుగాడసాగెను. వెలమవాడనుండి యక్కలవాడకు, నటనుండి గాండ్లగూడెమునకు, నటమీఁద మేదరవాడకు, నాపైనిఁ జాకలిపాలెమునకుఁ బోయెను. ఆతనియాకారవికారములనుగాంచి వీధులలో నాడుకొను పిల్లవాండ్రు కెవ్వనకేక వైచి యిండ్లలో దూరుచుండిరి. పసివాండ్రను భయపెట్టుచుండెనని పెద్దవాండ్రు కసరికొట్టవచ్చుచుండిరి. కొండవీటఁ దనకేదియో పట్టాభిషేకముజరుగునని యాతఁడాసించెను. అచ్చటఁ దనమొగముచూచువారే కనిపించరు. తానేమో వయసువాఁడని యందగాఁడని తాను గర్వించెను. కొండవీట నందములేనివారెవ్వరు? కొండవీటి వసంతము కాయకల్పమహిమగలది. ఆయుత్సవదినములలోఁ బండుముదుసలులును

బచ్చిబడుచు లగుచుందురు. కొండవీటి పురుషులయందము తన కీర్ష్య పుట్టించుచున్నది. కొండవీటి స్త్రీలయందము తన్ను లోభపెట్టుచున్నది. తనకు సౌందర్యమనినఁ బ్రాణము. అది యుండినఁ దినకాకలిదప్పు లగపడవు. లోలుపములగు తనచూపులు సుందరరూపములవై ప్రసాగి తిరస్కార తాడితములై తనకే గ్రుచ్చుకొనుచున్నవి. ధూళిధూసరితములైన జీర్ణవసనములు, కస్తూరికాపంకిలములైన యవయవములు. ఇతరుల యొడళ్ళ కలంకారమైన కస్తూరి తన యొడలికిఁ గళంకమైనది. ఆతనికన్నుల యెదుటఁ జీకటి కస్తూరికారాశివలెఁ గ్రమ్ముచున్నది. కస్తూరికామదముచేఁ గావలె ఆతనితల గిఱ్ఱునఁ దిరుగుచున్నది. మేను తూలిపోవుచున్నది. ఆతఁడట్లే కాళ్ళీడ్చుకొనుచుఁ జాకలిపాలెముసందు గొందులఁ దిరుగుచుండెను. చలువమడతలు మూఁపులం దలంకరించుకొని ఖరరాజములు చాకలివాడ సందులఁ జిటుకుచిటుకున నడయాడుచున్నవి. చాకలివాడయావల బలిజెవాడ. ఆవాడ మొదటనొకయంగడి. అంగడిలో నరటిపండ్లగెలలు. ఆతనికి ఆకలి భగ్గునమండుకొనివచ్చెను. ఒక్క యుదుటన నాతఁడా యంగడి సమీపించెను. తనవద్దఁ జిల్లిగవ్వయు లేదు. అంగటిలోని పండ్లగెల యాతని యంగిట గంతులువైచుచుండెను. తానుకవి. పద్యమిచ్చినచో నంగటివాఁడు పండ్లిచ్చునేమో! పద్యమున కొకపండైనమాత్రమేమాయె? అతనికిఁ జంకలోని తాళపత్రములు గుర్తువచ్చెను. ఒక గ్రంథమిచ్చి యొకగెలపుచ్చుకొందునా యనిపించెను. ఈగ్రంథములు కుమారగిరిప్రభువునకు వినిపింపవలయును. ఆయనవద్దఁ గస్తూరికా తాంబూలము చీనాంబరములుఁ బుచ్చుకొనవలెను. కడుపులోని యాకలిమండిమండి కన్నులలోనికిఁ గ్రమ్ముకొని వచ్చుచుండెను. మండుచున్న యా కండ్లతో నాతఁడా పండ్లగెలలను గబళించుచుండెను. ఆతనికన్నులవెంట గిఱ్ఱున నీరు తిరిగెను. ఎంత యాశతో, నెంత యావేశముతోఁ దాను కొండవీటికి వచ్చెను! కడుపు

మంటచేఁ దనకుఁ గంటనీరు తెప్పించిన కొండవీటిని భస్మము చేయుదమన్నంత కోపమువచ్చెను. ఆతఁ డెడమచేతితోఁ గంటినీరు తుడిచికొనఁబోయెను. కంగుమని నేలపైఁ జప్పు డయ్యెను. ఊరేగింపులో నెగిరి వచ్చి తనచేతఁజిక్కిన నాణెమది. తానింతసేపును దాని సంగతియే మఱచెను. ఆతఁడా నాణెమునిచ్చి యరటిపండ్లుకొని సందుమలుపున ఱాతిపలకపైఁ గూర్చుండెను. ఒక్కొక్కపండునొలిచి యిష్టలింగమునకు నివేదించి యారగించుచుండెను. ఆకలిచల్లారిన కొలఁదియు నతనికాలోచన మధికమయ్యెను. తిప్పయ్యగారి యిల్లు తెలిసికొనుటెట్లు ? ఈరేయి గడపుట యెచ్చట ? పోనీ తిన్నగా రాజమందిరమునకే పోయినచో ! తానుకవి. కుమరగిరి తన్నాదరింపఁడా !

సందు మలుపునఁ బనిలేని గాడిద యొకఁడు తీరికగా నోండ్రపెట్టసాగెను. ఆతని యాలోచనలు చెదరిపోయెను. హ్రస్వదీర్ఘప్లుతముల నుదాత్తానుదాత్తస్వరితముల సర్వస్వరసంకరమగు కటుగభీరకంఠమున సంసారదుఃఖప్రశమనకారియగు శాంతిపాఠమును పఠించి యా ఖరరాజము భస్మోద్ధూళితసర్వాంగమై పరమహంసవలె ప్రసన్నవదనమయ్యెను. ఆకలితీరి, కలకదేరిన యువకుని వదనమునఁ జిఱునగవు తొలుకాడెను. ఆతని గళమునుండి యప్రయత్నముగఁ బద్యమల్లుకొని వచ్చెను.

"బూడిదబుంగవై యొడలుపోడిమిదక్కి మొగంబువెల్లనై
వాడలవాడలం దిరిగి వాఁడును వీఁడును ఛోఛ్ఛోచో యనన్
గోడలగొందులం దొదిగి కూయుచునుందువు కొండవీటిలో
గాడిద నీవునుం గవివి గావుగదా, యనుమానమయ్యెడిన్.

సంజచీకటులు జిలిబిలిగా నలముకొనివచ్చుచుండెను. బ్రాహ్మణవాడలో బట్టలప్పగించి చాకలి రామి యింటికిఁ బోవుచు సందుమలు

పునః దమగాడిదనుగాంచి "పనిలేనట్లే సందుగొందులఁ బచారులు పోవు చుంటివా ? పదపద" మని దాని నదలించెను. యువకుఁడా చాకితం చూచి "ఈ గాడిద మీదేనా ?" యనెను.

చాకలి :— కానిచో నేనేల తోలుకొనిపోదును ?

యువకుఁడు :— మంచిగాడిదనే సంపాదించితివి. చూచితివా నీగాడిద యీనాఁ డెంతపని చేసినదో !

చాకలి :— ఎవరినేనిఁ గరచినదా యేమి పాపము ?

యువకుఁడు .— కాదుకాదు. కఱువలేదు. కవిత్వము చెప్పించినది.

చాకలి :— ఓసి నీమొగముమండ ! నీకుఁ గవిత్వము కావలసి వచ్చినదా ? "యనుచుఁ జాకిత గాడిదవెన్నుపై నొక్కచఱపుఁ జఱచెను.

యువకుఁడు :— కొట్టకు, కొట్టకు. దీనికెంత చక్కని పద్యము సంకితము చేసితిని. ఇదిగో వినుము" అని యాతఁ డా పద్యమును మఱలఁ జదివెను.

చాకిత :— కొండపీటిగడ్డ యనగా నట్టిది. గాడిదలుగూడ కావ్యము చెప్పించుచున్నవి. పాపము, నీవు కవివి గాబోలు ! ఉత్స వములకు వచ్చితివా ? ఏయూరు స్వామీ నీది ?

యువ :— మాది పాకనాటిసీమ. నేను వసంతోత్సవములకే వచ్చితిని. వసంతరాయమహాప్రభువును దర్శింపవచ్చితిని.

చాకిత :— ప్రభువు ధర్మరాజు. చేతికెముకలేని మహాదాత. ప్రభువును దర్శింపఁగలిగినచో నీదరిద్రము తీరిపోవును. ఉత్సవములకు వచ్చినవాఁడవు చాకలివీధులఁ దిరుగుచుంటివేమి ? బాబూ కవీశ్వరులకీ యుత్సవములలో ప్రభువు ప్రత్యేక భోజనవసతు లేర్పరచెంగదా !

యువ :— నాకాసంగతి తెలియదు. ఈనగరమున మాబంధువు లున్నారు. వారియిల్లు తెలియక తిరుగుచున్నాను.

చాకిత :— ఎవరువారు ?

యువ .— దగ్గుబల్లి తిప్పయ్యగారని.

చాకిత .— వారి యింటిచాకలిని నేనే. ఇదిగో వారియిల్లు సమీపముననేయున్నది. రా. సామీ! నీకు వారియిల్లుచూపుదును. మాగాడిదకుఁ బద్యమంకితమిచ్చితివిగదా ! నీకీ చిన్నయుపకారముచేసి దాని ఋణము దీర్చెదను.

"పదపద. ఇఁకఁ జాలులె" మ్మని గాడిదను గసరి యింటివైపు దరలించి చాకిత తిప్పయ్యగారి యింటికిఁ ద్రోవతీసెను. తాళపత్రము లతోఁ జుట్టిన సాలువుఁ జంక నమర్చుకొని యువకుఁ డామె వెంటఁ బయలుదేరెను. రెండుమూఁడు సందులడ్డదిడ్డముగాఁ ద్రిప్పి "యదిగో! అగుమ్మమే యరియేటి యన్నయమంత్రిగారియిల్లు. తిప్పయ్యగారా యింటనే యుండు" రని యింటిగుమ్మముగుఱుతుచూపి చాకిత గిఱుక్కున దిరిగి యింటిదారిఁబట్టెను.

అన్నయమంత్రిగారి యింటివాకిటి కావలిబంటు యువకునిఁ జూచి "ఎవరికోసము" అని గద్దించెను.

యువ :— దగ్గుబల్లి తిప్పయ్యగారికోసము.

బంటు :— ఏమిపని ?

యువ :— ఆయన మా చుట్టము.

బంటు :— చుట్టమూ ? నీకా ?

యువ :— అవును. ఆయన మా మేనమామ. ?

కాపలిబంటు యువకుని లోనికిఁ గొనిపోయి తోటలో నొక మూలగా నున్న పూరియింటి యరుఁగుపైఁ గూర్చుండిన తిప్పయ్య గారికి నమస్కరించి "అయ్యా! ఎవరో మీ బంధువట" యనెను. తిప్పయ్యగారా యువకు నెగాదిగఁ జూడసాగెను. యువకుఁడు నవ్వుచు "నేనే మామా! అట్లెగాదిగఁ జూచెదవేమి ?" యనెను. తిప్పయ్య గారికి కంఠస్వరము గుర్తువచ్చెను. ఆయన యొక్క బొంగురునవ్వునవ్వి "ఓరి నీ మచ్చమాయ! నీవటరా తిరుపతయ్యా! ఈ యసుర సంధ్య వేళఁబిడుగు పడినట్లు వచ్చిపడితివి. ఎక్కడినుండి యీరాక ?" అనెను.

తిరుప :— ఇంటివద్దనుండియే వచ్చుచున్నాను మామా!

తిప్ప :— అమ్మ క్షేమముగా నున్నదా ? ఇంటివద్ద చెప్పియే వచ్చితివా!

తిరుప :— ఏమిమామా! అట్లందువు ?

తిప్ప :— వేళగానివేళ యీ రాక, యీ వేషముచూచిన నేమనుకొందురు ?

మీ నాయన పోయిన నాటినుండియు నీవు మీ యమ్మనుబెట్టిన త్రిప్పలు నిన్నుజూడఁగనే నాకు గుర్తువచ్చి యట్లంటిని. ఏమి కోపము వచ్చినదా ?

తిరుపతి :— కోప మెందులకు మామా!

తిప్పయ్యగారు నవ్వుచు "దుర్గా" యని కేకవైచెను. పంౘ్రెండేండ్ల బాలిక, మసిగుడ్డలోఁగట్టిన మాణిక్యము. "ఓ" యని యింటి లోనుండి పలికెను. తిరుపతయ్యకా కేక కోకిల 'కో' యనినట్లుండెను.

"మీ తిరుపతిబావ వచ్చినాఁడమ్మా. కాళ్ళు గడిగికొనుటకు నీళ్ళు తీసికొనిర" మ్మని తిప్పయ్యగారు మాట ముగించుచుండఁగనే దుర్గ నీళ్ళ చెంబుతో ద్వారబంధమునఁ బ్రత్యక్షమయ్యెను. అన్నయ మంత్రిగారి యింటి గవాక్షమునుండి ప్రసరించుచున్న దీపపు వెలుఁగులో దుర్గ ముఖము తళుక్కుమనినంతఁ దిరుపతయ్య కన్నులు మిలమిల మెఱసెను. దుర్గ యాతనివంక నివ్వెఱపడి చూచుచు "నాన్నగారూ! సాయంకాలము బావ నా కగపడినాఁడు. నేను గుర్తుపట్టలేకపోతిని" అనుచు నీళ్ళచెంబు గడపపై నుంచెను.

తిప్పయ్య :— బావను నీ వెక్కడ చూచితివమ్మా?

దుర్గ .— మడి సంతలోఁ గూరలు తెచ్చుటకుఁ బోతినిగదా! అప్పుడు రాజవీధిలోఁ జూచితిని.

తిప్పయ్య :— ఏమిరా తిరుపతయ్యా!

తిరుపతి :— అవును మామా! నేను మధ్యాహ్నమే కొండవీడు వచ్చితిని.

అప్పటినుండియు మీ యింటి కొఱకూరంతయుఁ దిరిగి తిరిగి నా కాళ్ళు కండెలు గట్టినవి.

తిప్పయ్య :— తెలివిగలవాఁడవు. మంచిపనిచేసితివి. ఇంతకును నీకుఁ జిన్నతనమునుండియుఁ దిరుగుడలవాటే కదా! ఇప్పటికైనఁ గొంపకుఁ జేరినందులకు సంతోషము. అమ్మాయీ! దుర్గన్న యప్పుడే నిద్దురకుఁబడినాఁడు గాఁబోలు. బావ కొక యంగవస్త్రము దెచ్చి యిమ్మా, స్నానము చేయునేమో. ఏమిటి తిరుపతీ! స్నానము చేయుదువా!

ఇట్లనుచుఁ దిప్పయ్యగారింటిలోని కేఁగిరి. 'తిరుపతి' యను మాట వినినప్పుడెల్ల శ్రీనాథునకు గుండెలలో ములుకులు గ్రుచ్చినట్లుండెను.

అవచివంశస్థులగు వణిక్పుంగవులకు విక్రమ సింహపురము పైతామహస్థానము. కాంచీపురము మాతామహస్థానము. ఉభయవంశములును భూతల సముద్రతల వ్యాపారములం దగ్రగామిత్వము వహించి యశైశ్వర్యము నార్జించి రాజాధిరాజులకుఁ దలలో నాలుకలై ప్రవర్తిల్లుచుండెను. విక్రమ సింహపురమునందవచి పాణయసెట్టి వణిజులకుఁ జక్రవర్తి. ఆయనకు నౌకాయానము నందభిలాష మెండు. ద్వీపాంతరములలో నౌకావ్యాపారము నాయనయే మొదట నారంభించెను. ఆయన పుత్రుఁడు దేవయసెట్టి, తండ్రి యారంభించిన నౌకావాణిజ్యమును శతధావృద్ధి గావించెను. ద్వీపాంతరములనుండియు, ఖండాంతరములనుండియుఁ బద్మరాగాది మణివిశేషములను, గస్తూరి ఘనసారాది సుగంధ ద్రవ్యములను, సింధురములను, సైంధవములను, శాలిధాన్యములను, చీనాంబరములను గొనివచ్చి దక్షిణభారతము నందలి, భూపాలురకు విక్రయించి యపరిమితమగు ధనము నార్జించెను. తిప్పయసెట్టి కుబేరుఁడన్నచో న్యూనోక్తి దోషముపట్టును. ఆయన రాజ్యము లేనిరాజు. ఆనాటి రాజ్యముల కాయన ప్రాణము. ఆయన రేవులకడఁ జెల్లించు సుంకములతో రాజ్యములు బ్రదుకవచ్చును.

కప్పలి, జోంగు, వల్లి, వలిక, సమ్మను మున్నగు నౌకాభేదము లాయనకు వందలుగాఁ గలవు. చీనినుండి చీనాంబరములు, పంజాబమునుండి కర్పూరము, కాశ్మీరమునుండి కుంకుమపువ్వు, గోభోంటల నుండి కస్తురిజవాదులు, మలయా నుండి చందనము, తరుణాసీఁనుండి పటీరజలము యాంపనుండి ముత్యాలు, సింహళమునుండి

యేనుంగులు హురుముంజినుండి జవనాశ్వములు, ఢిల్లీనుండి కప్పురభోగి తండులములు నాయన తెప్పించువాఁడు. కుబేరుఁ డొక్కఁడిక్కునకే యధిపతి. అవచి దేవయసెట్టి యన్ని దిక్కులకు నధిపతియే.

దేవయ తండ్రి తాత లెల్లరు మహాభక్తులు, మహాదాతలు. ఉభయవంశములందును పరమమాహేశ్వరులుఁ బరమవైష్ణవులుగలరు. కంచి యేకామ్రనాధునకు హర్మ్యములు గట్టినవారు, వరదరాజస్వామి బొడ్డున బాలార్కమను పద్మరాగమణిఁబొదివించినవారు, తిరువళ్ళూర యోజనత్రయాయతమగు తటాకము గట్టించినవారు, కావేరీనదికిఁ గార్పాసరాసులతో సేతువులునిర్మించిన వారు దేవయవంశీయులు. వారు వస్తుబేహారములతోపాటు కీర్తిబేహారమూను వితరణఖనులు. దేవయసెట్టికుమారుఁడుతిప్పయసెట్టి. తండ్రిద్వీపాంతరముల కేగి తెచ్చిన సామగ్రిని కుమారుఁడు దేశమున నానారాజన్యుల భాండాగారములకుఁ జేర్పించుచుండువాఁడు. దేవయసెట్టి వృద్ధుఁడగుటచే నీనడుమఁ దిప్పయసెట్టియే స్థానికవై దేశిక వ్యాపారమంతయు నిర్వహించుకొనుచుండెను. తిప్పయసెట్టి కక్షురాభ్యాసముగావించినవాఁడు పిల్లలమఱ్ఱి పెద్దన్నగారు ఆయనచేతిచలువ యూరకపోలేదు. తిప్పయసెట్టికి వాణిజ్యముతో పాటు సాహిత్యమునందుఁగూడ చక్కని యభిరుచి యేర్పడినది. వ్యాపారము తిప్పయచేతికి వచ్చిననాటినుండియు దేశమున వసంతోత్సవము లందాసక్తి యినుమడి ముబ్బడియైనవి. ఒక్కొక్క యే డొక్కొక్క రాజ్యమున సుగంధశాలాధ్యక్షతవహించి యాతఁడు రాజులందఱకు వసంతోత్సవములు నిర్వహించుకొనుట నేర్పెను. తనశైవాచారము వలన వ్యాపారమునకు దెబ్బరాకుండ పరమవైష్ణవులగు ప్రభువులకుఁ గూడ ప్రాణమిత్రుఁడై నిర్వహించుకొనఁగల నీతిచతురుఁడు తిప్పయ

సెట్టి. విద్యానగరనరపతులకు, దేవగిరియశ్వపతులకుఁ గటకపురగజ పతులకు నాతఁడు వసంతసచివుఁడు.

ఇంతవఱకుఁ గుమరగిరి ప్రభుని ప్రతివర్ష వసంతోత్సవములను దేవయసెట్టి స్వయముగ నిర్వహించుచుండెను. తాను వృద్ధుఁడు. సమర్థుఁడైన కుమారునిపై సర్వభారము విడిచిపెట్టి తాను కంచి యందే స్థిరనివాసమేర్పరచుకొని యేకామ్రనాథునిసన్నిధిని గాలక్షేపముచేయవలెనని దేవయసెట్టికి సంకల్పముగలిగినది. కుమరగిరి ప్రభువునకీమాట చెప్పి కుమారు నాయన కొప్పగించిపోవలెనని యాయన యీయేఁడు తిప్పయసెట్టినిగూడ వెంటబెట్టుకొనివచ్చెను. దేవయసెట్టి యభిప్రాయ మెఱింగి రెడ్డిరాజ్యమై భవమున కాయన యిన్నియేండ్లుగాఁ జేసిన సేవకుఁ దగినరీతి నాయనను సన్మానింపఁదలఁచి ప్రభువానాఁడు కొలువు దీర్చెను. సర్వరాజ లాంఛనములుధరించి సముజ్జ్వలవేషుఁడై ప్రభువు రత్నసింహాసనమలంకరించెను. ప్రభువుప్రక్క బాలాసనమునఁ గుమారాన్న పోతారెడ్డి యాసీనుఁడై యుండెను. దక్షిణపార్శ్వమునఁ గాటయ వేమారెడ్డియు నల్లాడరెడ్డియు, వామపార్శ్వమున దేవయసెట్టియుఁ దిప్పయసెట్టియు నాసీనులై యుండిరి. దుర్గాధిపతులు, సీమాధిపతులు, దండనాథామాత్యులును దమతమ యధికార లాంఛనములు ధరించి యుచితాసనముల నలంకరించియుండిరి. వామనభట్టువేదికపైకే తెంచి,

"కీర్తిప్రతాపసౌభాగ్య త్యాగభోగవిభూతిభిః
ఏక ఏవ కలౌ శ్లాఘ్యః కుమారగిరి భూపతిః
వసంతవేలాసు దిశావధూనాం కర్పూరఖండైఃకృతమండనశ్రీః
కుమారగిర్యాఖ్యవసంతరాయః కీర్తిప్రతాపాభరణో విభాతి.

అని పఠించినంత నిరుపురుషందులు వేదికకిరువైపులనిల్చి "శ్రీ మన్మహారాజాధిరాజ, జగనొబ్బగండ, అనియమండలీకరగండ, అపటి

మితభూదాన పరశురామ, అనేకనగరోపకంఠప్రతిష్ఠాపిత బహువిధా రామ, జగదగోపాల, గుజ్జరితట్టువిభాళ, ప్రజ్ఞాచతుర్విధోపాయ, కేళాదిరాయ, రాయవేశ్యాభుజంగ, వీరనారాయణ, కర్పూరవసంత రాయ శ్రీ శ్రీ శ్రీ కుమారగిరిభూపాల జయీభవ విజయీభవ" యని బిరుదప్రశస్తి పఠించిరి.

పిమ్మటఁ గాటయవేమారెడ్డి యిట్లు పలికెను.

"అఖండమైనకాల మీశ్వరస్వరూపము. సృష్టిస్థితిలయము లనెడు నీశ్వరలీలలీ కాలాధీనములై ప్రవర్తిల్లుచున్నవి. అనంతకళ్యాణ గుణుఁడగు పరమేశ్వరుఁడు తన విశ్వమోహనమూర్తితో సాక్షాత్కరించుకాలము వసంతము. శ్రవణసుభగములగు కోకిలగానములచే, ఘ్రాణసుఖములగు సురభిళానిలములచే, స్పర్శసుకుమారములగు పల్లవగుచ్ఛములచే, దర్శనోత్సవములగు చిత్రవర్ణపుష్పములచే, రసనాస్వాదువులగు సరసఫలములచే సర్వేంద్రియ సంతర్పణ మొనరించు వసంతము సకలఋతురాజము. వసంతఋతువున కధిష్ఠాన దేవతయగు మదనదేవునిఁ బూజించుట యనఁ గాలాత్మకుఁడగు పరమేశ్వరుని బూజించుటయే. కొండవీటిరాజ్యమునం దీవసంతోత్సవ నిర్వహణాచారము నెలకొల్పినది శ్రీ యనవేమమహాప్రభువు. శ్రీ కుమరగిరి ప్రభువా యాచారమును దప్పక పాలించుచున్నారు. వేమప్రభువులనాటినుండియు నవచి దేవయసెట్టి గారే యీయుత్సవనిర్వహణమునఁ బ్రభువులకుఁ గుడిభుజమై యుండిరి. కాలమంతయు వసంతముగనే భావించి యారాధించి యనుభవింపఁగల భావుకులు దేవయసెట్టిగారు. మన్మథునకుఁ జైత్రునివలెఁ గుమరగిరి ప్రభువులకు దేవయసెట్టిగారు తోడై కొండవీటి వసంతోత్సవములను విశ్వవిఖ్యాతము గావించినారు. శరదృతువున గజతురంగకరవాలాది

సమరసామగ్రిని, వసంతఋతువునఁ గస్తూరికాఘనసారాది సరససామగ్రిని సమకూర్చి దేవయ సెట్టిగారు కొండవీట వీరశృంగారముల విహారములకు దోహదము గావించుచున్నారు. ఈరాజ్యమునకుఁ దరతరములుగా వా రొనర్చుచుండిన యమూల్యసేవకుఁ గుమరగిరిప్రభువు లత్యంతసంతుష్టి హృదయులై నేఁడు వారిని సన్మానింప సంకల్పించియున్నారు. వణిగ్జాతి కాయన కిరీటములేనిరాజు. ప్రభువాయనకు రాజోచితములగు లాంఛనము లొసఁగి సంభావింపఁబూనుట యుచితజ్ఞతకు లక్ష్యభూతముగ నున్నది. ”

గజతురంగపహాందోళికాచ్ఛత్ర చామరాది రాజలాంఛనము లొసంగి యనర్ఘమణిమయమగు పతకమును గంఠమునం దలంకరించి కుమరగిరిభూపతి దేవయ్యసెట్టిభుజముదట్టి సంభావించెను. దేవయసెట్టి యుత్సాహమున నుప్పొంగుచు ముఖమున నానందము వెల్లివిరియుచుండఁ బ్రభువునకును, సభకును వంగి నమస్కరించెను. ఆయన కుద్రేకము తల మున్క లగుచుండెను. తాను కోట్లకొలంది ధనమార్జించెను. రాజాధి రాజుల మన్ననలందెను. కాని నేఁడు కుమరగిరిచేసిన సన్మాన మాయతను బరవశునిఁగావించినది. ఇట్టిసంభవించునని యాతఁడెన్నఁడును నూహించి యుండలేదు. తాను వైశ్యుఁడు. వాణిజ్య మాయన కులవృత్తి. భగవంతుని కృపవలనఁ దనకావృత్తియందుఁ జక్కగాఁ గలిసివచ్చినది. పరమేశ్వరుఁ డొసంగిన యీ సిరిసంపదలకే యాతఁడు పరమసంతుష్టుఁ డగుచుండును. నేఁడు కుమరగిరిప్రభువు కావించిన సన్మాన మాయనకు స్వాప్నికానుభవమువలె నుండెను. కుమరగిరిప్రభువు స్వయముగఁ దనకంఠమున పతకహార ముంచుచుండఁ దేవయ సెట్టికి సర్వాంగములను బులకీకృతము లయ్యెను. ఆయన హృదయము ద్రవించి కన్నులలో బాష్పములుగా నిలిచెను. కనురెప్పల బాష్పజలము నప్పళించుకొనుచుఁ, గళమునఁ

దత్తియిక్కొనివచ్చు గాద్గద్యము నణంచుకొనుచు నాతఁడు పట్టఁజాలని యానందోద్రేకమునఁ బ్రభువు పాదములంటి కంటికద్దుకొని యి ట్లనియెను.

"శ్రీమత్కుమారగిరి మహాప్రభువులు పరమ కరుణామయులు. హేమాద్రి నిగదితదానవ్రతదీక్షితులు. లలితకళానతాగులు. ఏబది యేండ్లుగా అవచివంశము పంటవంశము నాశ్రయించుకొని వర్ధిల్లుచున్నది. శ్రీవారు యువరాజపట్టాభిషిక్తు లయిన నాఁటినుండియు మాకు వసంత మర్థవంతమైనది. కొండవీటఁగస్తూరిరాసులు మాయింటఁగనకరాసులు గురిసినవి. ప్రథమపరిచయముహూర్తముననే ప్రభువులకు నాయందను తానురాగ ముదయించెను. అమితవిశ్వాసము గుదురుకొనెను. ఏమేమి ద్రవ్యములు తెచ్చితినో ఎంతెంతధనము పుచ్చుకొంటినో నాకే తెలి యును. ఈనాఁడు ప్రభువులు నాకీ యపూర్వగౌరవము గావించినారు. ఇది నేనెన్నఁడును నాసించినదికాదు. ప్రభులు నాకును నావంశమునకును. నాజాతికిని గావించిన యీ యుదారసన్మానము నన్ను ముగ్ధుని గావించు చున్నది. ఏమి చెప్పవలెనో, ఏమి చేయవలెనో నాకుఁ దోఁచకున్నది. ఈరాజలాంఛనములతోపాటు సశ్శుల్కముగ మోటుపల్లి రేవున వ్యాపా రముచేసికొను నధికార దానశాసనమునుగూడ ప్రభువులు మావంశము నకుఁ బ్రసాదించినారు. ప్రభువుల వితరణము నన్నానందముచే నప్రతి భునిఁ జేయుచున్నది. నేనేమియుఁ జెప్పఁజాలకున్నాను. ప్రభువులు నాకు ప్రసాదించిన బిరుదాధికారములను మా తిప్పయసెట్టి కప్ప గించుచున్నాను. ఆతనిని ప్రభువుల కప్పగించుచున్నాను. నేపువాన ప్రభువులే ప్రమాణము" అనుచుఁ దేవయసెట్టి ప్రభువు ప్రసా దించిన బిరుదహారమును గొడుకు కంఠమునం దలంకరించి, దానశాసనము నాతని హస్తములందుంచి యాతనిని ప్రభువు చేతుల నప్పగించెను,

ఉత్తరీయాంచలమునఁ గన్నులు దుడిచికొనుచుఁ దన యాసనముచెంతే నిలుచుండెను.

తిప్పయసెట్టి ముప్పదియేండ్లవాఁడు. గళమున బిరుదపతకమును గరమున నధికారపత్రమును ధరించి యాతఁడు క్రొత్తగాఁ బట్టాభిషిక్తుఁడైన రాజకుమారునివలె నుత్సాహము మూర్తీభవించి నట్లుండెను. ఆతఁడు ప్రభువుపాదములకుఁ బ్రణమిల్లి "తరతరములనాటి యవచి పంటాన్వయముల యనురాగబంధ మీనాఁడు మాయందిట్లు ఫలించినది. ప్రభువులు సృష్టించిపోషించిన మాయంగబలము నర్థబలము ప్రభువుల యధీనములు. ప్రభువుల యభ్యుదయమే మా యభ్యుదయము. సర్వ రాజ్యములును మాకు బంధుగృహములవంటివి. కొండవీటి రాజ్యము మాకు స్వగృహమువంటిది. ప్రభువులు మా తండ్రిగారియం దెట్టియను రాగప్రత్యయములుంచిరో అట్టివి నాయందునుఁ బ్రసాదింతురని ప్రార్థింతును. అవచివంశీయుల యంతఃకరణము ప్రభువుల కనుభవసిద్ధమైన ప్రత్యక్షవిషయమే కదా" యని ప్రభువునకు, యువరాజునకు, సభకు నమస్కరించెను.

ప్రభువున కేవో యాలోచనలు పోవుచుండెను. దేవయసెట్టి యెంత యదృష్టశాలి! అక్షయమైన యైశ్వర్యమును సమర్థమైనసంతానమున సమర్పించి జీవితచారితార్థ్యమును జూరలుగొనుచున్నాఁడు. తానో! కేతుగ్రస్తమయినరాజ్యము, రాహుగ్రస్తమయినసంతానము. దీర్ఘముగ నిశ్శ్వసించి ప్రభువు కొలువుచాలించెను.

బారెడుప్రొద్దెక్కినను శ్రీనాథుఁ డింకను నిద్రలేవలేదు. తిప్పయ్యగారు స్నానాద్యనుష్ఠానములు తీర్చికొని యరుగుపైఁ గూర్చుండి లెక్కలు వ్రాసికొనుచుండెను. బావ ముఖముగడిగికొనుటకై దుర్గ యరు

గుపైఁ జెంబుతో నీళ్ళును పలుదోముపుల్లయు సమర్చి యుంచెను. ఇంటిలోఁ బిల్లలసందడి యధికముగ నుండెను. దుర్గన్న "తిరుపతిబావా, తిరుపతిబావా," యని శ్రీనాథునిఁ దట్టి లేపెను. అతఁ డులికిపడిలేచి దుర్గన్నను దినివేయునట్లురిమి చూచెను. దుర్గన్న యడలిపోయి వంట యింటిలో నక్కచాటున నక్కెను. శ్రీనాథుఁడు మంచమునడుమఁ దీరి కూర్చుండి "మామా! నేను కుమారగిరిప్రభువునుఁ జూడనలె" నని కేకవైచెను. "ముందు మొగము గడుగుము. తరువాతఁ జూడవచ్చు" నని యాయన నవ్వెను. శ్రీనాథుఁడు మంచము విడిచి యరుగుపైఁ గూర్చుండి ముఖము గడుగ నారంభించెను. తిప్పయగారాతనివంకఁ జూచి "తిరుపతీ! మెడలో నది యేమిటిరా?" యనెను. శ్రీనాథున కొడలు మండుకొనిపోయెను." ఇదిగో మామా! నీవు నన్నింకఁ దిరుపతీ తిరుపతీ యనరాదు" అనెను.

తిప్పయ్య :— పేరు పెట్టి పిలిచిన నట్లులికి పడెద వేమిరా?

శ్రీనాథుఁడు :— నాపేరు తిరుపతిగాదు.

తిప్పయ్య .— తాతవలె నీవుఁగూడ పేరు మార్చుకొంటివా యేమి?

శ్రీనాథుఁడు :— అవును. ఈ వెధవ తెలుఁగుపేరు నాకసహ్యముగా నున్నది.

తిప్పయ్య :— అందులకని సంస్కృతపుఁ బేరు పెట్టుకొంటివా!

శ్రీనా .— అవును. నీవింక నన్ను శ్రీనాథుఁడు అనవలెను.

తిప్పయ్య '— సరే. పేరు మార్చుకొంటివి గాని గుణమేమియు మారినట్లు లేదు.

శ్రీనా :— నీ కట్లే యుండును. బండెడు సంస్కృతగ్రంథములు చదివితివి. కాదంబరి నాకుఁ గంఠస్థము. కాదందువేసిఁ గాచికొనుము. ఇట్లని శ్రీనాథుఁడు పలుదోముపుల్ల పంటి సందుననే యుండఁ గాదంబరి గడగడ నొప్పగింపసాగెను. తిప్పయ్య పకపక నవ్వుచు “ ముఖమార్జనము పూర్తిచేయుము. కుమరగిరి ప్రభువున కొప్పగింతువులే ” యనెను. శ్రీనాథుఁడు మొగముగడిగి స్నానమునకు సిద్ధమయ్యెను.

తిప్పయ్య :— ఒరే తిరుపతీ ! మెడలో నది యేమిటిరా ?

శ్రీనా .— ఇష్టలింగము.

తిప్పయ్య :— గళమున శివలింగము గట్టితివి. కంఠమున గాదంబరిఁ బట్టితివి. కొండవీటఁ గాలుపెట్టితివి. వీథిలో నడుగుపెట్టి చూడుము. నీకే తెలియును.

శ్రీనాథుఁడు స్నానము ముగించి ప్రాఙ్ముఖుఁడై నిలువఁబడి ప్రాంజలియై మయూరుని సూర్యశతకమంతయుఁ గంఠమెత్తి పఠించెను. శ్రీనాథుఁడు మధురముగ శ్లోకములు పఠింపఁగలఁడు. దుర్గయా శ్లోకములు వినుచుఁ జేతిలోని పని మఱచిపోయెను. శ్రీనాథుఁడింటిలోనికివచ్చి కట్టుకొనుటకుఁ బంచెకై తడవుకొనుచుండెను. దండెము మీఁది యుదికిన పంచె యొకటి తీసి దుర్గ మంచముపై నుంచెను. శ్రీనాథుఁ డది ధరించి తాను దెచ్చుకొనిన ప్రాత సాలువు పైఁగప్పికొని వెలుపలికి వచ్చి “ మామా ! నేను ప్రభువు దర్శనమునకుఁ బోవుచున్నా ” ననెను. “ పిచ్చివాఁడా ! ప్రభువు దర్శన మంత సులభమనుకొంటివా ? ముందు మంత్రుల దయ సంపాదింపుము. ప్రభువు మాట యాపైనిఁ జూచుకొందము అరివేటి యన్నయ మంత్రిగారు మన పాతనాటివాఁడు. ఆయనకు నిన్నుఁ గాన్పింతును రమ్ము ”

తిప్పయ్య శ్రీనాథుని వెంట నిడుకొని యన్నమంత్రి యింటి మొగసాలకేఁగెను. అన్నయమంత్రి యప్పుడే రాజభవనమునుండి తిరిగి వచ్చెను. తిప్పయ్య యాయనకు నమస్కరించి "వీఁడు నాచెల్లెలి కొమరుడు" అనుచుండగనే "నాపేరు శ్రీనాథుఁడందురు" అని యాతఁడు మంత్రికి నమస్కరించెను. అన్నయమంత్రి వారినిగూర్చుండ నియమించి చిఱునవ్వు నవ్వుచు "తిప్పయ్యగారికొక సమస్య తీఱిపోయి నది. చుఱుకైన యల్లుఁడే దొఱకినాఁ"డనెను.

తిప్పయ్య :— తమరు వీనికిఁగూడ నొకదారి చూపింపవలెను. వినికిఁ దాతగారిపోలికలు వచ్చినవి. ఈ సేలువ వీని తాతగారిదే.

అన్నయ .— కమలనాభామాత్యుల పేరు నిలువఁ బెట్టు నన్న మాట. ఆయన సంస్కృత ప్రాకృతములం దుద్దండపండితుఁడు గదా.

శ్రీనాథుఁడు .— ఆయన పద్మపురాణము రచించెను.

అన్న :— అవును. ఆయన యచ్చముగాఁ దెలుఁగు వాఁడు గానందువల్ల ఆ గ్రంథమునందొక తెలుఁగు గాని తెలుఁగున వ్రాసె ననియు నందువల్లఁ దెనుఁగు వారికది రుచింపక దానికి రావలసిన ప్రశస్తి రాలేదనియు నందురు.

శ్రీనా :— ఆయన సంస్కృత ప్రాకృతములందుఁగూడ ధారాళ ముగఁ గవిత్వము చెప్పెడివారఁట.

అన్న :— అవును. ప్రాకృత మాయనకు మాతృభాషయేకదా. అల్లాయుద్దీనోరుగల్లు సామ్రాజ్యమును జయించిన పిదప దేవగిరి ప్రాంత ములనుండి పెక్కు బ్రాహ్మణ కుటుంబములను దీసికొనివచ్చి మన ప్రాంతములఁ గరణములుగా నియమించెను. వారందఱు మాహారాష్ట్ర

ప్రాకృతము మాతృభాషగాఁ గలవారు. ఇప్పటికిని వారి కుటుంబములలోఁ బ్రాకృతమును బచ్చి పచ్చిగా మాట్లాడుచునే యుందురు. నీకుఁ గూడఁ గొంచెము పట్టుబడియే యుండును.

శ్రీనాథ :- నాకుఁ బ్రాకృతము బాగుగావచ్చును. ఇప్పుడు నేను సప్తశతిఁ దెలుఁగు చేయుచున్నాను. ఒక పద్యము విందురా!

అన్న :- నేను వినుటకేమిగాని. ముందుగా మీరొక పర్యాయ మనంతయ్యగారిని జూడుఁడు. ఆయన మెచ్చినచోఁ బ్రభువు మెచ్చినట్లే. కాని ఇంకొక్కమాట. అనంతయ్యగారు వైష్ణవుఁడే యైనను శైవమునుగాదనఁడు గాని లింగధారణ మంగీకరింపఁడు. నీ వాయన ముందెట్లు నెగ్గించుకొందువో! మన వాఁడవు గదా యని చెప్పుచున్నాను.

తిప్పయ్యగారు శ్రీనాథునివంక నవ్వుచుఁ జూచెను. ఇరువురును నన్నయ మంత్రికి నమస్కరించి సెలవు తీసికొనిరి.

౬

కుమారాన్నపోతారెడ్డి పండ్రెండేండ్లవాఁడు. అయినను నైదారేండ్ల వానివలె నుండును. ఆతని యైదవ యేటనే తల్లి స్వర్గము నలంకరించెను. మాతృ వియోగమా పసిబిడ్డ హృదయము నత్తుకొని పోయెను. ఎన్ని రాజభోగము లున్నను ఆ బెంగ యాతని లేత యెడఁద లోతులలోఁ బాతుకొనిపోయి బాల్యమునందే వార్ధక్యము నాతని కనుభూతికిఁ దెచ్చుచుండెను. నూతేండ్ల జీవితమును బదియేండ్లలో నదిమిపట్టినచో నెట్లుండునో యాతని ముఖముఁ జూచిన నట్లుండును. చేతయు వాతయుగాని చిలిపి పిల్లవాఁడు రాజప్రాసాదకుడ్యములపైఁ

జీకిరి బాకిరిగా గీచిన చిత్రపటము కుమారాన్నపోతారెడ్డి. ఆతని కన్నులలోఁ జక్రవర్తి లక్షణము లున్నవని నరసింహ పండితుఁడు చెప్పుచుండును. కొండవీటి రాజ్యము నాతఁడు సామ్రాజ్యము గావించు ననియు నాతని జాతకమున సామ్రాజ్య నిర్మాతృ లక్షణములు స్పష్టముగ నున్నవనియు నరసింహ పండితుఁడు ఘంటాపథముగఁ జాటుచుండును.

భార్యావియోగము కుమారగిరి ప్రభువును నగము క్రుంగఁదీసెను. తండ్రియుఁ బినతండ్రియుఁ దనకై సామ్రాజ్య భవనము నిర్మించి పెట్టుచుండిరి. ఆ భవనమున నానంద లక్ష్మీ నాట్య విలాసములు వెలయించుటకుఁ దాను కృషి చేయుచుండెను. నలుబదియేండ్ల వయస్సునఁ దాను బాలరాజు. యౌవనము తొలఁగిపోవుచున్నను బాల్యము పీఠము పెట్టుకొని కూర్చున్నది. ముసలితనము ముసరికొనివచ్చి పైపై నలముకొనుచున్నను లోలోనఁ బసితనము చిప్పిలుచునే యుండెను. యౌవనమున సర్వభోగములను నిరాఘాటముగ ననుభవించి యాయన యకాలమున ముసలితనమును గొనితెచ్చుకొనెను. ఆయన బహ్వాంగనా సక్తుఁడయ్యు భార్యయం దత్యంతానురక్తుఁడు. యువరాజ్ఞి యందములరాశి. లోకమున నందమనునది శరీరము నాశ్రయించి యుండును. యువరాజ్ఞి శరీరమే యందము నాశ్రయించియుండును. కుమారగిరి కామె విభావ సామగ్రి మాత్రమే. అనుభవ మన్యథా సాధ్యము. ఆమె కదలినచో, మెదలినచో వచ్చమైన యందము కదలినట్లు, మెదలినట్లు నుండును. భరతముని శరీరపుఁగదలికలను జెప్పెను. కుమారగిరి యందపుఁ గదలికలను జెప్పఁదలఁచెను. వసంత రాజీయము సృష్టించెను. యువరాజ్ఞి యందము శరీరధర్మముఁ బరిత్యజించి యచ్చమైన యొక లీలానుభూతిగా నంతఃపురమున సంచరించు

చుండును. ఆ యనుభూతికి రూపకల్పనచేయవలెనని కుమరగిరి తహతహ పడెను. దానిని రేఖలలోఁ జిత్రించెను. ప్రతిమలలో బంధించెను. పాలరాతి ప్రతిమలలోఁ బ్రతిష్ఠింపఁబడిన యా యందమునకుఁ గదలికలు గల్పించెను. ఆ కదలికలు గల ప్రతిమలతో లకుమాదేవిని సృష్టించెను. యువరాజ్ఞి యందమును బ్రతిమలలోఁ బ్రతిష్ఠించుకొనుచు, లకుమాదేవి నాట్యములలోఁ గదలించుకొనుచుఁ గుమరగిరి యువరాజ్ఞిని బ్రతికించుకొనుచుండెను. ఆ ప్రతిమలను, ఆ నాట్యమును జూచినంతసే పాయన నిండుప్రాణములతో జీవించును. తక్కిన యప్పుడాయన శరీరము చైతన్య లక్షణమాత్రముగఁ జలనవంతమై యుండును.

కుమారాన్నపోతారెడ్డికన్నులలో యువరాజ్ఞిప్రాణములు గదలియాడుచున్నట్లు కనిపించును కుమరగిరి కా కన్నులు చూచినప్పుడెల్ల మరణించుచున్న యువరాజ్ఞి కన్నులు గుఱుతువచ్చును. యువరాజ్ఞిప్రాణము లా కన్నులలోనుండి తన్నుఁ జూచుచున్నట్లుండును. సుఖమో దుఃఖమో వివరింపరాని యొకభావ మాయన నావేశించి యాయన యుద్విగ్నుఁడగుచుండును. ఈ నిసుఁగు సామ్రాజ్యము నిర్మించునని నరసింహపండితుఁడనును. కర్పూరఖండమువలె నానాఁటికి హరించుకొని పోవుచున్న యీ యర్భకుఁడు సామ్రాజ్యము లేలునా! కుమారాన్నపోతారెడ్డికి ముత్తాతపోలిక వచ్చినది. రెడ్డిరాజ్యస్థాపనకై రేఁబవళ్ళు నిర్విరామముగ నాహవరంగమే యంతిపురముగఁ గాలముఁబుచ్చి ప్రోలయవేమారెడ్డి రాజయక్ష్మగ్రస్తుఁడయ్యెను. కుమారాన్నపోతారెడ్డి కావ్యాధి వారసత్వమై పసితనముననే సంక్రమించినది. ఈ బహుళపక్ష క్షపాకరుఁడేనాఁడు కుమరగిరి నంధకారమున ముంచునో! ఈ దిగులు కుమరగిరిని పూర్తిగాఁ గ్రుంగఁదీసెను.

అవచిదేవయసెట్టి యదృష్టశాలి. సమర్థుఁడైన కుమారునిపై సర్వభారము సమర్పించి తాను నిశ్చింతముగ విశ్రాంతి నొందఁబోవు చున్నాఁడు. కుమరగిరిప్రభువునకుఁ దన యేకైకసంతానము దీనస్థితి దిగులుపుట్టించుచుండెను. ఆయన యంతరంగ ముద్విగ్నమైపోయెను. సన్మానసభనుండి యాయన తిన్నగా శిల్పమందిరమున కేఁగెను. శూన్య హృదయుఁడై యాశిల్పములనెల్లఁ దిరుగాడెను. వకుళావంజులాదులను బిలిపించుకొనెను. కొంచెముసేపు నృత్యముచేయించుకొనెను. నరసింహ పండితునకుఁ గబురుచేసెను. ఆయనవచ్చి యువరాజు జాతకమును విప్పి యాతఁడు దిగ్విజయయాత్ర గావించుననియు, సామ్రాజ్యము నిర్మించు ననియు నాజాతకము నక్షరములను జదివి చెప్పినట్లు చెప్పెను. బాలా రిష్టము వ్యాధిరూపమున నగపడుచునే యున్నదిగదా. కర్మబలముచే సంక్రమించిన దీని ననుభవముచేతను నుత్తమకర్మబలముచేతను జయింప వచ్చును. కర్మబలమునకు విరుగుడుండవచ్చును గాని గ్రహచారమునకుఁ దిరుగులేదని యాయన నొక్కిచక్కాణించెను. మొగసాలలో గడియా రమునందెనిమిదిగంటలు మ్రోగెను. హజారమున వీరాస్వామి మోహన రాగము నాలాపింపసాగెను. శుష్కదారునిర్మితమైన యా సన్నాయి గొట్టమున వీరాస్వామి తనప్రాణవాయువులు పూరించును. ఆగొట్టము నకుఁ జైతన్యము వచ్చి యది ప్రాణాయామమున నోంకారనాదము పుట్టించును. ఆయోంకారనాద మాకాశమును మథించి యమృత ప్రవాహముఁ గల్పించును. కుమరగిరిప్రభువున కాయమృతరాగాలాపము శ్రుతిగోచరమై యాయన సర్వగాత్రపరివ్యాప్తమై క్షోభిల్లుచున్న వాయు వులను స్తంభింపఁజేసెను. ఆయనకన్నులు మూతలు పడిపోవుచుండెను. రాయప్పకు ప్రభువుపరిస్థితి యనగతమయ్యెను. మెఱపుమెఱసినంతలో నాతఁడు ప్రభువున కాశిల్పమందిరముననే శయ్యాకల్పనము గావించెను. ప్రభువు శయ్యపైఁ బరుండెను. అటునిటుఁబొరలెను. నిద్రపట్టుచున్నది

విడిపోవుచున్నది. ప్రభువు స్వస్థుఁడైనప్పుడు లకుమాదేవినిఁ బిలిపించుకొని నాట్యము చేయించుకొనును. లేదా మల్లాంబికను బిలిపించుకొని గానము చేయించుకొనును. ప్రభువిప్పుడు నాట్యమును దిలకించు స్థితిలో లేఁడు. రాయప్ప మల్లాంబికకొఱకుఁ గబురంపెను.

మల్లాంబిక యంతఃపురమునందామెయు వేమాంబయుఁ గుమార వీరభద్రునితోఁ జెండ్లాట యాడుచుండిరి. ఆ యుభయుల చేతులలోఁ బడి పూలగుత్తివంటి యాపసివాఁడు నలిఁగిపోవునేమో యని పరిచారికలకుఁ బ్రాణములు పోవుచుండెను. వీరభద్రు నొడిలోఁ బెట్టుకొని మల్లాంబిక యాతని పాలబుగ్గలను ముద్దులతో నింపివైచుచుండెను. "అమ్మగారియొడి యిప్పుడు నిండుగానున్న" దని యొకపరిచారిక యనఁగా మల్లాంబిక దాని నొకమల్లెపూవున విసరికొట్టెను. పరిచారికలందఱును బగలఁబడి నవ్వుకొనిరి. "అమ్మగారు! అబ్బాయిని మన మిచ్చటనే యుంచికొంద" మని యొకదాసి యనెను. "మావాఁ డిల్లఱికము లుండువాఁడుకాఁడు. అంతగాఁ గావలసిన మీరే రాజమహేంద్రవరము వత్తురు" అనుచు వేమాంబ వీరభద్రుని దన యొడిలోనికిఁ దీసికొనెను. రాయప్ప పంపిన దాసి వచ్చి కబు రందఁజేసెను. కబురువిని వేమాంబ కలవరపడెను. మల్లాంబిక నవ్వుచు "నిది యప్పుడప్పుడు జరుగుచుండునదియే. భయములేదులే" యని యామెకు ధైర్యము చెప్పెను. ఇరువురును రాజభవనమున కేగిరి.

శిల్పమందిరమునఁ దాను సృష్టించిన శిలాప్రతిమలనడుమఁ జలనమాత్రవిశిష్టమగు నొక ప్రతిమవలెఁ బ్రభువు తల్పగతుఁడై యుండెను. మల్లాంబిక యన్నగారి స్థితిఁగాంచి యాందోళిత హృదయయైపోయెను. వేమాంబికకు గుండెలు తల్లడిల్లిపోయెను. వకుళావంజులలు, రాయప్ప, నరసింహపండితుఁడు మందీకృతోచ్ఛ్వాస నిశ్వాసులై గండరించిన

యార్తిపై యుండిరి. తంబురాశ్రుతి సవరించికొని మూలబంధాసన మునఁ గూర్చుండి ముహూర్తము ప్రాణధారణము గావించి మల్లాంబిక మెల్లగా వాయువును రేచింపనారంభించెను. నాభీకుహరమునం దాహత మైన యావాయువు మల్లాంబిక ముఖమున నాదరూపమున నభివ్యక్తమై శంఖములు పూరించినట్లు మంద్రస్థాయిలో మధురగంభీరమై యా శిల్ప మందిరమునందలి యణువణువునను బ్రతిధ్వనించెను. శిలాప్రతిమ లన్నియుఁ బ్రాణవాయుస్పర్శమునఁ జెమ్మగిల్లి చివురించుచుండెను. ఆశంఖధ్వని వలయములు వలయములై శిల్పమందిర వాయువీథులఁ దరం గములు తరంగములుగాఁ గదలి యా శిలాప్రతిమలఁ గరగించి కరగించి పూలతీవలుగా రూపులుగట్టించుచుండెను. అది బృందావనము గావల యును. మల్లాంబిక కంఠమున స్వరములు తీవలుసాగి మధ్యమస్థాయిలో వేణునాదములు పలుకుచుండెను. శిల్పమందిరమునఁ బ్రతిమలన్నియు నొకదానితో నొకటి పెనవైచుకొనిపోవుచుండెను. స్వరములన్నియుఁ బూలవలె వికసించి వివిధపరిమళములు గుబాళించుచుండెను. ఘనసార ములు చల్లినట్లు, ఉశీరము లల్లినట్లు, మందిరమంతయు శీతలసుగంధిల మందానిలసంచార రోమాంచిత మయ్యెను. మల్లాంబిక స్వరసంచార మున దోడిరాగిణిరూపు గొనుచుండెను. తారస్థాయిలో నాస్వరములు తారకములవలె మిలమిలలాడుచు సుపరిష్కృతమై స్ఫుటమగుచున్న యావేణురవమున గలగల వీణాక్వాణములు కురియుచుండెను. విగ ళములైన వాయుపరమాణువు లొండొరుల నొరసికొనుచుఁ గ్రమక్రమ ముగ నొకదానినొకటి పెనవైచికొని పోవుచుండెను. బృందావనము నందనవనముగఁ బరిణమించెను. పూఁదీవలైన శిల్పప్రతిమలన్నియు నొకేపూలరాశి యైపోవుచుండెను. ఆపూలరాశి యొక యప్సరస్సుందరి. ఆమె యమృతఫేనపుంజములవంటి యచ్ఛవసనములు ధరించినది. కుంకు మాంకితమగు వక్షఃస్థలమునఁ బటికపుపీణ నత్తుకొన్నది. మృదులాంగు

లీప్రసరణముల నాయచ్చర వీణాతంత్రులఁ బలికించు స్వరములు కుమార గిరిప్రభువు సప్తనాడులయందుఁ జక్కిలిగింతలు గొలుపుచుండెను. ప్రభువు సర్వేంద్రియములు నుపరతావస్థ నందుచుండెను. ప్రభువు నంత రంగ మంతయు నాదమయమై యానాద మంతయు నాకాశమయమై యా యాకాశమంతయు నప్సరోమయమై పోవుచుండెను. అమృతతేజః పుంజములు ధరించిన యా యచ్చర యచ్చమైన యందము. ప్రభుని నంతరింద్రియ మాయందమున రమించుచుండెను. మల్లాంబిక తారము నుండి మధ్యమునకు, మధ్యమునుండి మంద్రమునకు సంచెలంచెలుగా నల్లనల్లన దిగివచ్చుచుండెను. కుమారగిరిప్రభువు నుద్వేగము చేతితోఁ దిగిచినట్లు మస్తిష్కమునుండి యల్లనల్లనఁ బాదాగ్రములకు దిగివచ్చుచుండెను. మల్లాంబిక మంద్రషడ్జము నంతర్ముఖముగావించి యనాహతమునఁ గుంభించెను. పాదాంగుళ్యగ్రములనుండి స్రవించి ప్రభువు నుద్వేగమనంతవాయువులఁ గలసిపోయెను. ఆయన యొకానొక మధురస్వప్నమును దర్శించుచున్నట్లు అధరమున విరిసిన యచ్చపుఁ జిఱునవ్వులతో నాననమునఁ దాండవించు నానందరేఖలతోఁ దన శిల్పముల సరసను దానొకశిల్పమువలె శయ్యాగతుఁడై యుండెను. శిల్పమందిరమంతయు నిర్వికారము, నిశ్చలము, నిశ్శబ్దము.

కాటయవేమారెడ్డి తన మందిరమున నల్లాడరెడ్డితోఁ గొంటి రాజ్యపరిస్థితులు చర్చించుచుండెను. శ్రీశైలమునుండి సాగరమువఱకు, నద్దంకినుండి సింహాద్రివఱకు ననవేమ మహీపతి కొండవీటి సామ్రాజ్యము నభివ్యాప్తము గావించెను. అన్నగారు తనచేతనుంచిన రాజ్యమును సామ్రాజ్యము గావించి యా యన్నగారి సంతతి కొప్పగించెను. పినతండ్రి సామ్రాజ్యము నిర్మించుచుండఁ గుమారగిరి నాట్యరాజధాని విరచించుచుండెను. కొండవీటఁ గుమారగిరి నిర్మించిన వసంత

మందిరములకు, రమణీయారామములకు, మనోహర సరోవరములకు లెక్కలేదు. కుమరగిరికిఁ గొండవీడే వైకుంఠము. విజయకుంజరాలాన నిజభుజస్తంభ సంభృత యశోమండనుఁడు, మహనీయాంధ్రదేశ పట్టాభిషేక సంవృత మహాభాగ్యుఁడు, సింహాచలాది వింధ్యపాద పర్యంత ప్రతిష్ఠాపిత కీర్తిస్తంభుఁడు — అనవేమ మహీపతి. ఆయన యస్తమించుటతో సామ్రాజ్య సౌధస్తంభములు కుదురులలోఁ గదలిపోయి కుమరగిరి మస్తకముపైఁ గుప్పగూలి యుండెడివే. కాని చిటికెనవ్రేల గోవర్ధనము ధరించిన శ్రీకృష్ణునివలెఁ గాటయవేమారెడ్డి యా సామ్రాజ్యభవనమును దన భుజస్తంభముఁ బోటియుంచినిలువఁ బెట్టెను. కొండవీటి వైకుంఠమునఁ గుమరగిరి కాయన శ్రీమహావిష్ణువు

అల్లాడరెడ్డి.— సామ్రాజ్య మిట్టి విషమస్థితియందుండ ప్రభువున కీ నిద్రయేమో నాకుఁ దెలియకున్నది.

కాటయవేమారెడ్డి.— అది నిద్రగాదు. స్వప్నము. ఆయన పూవులలోఁ బుట్టి పూవులలోఁ బెరిగిన యమృతప్రఁదేట. ఆయన జీవితమే యొక మధుర స్వప్నము. ఈశ్వర సృష్టమగు నీ జగత్తు పరమ సుందరమైనది. జీవుఁ డీ సౌందర్యము నుపాసించి సుందరమైన సృష్టి నానందరూపమున ననుభవించుటే యీశ్వరసంకల్పమునకుఁ జరితార్థత. నామరూపాత్మకమగు జగత్తంతయు గాననాట్యమయముగా ఆయన సంభావించును. నాట్యగానము లీశ్వరుని చిత్కళలనియు, తదారాధనమునఁ బరమేశ్వరుని యానందమూర్తి సాక్షాత్కరించుననియు నాయన తలంపు. జాగ్రదవస్థయందు పరస్పర విరుద్ధములుగాఁ దోచి యశాంతికి మూలములగు ననుభవములకు స్వప్నావస్థయందు సమన్వయ మేర్పడి చిత్తము ప్రసన్నమగు నట. జీవునకు జాగృతియే కృతకము, స్వప్నమే సహజమునట. జాగ్రదవస్థయం దింద్రియములు భిన్నవిషయ

ములచే నాకృష్టములై చిత్తమును వికలము గావించును. స్వప్నస్థితియం దవి యుపరతములై చిత్తము కలకదేఱి సుఖైకరూపమున వెలుగును. కుమరగిరి ప్రభువు పరమశాంతచిత్తుఁడు. ఆయన జీవితమును స్వప్నముగా గనుపఁగోరుట యందలి తత్త్వము నాకవగతమైనది. ఆయన జాగృతిలోనుండి సామ్రాజ్యము పుట్టకపోయినను ఆయన స్వప్నము నుండి కళాప్రపంచములు పుట్టుట తథ్యము. అనవేము మహీపతి యీ రహస్యమును గుర్తించెను. తాను జాగృతుఁడై యీయన స్వప్నమునుఁ గాపాడెను. ఆయన మరణమువల్ల నీయన స్వప్నమునకు వ్యాఘాతము గలిగినది. బావగారూ! మన మీ ప్రభువును గాపాడ వలయును. బుద్ధిబలము, భుజబలము నుండినఁ జాలును భౌతిక సామ్రాజ్యములు నిర్మింపవచ్చును. కాని కళాసామ్రాజ్యము నిర్మించుట కాత్మబలము కావలయును. ప్రభువున కాబలము పుష్కలముగ నున్నది. మీరును నేనును నదృష్టవశమున నీ ప్రభువంశమునకు బంధువులమైతిమి. మన బుద్ధిబలమును, భుజబలమును వినియోగించి మన మీ ప్రభువు స్వప్నములు భంగముగాకుండఁ జూడవలయును.

అల్లాడరెడ్డి యంతయు వినెను. మొదట నాయనకుఁ గాటయవేమారెడ్డి మాటలకు నవ్వు వచ్చెను. మనుష్యులు స్వప్నములలో జీవింతురనుట యాయనకు వింతగాఁ దోఁచెను. కాటయవేమారెడ్డి మాటలు ముగియునప్పటి కల్లాడరెడ్డికిఁ దానుఁగూడ నేదో స్వప్నములోనికిఁ బ్రాకిపోవుచున్నట్లనిపించెను.

అల్లాడ :— వేమయ్యగారూ! మీ మాటలయం దేదో మంత్రశక్తి యున్నది. నాకుఁ దెలియకుండఁగనే నేను దానికి వశమైపోవుచున్నాను.

కాటయ :— ప్రభువుపట్ల మీ హృదయ మంత స్నిగ్ధమైనది.

అల్లాడ :— ప్రభువు వైష్ణవుఁడగుటకు హేతువు నాకిప్పు డవగతమైనది. కాటయవేమారెడ్డి చిఱునవ్వు నవ్వెను.

కాటయ .— బావగారూ! మతము, ధర్మము, నీతి, యను వానికి లోకమున భేదము లేకుండఁ బోయినది. మత మెప్పుడును వ్యక్తిగతమైనది. జన్మ పరంపరాగతమైన సంస్కార మొకఁడు జీవి నంటి పెట్టుకొని యుండును. ఒకనియొక్క మత మాసంస్కారము ననుసరించి యుండును. సంస్కారభేదమువల్ల నభిరుచిభేదమును, నభిరుచిభేదమువల్ల మతభేదము నేర్పడుచుండును. పరమమాహేశ్వరుఁడైన యొకని గర్భమున పరమవైష్ణవుఁడు జన్మింపవచ్చును. ధర్మమనునది సార్వమానవికము సార్వకాలికమును. దేశకాలాను వర్తియగు సామాజిక నియమము నీతి. మతభేదము ధర్మభేదమునకుఁ గాని, నీతిభేదమునకుఁ గాని దారి తీయరాదు. మీరు శైవులు. నేను వైష్ణవుఁడను. మన యిరువురి మతములు భిన్నములు. మీరును నేనును బంధువులము. ఈ బంధుధర్మము మన కిరువురకు నేకరూపమే. మన మతములు భేదించినంత మాత్రమున మన బంధుత్వము భేదిల్లునా? మన మందఱముఁ గుమారగిరి ప్రభువు రాజ్యమునఁ బ్రజలము. ప్రభువునుఁ బ్రజలను గలిపి నడిపించు నీతి యొకటున్నది. మతము భేదించినంతమాత్రమున నీ నీతి భేదిల్ల నవసరములేదు. స్వార్థపరులగు వారు మతమును నీతితో ముడి పెట్టి యమాయకులగు ప్రజలను దప్పుత్రోవల నడపఁజూతురు. ఒకఁడు శైవుఁడగుట యెంత న్యాయ్యమో వేఱొకఁడు వైష్ణవుఁడగుటయు నంతియే న్యాయ్యముగదా. సంస్కార తారతమ్యమువల్ల ఆస్తిక్యము గూడ పలుదెఱఁగు లగుచున్నది. సమచిత్తవృత్తియగువారికి శివకేశవ భేదము పారమార్థికము గాదు. వ్యావహారికము మాత్రమే. తమః

ప్రధానుఁడగు వానికీ వ్యావహారిక విభేదమే ప్రధానము. పారమార్థిక మైన యైక్యము వారికి భాసింపదు. లోకమున పరిశుద్ధమైన యాస్తిక్యము గలవా రేకొద్దిమందియో యుందురు. లోకులందఱును గతానుగతికముగ వారి ననుసరించి పోవుచుందురు. తెలిసి ద్వైతి కావచ్చును. విశిష్టాద్వైతి కావచ్చును. అద్వైతి కానచ్చును. తెలియకమాత్ర మేదియు కారాదు. లోకులు సామాన్యముగ నీ రెండవ తెగవారు. పరప్రత్యయనేయ బుద్ధులగు వారెప్పు డెందుల కేదియాదురో వారికే తెలియదు. రెడ్డి ప్రభువులు మొదటినుండియు వ్యవహారమున శైవులే యయ్యు పరమార్థమున ద్వైతాద్వైతమునే విశ్వసించిరి. కుమరగిరి ప్రభువు శుద్ధాద్వైతి. ఆయన లలిత ప్రకృతి యగుటచే నాయనకు వైష్ణవమునందను రక్తి. కోమటి వేమారెడ్డి యీ మతభేదము పెట్టి రాజ్యమున మరలఁ గల్లోలములు రేకెత్తింపఁ జూచుచున్నాఁడు. పదవీభ్రష్టుఁడైన మామిడి సింగన్నగా రాయనకుఁ దాళము వైచుచున్నట్లు కనిపించుచున్నది. ఈ వసంతోత్సవములకు కోమటిరెడ్డియు, ఆయన తమ్ముఁడు మాచారెడ్డియు మామగన్నారెడ్డియు రాలేదుగదా.

అల్లాడ:— రాతు కొలఁది గుఱ్ఱమను సామెత యుండనే యున్నదిగదా.

కాటయ:— వారును మనవలెనే రాజబంధువులు గనుక వంశమర్యాదననుసరించి వారి నాయా దుర్గముల కధిపతులుగా నుండనిచ్చితి మనుకొనుఁడు. యథాపూర్వ ముత్సవములకు రాకపోవుట యొకటి కప్పముఁ బంపకపోవుట రెండవది.

అల్లాడ:— మీరు శాస్త్రము ననుసరించి చతురుపాయములు క్రమముగఁ బ్రయోగింపవలె నందురు. కాని లోకమున నొక్కఁడు

పరమదుష్ట ప్రకృతి యుండును. వానియెడల సూటిగాఁ జతుర్థోపాయ మునే ప్రయోగింపవలసి యుండును. ఒక నీతి ననుసరించు వానికి సామము సామముగా నర్థమగును. ఏనీతియు లేనివానికి ఆ సామము అసమర్థతగా నర్థమగును. ఋణశేషమును, శత్రుశేషమును ఉపే క్షించు విూరీతి యేనీతియో విూకే తెలియవలె.

కాటయ :— కోమటిరెడ్డిపట్ల నాకు శత్రుభావము కలుగుటలేదు. యథార్థమునకు మన యిరువురకంటెఁ గుమరగిరిప్రభువున కాయనయే సన్నిహితుఁడు. ఆయన రాజవంశీయుఁడు. మనము రాజబంధువులము మాత్రమే.

అల్లాడ :— కనుకనే మనము రాజ్యక్షేమమునకై మాత్రము పెనఁగులాడుదుము. ఆయన రాజ్యమునకై పెనఁగులాడుచున్నాఁడు. ఇది సహజమే కదా.

కాటయ :— సహజమైనదెల్ల సమంజసము గాదుగదా. క్రమ ప్రాప్తమైన రాజ్యము ననుభవించుట నీతిపద్ధతి. బలప్రాప్తమైనరాజ్యము ననుభవించుట శౌర్యపద్ధతి. ఇందు మొదటిదే యుత్తమ మని, పెద్దలు కొనియాడి యుండిరి. నీతియుక్తమైన శౌర్యము మాత్రమే మన కుపాదేయ మని నా తలఁపు.

అల్లాడ :— కోమటిరెడ్డిపట్ల మీారుపేక్ష చేయుచున్నారు. ఉద్యో గినం పురుషసింహముపైతి లక్ష్మీః అనిగదాసూక్తి. ప్రభువునాట్యము లందును, ప్రధాని నాటకములందును గలలు గనుచున్నచో రాజ్యమేమి కావలెను.

కాటయ :— మీారన్నారుగదా. "వృణుతేహి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః." ఇదియుపేక్ష కాదు బావగారు! కేవ లము ప్రతీక్ష.

అల్లాడ :— ఒకవంక విద్యానగరము, వేఱొకవంక పద్మనాయకులు, నింకొకవంక గజపతులును రాజ్యమును గబళింపఁజూచుచున్నారు. ఈ మువ్వురిపైఁ గుంపటివలె నీకోమటిరెడ్డి యున్నాఁడు. వీని నిట్లు పేక్షించుటలో మీ రాజనీతి యేమో నాకవగతము కావుటలేదు.

కాటయ — రాజనీతి చెట్టువలెఁ దిన్నగా బెరుగదు. తీగవలె వీలునుబట్టి యల్లుకొనిపోవును. దేనికైనను తరుణము రావలయును గదా. కార్యమనునది యేదో యొకక్షణమునందే సిద్ధించును. ఆక్షణము వఱకును ఉండునదంతయుఁ గాలక్షేపము మాత్రమే.

అల్లాడ :— ఏకార్యము సిద్ధించుటకైననుఁ బురుషకార మవసరము గదా.

కాటయ :— సంకల్ప మన్నింటికినిఁ బ్రధానము. పురుషుని సంకల్పమును నీశ్వరుని సంకల్పమును నొక్కటైనచోఁ బురుషకార మీశ్వరప్రేరితమై ప్రవర్తిల్లును. కొండవీటి కళాస్వప్నము లీశ్వరసంకల్పమును బ్రతిబింబించుచున్నవనియు, నవి విశ్వశ్రేయస్కరములనియు నేను విశ్వసించుచున్నాను. మీరును విశ్వసించుచున్నారు. ఈ స్వప్నములకు భంగము కలుగకుండఁ గాపాడుటకు మనము సర్వాత్మనా సంకల్పింపవలయును. ఈ సంకల్పసిద్ధికి మార్గము లవియే తెలచికొనివచ్చును.

ఇంతలో మల్లాంబయు వేమాంబయు రాజభవనమునుండి తిరిగి వచ్చిరి. వారివల్ల ప్రభువుపరిస్థితి నెఱింగి కాటయవేమారెడ్డియు, నల్లాడరెడ్డియు నొకరిమొగము నొకరు చూచుకొనిరి. అల్లాడరెడ్డి ముఖమున వ్యగ్రభావము పరిస్ఫుటమగుట గాంచి కాటయవేమారెడ్డి యాయన మూపుపైఁ జేయివైచి "ప్రభువును జూతమురం" డని రాజభవనమునకు బయలుదేరెను.

౭

నాఁటి సాయంకాలమునకుఁగూడఁ బ్రభువునకు స్మృతి రాలేదు. వెంకోజీకి మిక్కుల నిరుత్సాహము గలిగెను. కొండవీటి రాజ్యమున వెంకోజీపేరు విననివారు లేరు. ఆతఁడు గొప్ప యైంద్రజాలికుఁడు. వశీకరణవిద్యయం దందెవేసిన చేయి. ఆ విద్యాబలమున నాతఁడు గావించు నద్భుతచర్యలు గాంచినచో నెంతటి నాస్తికుఁడును ఆస్తికుఁడు గావలసినదే. ఒక యనిర్వచనీయమైన శక్తి తన్నావేశించి తనచే నీ పనులు చేయించుచునని యాతఁడు నుడువుచుండును. వెంకోజీ పేరునందే యేదో మంత్రశక్తియున్నది. నాటిసాయంకాలమాతని ప్రదర్శనమును దిలకించుటకై వచ్చిన జనసమూహ మింతయని యూహింపరానిది. ఎందఱు వచ్చి యేమిలాభము. ప్రభువురాలేదు. ఇటీవలఁ దాను విశేషకృషిచేసి సాధించిన యొక మహావిద్యను గుమరగిరిప్రభువు సమక్షమునఁ బ్రదర్శించి యాయనచే సన్మానము నందవలెనని వెంకోజీ యుబలాటపడెను. తన దురదృష్టమువలనఁ బ్రభువున కానాఁడే యస్వస్థత సంభవించెను. తన క్రొత్తవిద్య నానాఁడు ప్రదర్శింపవలె నను నాసక్తియే వెంకోజీకి లేకపోయెను. వేలకొలందిగా మూఁగిన ప్రజల కావిద్యయే కావలెను. తన కాశాభంగము కలిగినను బ్రజాసమూహమున కాశాభంగము గలిగించుట వెంకోజీ కిష్టము గాలేదు.

దుర్గాధిప సీమాధిపు లుచితస్థానముల నలంకరించి యుండిరికి రాజప్రాసాదమునెదుట విశాలమగు మైదానమునఁ బ్రదర్శన మేర్పాటు గావింపఁబడినది. అమాత్యదండనాథులు, నవచిదేవయసెట్టి, తిప్పయసెట్టి వచ్చిరి. ప్రదర్శనము ప్రారంభింపవచ్చుననియు, నేదో యొకగడియసేపు తాము వచ్చిపోదుమనియు గాటయవేమారెడ్డియు, నల్లాడరెడ్డియుఁ

గబురంపిరి. వెంకోజీ ప్రదర్శనరంగమున నవతరించెను. ఆతఁడాజాను బాహువు. ధనుర్దండమువంటి యాకృతిగలవాఁడు. పసుపుపచ్చ జరీ పంచె మోకాళ్ళు దిగియుదిగనట్లు, రెండువైపులకు విఱిచి గోచిపెట్టి కట్టినాఁడు. ఎఱుపురంగు జరీపూలయంగరఖా దొడిగినాఁడు. పన్నెపూవు వంటి సన్నని యుత్తరీయము పదిమూరలపొడవుగలది కుచ్చువిడిచి తల పాగఁ జుట్టినాఁడు. ఎడమచెవిని జొంపము, దానిపైఁ దుమ్మెదకోడుపు గళమునఁదాయెత్తు, బాహువులఁబంచలోహముల దండకడెములు, ముంజేతులఁ గంకణములు, డాకాలనందియ ధరించినాఁడు. బుగ్గలపై మెలివెట్టిన మీసములతోఁ జేతఁ వెండిపొన్ను పేపబెత్తముతో నాతఁడ రంగమునం దవతరించి చుట్టునుందిరుగుచుఁ బ్రజాసమూహమునకు సలాము సలిపెను. ఒక భటుఁడు వచ్చి యాతని నవచితిప్పయసెట్టి కడకుఁ గొంపోయెను. తిప్పయసెట్టి యిచ్చిన కర్పూరతాంబూలము గ్రహించి నేలంట వంగి సలాముచేసి వెంకోజీ చక్రాకారముగఁ బి మొగ్గలువైచుచు మెఱపు మెఱసినంతలో రంగమధ్యమున నిల్చి కు చేతిచూపుడువ్రేలు నోటఁగ్రుక్కికొని ప్రజాసమూహము చెవులు గింగు రెత్తునట్లొక యీలవేసెను. వెంటనే వెంకోజి పెండ్లాము డోలు వాయింపసాగెను. వెంకోజీ సొరకాయబూరతో నాగస్వర మూదుచు రంగమునం దటు నిటు నాగుబామువలె మెలికలు దిరుగుచు బచారులు చేసెను. జనసమూహ మంతయు మంత్రముగ్ధమై పోయెను. వెంకోజీ బుగ్గలుబ్బించి బూర నూదుచుండఁ జుట్టలు చుట్టుకొన యాతని మీసములు పడగవిప్పిన పిల్లనాగులవలె మిలమిల మెఱయ నాతని కన్నులముందాడఁ దొడఁగెను. ఆతఁడా మీసములను దిర మెలివైచుకొని బొడ్డునుండి చురకత్తిని దీసి నాలుకను జేనెడుపొ సాచి యందొక బెత్తెడు ముక్కను కరుక్కునగోసి పై కెగురవైచె ప్రేక్షకులెల్లరు భయభ్రాంతులై పోయిరి. క్రిందఁబడుచున్న యా ముక్క

నాతఁడు నోఱుదెఱచి గుటుక్కున మ్రింగి గ్రుడ్లు గిరగిర ద్రిప్పుచుఁ బకాలున నవ్వెను. ప్రేక్షకులందఱును బగలఁబడి నవ్విరి. వెంకోజీ తాటి పండంత యినుప గుండొకటి బలముకొలదియు నాకసమునకు విసరి సూటిగా దానిక్రింద నిలువఁబడెను. అది పిడుగు పడినట్లు తిన్నగా నాతని శిరముపైఁ బడెను. వెంకోజీ తల గిరగిర ద్రిప్పుచు నేలపైఁ గూలెను. ప్రజలందఱును హాహాకారము లొనర్చిరి. వెంకోజీకన్నులు నులుముకొనుచు గిఱ్ఱున దిరిగి యొంటికాలిపై లేచి నిలువఁ బడెను. ప్రజల కరతాళ ధ్వనులకు దిక్కులదరిపోయెను. వెంకోజీ తిప్పయసెట్టి సమీపమున కరిగి యేదో మనవి చేసెను. ఆయన యొక్క భటుని రాజ భవనమునకుఁ బరువెత్తించెను.

కాటయవేమారెడ్డియు, నల్లాడరెడ్డియు వచ్చులోపల వెంకోజీ యొక్క క్షణము నాగస్వరమూది మఱల బ్రజాసమూహమును వశము నకుఁ దెచ్చికొనెను. వారు వచ్చి యాసనము లలంకరించినంత వెంకోజీ మొగమునకుఁ గ్రొత్త తెలివి వచ్చెను. ఆతఁ డిరువురకును వంగి సలాము లొనరించి రంగమధ్యమున నిల్చెను. ఒకపెద్ద కొబ్బరితాటిచుట్టను రంగమధ్యమున నుంచి యాతఁడు కాటయవేమారెడ్డి నుద్దేశించి యిట్లనెను "ప్రభువా! ఈ విద్యను సాధించుటకు జీవితమంతయు ధారవోసితిని. ఇప్పటికి దీనిని సాధించితిని. మహాప్రభువున కీ విద్య చూపవలెనని యుబలాటపడితిని. కాని దైవము వేఱుగా నున్నది. తమరు నా విద్యను చిత్తగించి మెచ్చవలెను." ఇట్లనుచు వెంకోజీ "బిజిలీ", యని తన యాలినిఁబిలిచెను. అది మెఱుపుఁ దీగవలె దళుకు తళుకు మనుచు వచ్చి తలమీఁది ముసుఁగు ముఖము మీఁదికి లాగికొని పెడమొగముపెట్టి నిలువఁబడెను. వెంకోజీ కొంచెముసేపు దానిని బ్రతిమాలినట్లు నటించి యేమికావలెనో కోరుకొమ్మనెను.

అది ముసిముసి నవ్వులు నవ్వుచుఁ "గొండమల్లె కావలె" ననెను. ఆతఁడు నవ్వుచు "గొండపీట గొండమల్లెలు కోకొల్లలు, ఇదిగో కొమ్ము" ని దానికి మల్లెపూలీఁబోయెను. అది మరల మొగము ముడిచెను. అతఁడు మఱల బతిమాలెను. అది "కొండ యనగా నీ కొండకాదు. అదిగో ఆకొండ" యనుచు నాకసము వంకఁజూపెను. కొండపీటి రసికయువకు లీయాల్మగళ్ళ శృంగారములకుఁ బొంగులు వారుచుండిరి. ఆతఁడు "అటులనా? సరే. అదెంతపని. ఇదిగో యిప్పుడే తెత్తు" ననుచు నామెను చేయి పట్టుకొని యవచిలిప్పయసెట్టి కడకుఁ గొంపోయి "ప్రభువా! నేను కొండమల్లెఁ దేఁబోవుచున్నాను. నేను వచ్చువఱకు నా యాలిని తమరు కాపాడు చుండవలె" నని యామె నాయన పాదములకడ గూర్చుండఁ బెట్టెను. తాను రంగమధ్యమున ద్రాటిచుట్ట కడకువచ్చి నాగస్వరమూదుచు దాని చుట్టును దిరుగ సాగెను. ఆ త్రాడు త్రాచుపామువలె తలయెత్తి యటు నిటు దల యూపుచుఁ బైకి లేచుచుండెను. వెంకోజీ క్రమక్రమముగఁ బాట స్వరము హెచ్చించుచుండెను. ఆ త్రాడు బిరబిర నాకసమెత్తు లేచి నిలిచెను. ప్రేక్షకు లుచ్ఛ్వాసనిశ్వాసములను గూడ మఱచి విస్మయ స్తబ్ధులై యుండిరి. వెంకోజీ చరచర నాత్రాటివెంటఁ బైకిఁ బ్రాకిపోయెను. ప్రజ లొండలంతయుఁ గన్నులై యా యద్భుతమును దిలకించుచుండిరి. ఇంతలో నాకసమున భయంకరమైన కేకలు — వెంకోజీ రోదనములును వినవచ్చెను. ఉత్తరక్షణమున రక్త మేకధారగాఁ గురియసాగెను. ఆ ధారవెంట వెంకోజీ ఖండిత కరపాదములు, మాంసఖండములు నేలపైఁ బడెను. ప్రజలందఱును భయవిహ్వలులై పోయిరి. బిజిలీ పరుగుపరుగున వచ్చి యా ఖండితాంగములఁ గౌఁగిలించుకొని గుండెలు బాదుకొనుచు నేడువ నారంభించెను. ఎవరికినేమి చేయుటకును బాలు పోవుటలేదు. ప్రేక్షకమండలి యంతయు నట్టుడికిన ట్లుడికిపోవుచుండెను.

బిజిలీ యొక్క నూనెగుడ్డను గప్పికొని మొదలికి నిప్పంటించుకొనెను. ఆమె నడ్డగించుటకుఁ గూడ నెవ్వరికిని నోరాడలేదు. కాళ్ళాడలేదు. పదిమంది యామెను జుట్టుముట్టునప్పటి కామె కాలి బూదిదయై పోయెను. ప్రజా సమూహము వికలహృదయమై చెదరిపోసాగెను. తిప్పయసెట్టి మున్నగు వారందఱు గ్రుడ్లనీరుఁ గుక్కుకొనుచుండిరి. వేమారెడ్డికి నల్లాడరెడ్డికి గుండెలు దడదడలాడ సాగెను.

ఆకసమునఁ బకపక నవ్వులు. జరజరఁ ద్రాటివెంట జారివచ్చి వెంకోజీ నవ్వుచుఁ దిప్పయసెట్టికడ కరిగి "ప్రభువా! ఇదిగో కొండ మల్లె తెచ్చితిని. నాబిజిలీ యేది!" యనెను. చెదరిపోయిన జనసమూహ మా నవ్వులు మాటలు విని మరలఁ గుదురుకొనిరి. తిప్పయసెట్టి మొగముపైఁ దొంగి చూచిన తెలివి తటుకున మటుమాయ మయ్యెను. ఆయన మొగము వ్రేలవైచుటఁ గాంచి వెంకోజీ "అయ్యో పెండ్లమా" యని యేడువ నారంభించెను. ప్రజలందఱును మఱలఁ గలఁగిపోయిరి. వెంకోజీ రోదనము పట్టరానిదిగా నుండెను. ప్రభువులు, ప్రజలు దిగ్భ్రాంతు లగుచుండిరి. తిప్పయసెట్టి యుత్తరీయము కొంగునఁ గంటి నీరు దుడుచుకొను చుండెను. వెంకోజీ పకాలున నవ్వి "బిజిలీ! ఓ బిజిలీ!" యని కేకలు వైచెను. భస్మరాశిలోనుండి కిలకిల నవ్వుకొనుచు బిజిలీ పరుగెత్తుకొని వచ్చెను. ప్రజల యుత్సాహము మిన్నందుచుండ వెంకోజీ బిజిలీని వెంటనిడికొని యవచి తిప్పయసెట్టికి, వేమారెడ్డికి నల్లారెడ్డికి సలాములు గావించెను. అవచి తిప్పయసెట్టి కానందము తలమునుకలయ్యెను. ఆయావేశమున నాయన తన కంఠమునందలి ముత్యాల హారమును దీసి వెంకోజీ కంఠము నందుంచెను. జనసమూహమును ద్రోసికొనుచు వచ్చిన శ్రీనాథునకుఁ దిప్పయసెట్టి యీవికిఁ గన్నులు తిరిగిపోయెను. ఈ గారడీ వాని నిట్లు సత్కరించిన

యీ రసికుఁడు తనవంటి కవి నెట్లు సత్కరించునో. ఈయన యెవరో! తన కవిత్వము నీయనకు వినిపింప వలసిన దే!

తిప్పయసెట్టి వెంకోజీని మిగులఁ బ్రశంసించెను. ఇంద్రజాల విద్యయు నొక కళయే. కళలన్నింటివలె నిదియు ప్రేక్షకుల హృదయములను గరగించు శక్తికలదే. వెంకోజీవంటి సాధకుల చేతులందది సిద్ధిపొంది తన కళాత్వమును నిరూపించుకొనినది. తిప్పయసెట్టి ప్రశంసను సవినయముగ స్వీకరించి చిఱునవ్వు నవ్వుచు వెంకోజీ "ప్రభువా! ఎంతకళయైనను నిది క్షుద్రకళయేకదా!" యనెను. కాటయవేమారెడ్డి యాతని వివేకమునకు లోలోన సంతోషించెను. వేమారెడ్డి వెంకోజీని యథోచితముగ సత్కరించి మున్ముందా విద్యను నిగ్రహశాలురగు పండితుల సమక్షమున మాత్రమే ప్రదర్శింపు" మని మందలించెను. ప్రేక్షకులు గురిపించిన కానుకలలో వెంకోజీ దంపతులకుఁ గనకాభిషేక మగుచుండ శ్రీనాథుఁడు గ్రుటకలు మ్రింగుచు వారి వంకఁ జూచుచుండెను.

ప్రజాసమూహ మందెవ్వనినోట విన్నను వెంకోజీ ప్రశంసయే. ఉత్తమ కళలుగాఁ బరిగణింపఁబడు సంగీత సాహిత్యాదుల వలనఁ గలుగు నానందము సాత్త్వికము, నింద్రియాతీతమును. ఈ క్షుద్ర కళలవలనఁ గలుగు వినోదము తామసికము నింద్రియ వశమును. వీని యందు హాసభయశోకాశ్చర్యాదులగు భావములు భావములుగనే యనుభూతములగును. ఉత్తమ కళలందీ భావములు రసత్వమును బొందును. అలౌకికమగు నధ్యవసాయముచే లలిత కళలందు హృదయము రసీభవించును. లౌకికమైన భ్రాంతిచే నీక్షుద్రకళలయందు చిత్తము చమత్కృత మగును. వామనభట్టివిధముగ విమర్శించుచుండ

దిప్పయసెట్టి గ్రుక్కదిప్పుకొని "నామపయ్యగారూ! నేను భ్రాంతుఁడ నైతి" ననెను.

ప్రదర్శనము ముగియునప్పటి కింకను నొకటిరెండు గడియల ప్రొద్దుండెను. అవచిదేవయసెట్టికిఁ గుమరగిరి ప్రభువు గావించిన సత్కారమునకుఁ గొండవీటి సెట్టి బలిజ కులములవా రుబ్బి తబ్బిబ్బు లగుచుండిరి. విశ్రాంతినందఁ బోవుచున్న దేవయసెట్టిని, వ్యాపార భారము వహింపఁబోవుచున్న తిప్పయసెట్టిని అభినందిచుటకై సెట్టి బలిజకులములవారు కన్యకా పరమేశ్వరి యాలయమున నొక సభ యేర్పరచిరి. తండ్రియుఁ గొడుకును బ్రదర్శనానంతరము శిల్పమందిర మున కరిగిరి.

కుమరగిరిప్రభు వప్పుడప్పుడే లోకములోనికి వచ్చుచుండెను. ఆయనకన్నులు దెఱచి యొక్కింతసేపట్లే యుండి రెండుచేతులను మెల్లగా దనవక్షఃస్థలము నందుంచుకొనెను. రాయప్పకుఁ బ్రాణములు లేచివచ్చెను. అతఁడు ప్రభువు కన్నులలో జూచెను. ఆ కన్నులు మందహాసము గావింప యత్నించెను. రాయప్ప చేతులపైఁ బ్రభువును లేపికూర్చుండఁ బెట్టెను. ప్రభువు తన చుట్టునున్న వారినిఁ గాంచి యాశ్చర్యపడి నట్లుండెను. ప్రభువు లేవఁబోయెను. వేమారెడ్డియు, నల్లాడరెడ్డియు నాయన కూతయిచ్చి నిలువఁబెట్టిరి. ప్రభువు వారి భుజములపైఁ జేతులూది యంతఃపురములోని కేఁగెను.

బలిజవాడలోఁ గన్యకాపరమేశ్వరియాలయ ప్రాంగణము ప్రజలతోఁగిట కిటలాడిపోవుచుండెను. కొండవీటి సెట్టిబలిజ కులముల వా రాబాల గోపాలమునందే యుండిరి. పురుషుల కెల్లరకును శిరముల జరీపాగలు, నురముల రతనాలహారములు, కరముల మురుగులు,

బది(వేళ్ళకును మణిముద్రికలు, కర్ణముల వజ్రాలకమ్మలు, పాదముల మలక వాళ్ళ కిఱ్ఱుచెప్పులు, పసిడి గొడుగుల తావలు, హస్తముల పన్నె బెత్తములు, మలకబెత్తములు. స్త్రీలకెల్లరకును బాపట కిరుచక్కని శశిభూషణములు, జడకుచ్చులపైఁ బచ్చడపు గండలు, గళముల గంబపుఁగంటెయలు, బన్న సరములు, చెవులకు వజ్రాల కమ్మగెంట్లు, ముక్కుల ముత్యాల ముక్కెరలు, రతనాల నత్తులు, నడుముల మువ్వల యొడ్డాణములు, ముత్యాల మొలనూళ్ళు, ముంజేతులఁ గాంచనమణికంకణములు, నీలాలగాజులు, పాదముల గిలుకుటందియలు, మణిశేఖరములు. ఆలయప్రాంగణమలకా నగరము వలెను నరనారీజనము గదలియాడు కాంచన ప్రతిమలవలె, రతనాల రాసుల వలెఁ దోచుచుండెను.

దేవయసెట్టియుఁ, దిప్పయసెట్టియుఁ బూలపల్లకులపై వచ్చి యమ్మవారి దూలయ ద్వారమున దిగిరి. కులమువారి జయకోలాహలములకుఁ జిఱునవ్వులుపోవుచుఁ దండ్రియుఁ గొడుకును నాలయమునకు బ్రదక్షిణముగావించి యమ్మవారిని దర్శించి ప్రసాదము స్వీకరించిరి. ఆలయశిఖరమున రతనాలు పొదివించుట కేబది వేల మొహరీలు చదివించిరి. ఆలయముపెడలివచ్చి ప్రాంగణమునఁ దమకై యేర్పరచిన యున్నాసనము లలంకరించిరి. కులము పెద్దకన్నయ్యసెట్టి "అఖిల దేశాల తెలికియింఁడ్లవారు "ను "పెభయ్యారు దేశాల సమస్తపెక్కండ్రు "ను నగుతెలికసెట్టి బలిజ కులములవారి పక్షమునను గవర, ముమ్మురిదండ కులములవారి పక్షమునను దేవయసెట్టికిఁ దిప్పయసెట్టికి స్వాగతము పలికెను. చీనాంబరములు, రత్నాభరణములు సమర్పించి సన్మానించెను. తిప్పయసెట్టి నిలువఁబడి కులమువారు తమకుఁగావించిన సన్మానమునకుఁ గృతజ్ఞత వెల్లడించి యిట్లుపన్యసించెను. "కుమరగిరిమహాప్రభువు ధర్మమూర్తి.

మనయందలి యైశ్వర్యములకు నాప్రభువే మూలకందము. మాతండ్రి గారి నెపమున నేఁడు మనకులమునకెల్ల నాప్రభువు గావించిన రాజోచిత సత్కార మాయన విశాలహృదయమును జాటుచున్నది. ఆప్రభువు రాజ్యమునకు వచ్చిన యీయారేండ్లుగా మనయైశ్వర్య మురుకులుఁబరుగులు నెత్తుచుండుట మీరెఱుఁగనిదికాదు. ఆచల్లనిప్రభువు పాలనము మనకు శ్రీరామరక్ష. మనమెల్లరము నాప్రభువున కండదండయైనిలిచి కొండవీటిరాజ్యము నిత్యవసంతనిలయమై కలకాలము కలకలలాడునట్లు కృషిసలుపవలయును. ప్రభువు వైష్ణవమతాభిమానియను శంక మన కేల? కొండవీటిప్రభువు లాదినుండియు నుభయమతములను సమదృష్టితోడనే సమర్థించుకొని వచ్చుచున్నారు. అహోబిలక్షేత్రమునఁ గళ్యాణమంటపము గట్టించిన వేమమహీపతియేకదా శ్రీశైలమునఁ బాతాళగంగకు సోపానములు గట్టించినది. షట్కాలశివపూజా ధురంధరుఁడైన యామహాప్రభువు హరివంశము నంకితము పుచ్చుకొనలేదా! కొండవీటిప్రభువుల సమరసదృష్టిని మీరెల్లరుననుభవపూర్వకముగనెఱిఁగియే యున్నారు. కొండవీటిరాజ్యలక్ష్మి నోములపంట కుమరగిరిప్రభువు. ఆయన పాలనము నూఱేండ్లు వర్ధిల్లుగాక! వీరబలంజ్యధర్మరక్షకులును, రణరంగరాములు, సంగ్రామభీములు నని పేరెన్నిక గన్న మీరెల్లరును గుమరగిరి మహాప్రభుని రాజ్యమునకు మూలస్తంభములై నిలుతురుగాక!" కుమరగిరిప్రభువునకును నవచివంశమునకును జయజయధ్వానములతో సభయంతయు ఘూర్ణిల్లిపోయెను. తిప్పయసెట్టిలేచినిలిచి సభకు నమస్కరించి తండ్రిచేయిపట్టుకొని బయలుదేరెను. ఆలయద్వారమున భద్రగజము సిద్ధముగానుండెను. తండ్రియుఁ గొడుకును గజాధిరోహణము గావించిరి. కన్నయ్యసెట్టి ఛత్రముపట్టెను. రంగప్పసెట్టియు, నెల్లప్పసెట్టియుఁ జామరములుపట్టిరి. మంగళవాద్యములు చెలఁగుచుండ నూరేగింపుసాగెను. నగరము వీథివీథులఁ దిరుగుచు

అర్ధరాత్రమువఱకు నూరేగింపు సాగుచునేయుండెను. తిప్పయసెట్టి వితరణమున నారేయి కొండవీటినగరమునకుఁ బుక్కిలింతలయ్యెను.

౨

కొండవీట నాదినమున శైవుల యుత్సాహము పొంగులువారుచుండెను. వీరశైవుల యుద్రేకము పట్టరానిదిగానుండెను. ఉత్తరదేశమండలి శైవమహాక్షేత్రములు దర్శించుకొని మామిడి సింగన్నమంత్రి కొండవీటికిఁ దిరిగివచ్చుచున్నాఁడు. వింధ్యవాసినియగు చండికాదేవిని గూడ ఆయన సేవించెనట. అచ్చటనే ఆయన కోమటివేమారెడ్డిని గలిసికొనెను. కొండవీట వైష్ణవపాలనము నంతమొందించి శైవపాలనము బునఃప్రతిష్ఠింపుమని యాదిభైరవి నర్థించుటకై కోమటిరెడ్డి వింధ్యాచలమునకు దీర్ఘయాత్రగావించెను. తలవనితలంపుగా మామిడి సింగనమంత్రియు నచ్చటికివచ్చుట దేవీసంకల్పముగాఁ గోమటిరెడ్డిబుద్ధికి భాసించెను. ఏకార్థప్రవణులగువారు చండికాక్షేత్రమునఁ బదిదినములుండి దేవికి ఫలపక్షి మృగ నరబలి పూజావిధానములు యథావిధి నిర్వర్తించి భైరవతంత్రము నాచరించి యిరువురును గలిసియే తిరుగు ప్రయాణము గావించిరి. కోమటిరెడ్డి కొండపల్లిలో నాగిపోయెను. సింగనమంత్రియుఁ గొండపల్లిలో రెండుదినములుండి స్వగృహమునకు బయలుదేరెను. పదిగడియలప్రొద్దెక్కుసరికాయన కొండవీడు చేరును. ఆపరమమాహేశ్వరుని వీటిలోనికిఁ దోడితెచ్చుటకై కొండవీటి మాహేశ్వరవ్రతులు మేళతాళములతోఁ గోటవెలుపల గుమిగూడియుండిరి.

సింగనమంత్రి యాదినుండియు శైవాచారసంపన్నుఁడే. కుమారగిరిప్రభువు సింహాసనమధిష్ఠించిన నాఁటినుండియు నాయన వీరశైవవ్రతమవలంబించెను. అద్దంకిలో రెడ్డిరాజ్యము స్థాపించినవాఁడు ప్రోలయ

వేమారెడ్డి. రాజ్యస్థాపనమునఁ దనకు గుడిభుజములై నిలిచిన తనసోదరులలో మాచారెడ్డిని ధనదవోలునందును, మల్లారెడ్డిని కందుకూరు నందును ప్రతినిధులుగా నియమించి ప్రోలయవేమారెడ్డి తాను అద్దంకి నుండి పరిపాలనము చేయుచుండెను. ప్రోలయవేమారెడ్డి యనంతర మాయన పుత్రుఁడు అనపోతారెడ్డి యద్దంకిసింహాసనమెక్కెను. పశ్చిమమునుండి విద్యానగరప్రభువులయొత్తిడి మిక్కుటమగుటచే నద్దంకి యందు రాజ్యమునకు భద్రతచాలదని తలంచి యనపోతారెడ్డి రాజధానిని గొండవీటికి మార్చెను. ఆయన యనంతరము ఆయన సోదరుఁ డనవేమారెడ్డి రాజై కొండవీటిరాజ్యమును సామ్రాజ్యముగావించెను.సింహాచలమువఱకు రెడ్డిప్రభువులపాలనము విస్తరిల్లఁజేసెను. కటకమువఱకు రెడ్ల ప్రతాపజ్వాలలు వ్యాపింపఁజేసెను. ఆయన మహావీరుఁడు. మహాదాత. హేమాద్రినిగదితములైన సర్వదానముల నాయన యొనరింరించెను. కవులకుఁ బండితులకు, వేదకోవిదులకు నాయన ధారవోసిన యగ్రహారములనంతములు. ఆయన షట్కాలశివపూజాధురంధరుఁడగు పరమమాహేశ్వరుఁడు. సుకుమారశీలియగు కుమారగిరిరెడ్డి యనపోతారెడ్డి మరణించునాటి కిరువదియేండ్లవాఁడు. అప్పుడప్పుడే నిర్మాణదశ యందున్న సామ్రాజ్యము నాతఁడు నిర్వహించుకొనఁజాలఁడని యమాత్యదండనాథులు ప్రజలపక్షమున ననవేమారెడ్డి సర్థింప నాయన రెడ్డి సామ్రాజ్యసారథ్యము స్వీకరించెను. ఆయన పదునెనిమిదేండ్ల పరిపాలనలోఁ గొండవీటిరాజ్యము శ్రీశైలమునుండి సాగరమువఱకును, నద్దంకినుండి సింహాచలమువఱకు విస్తరించి మహాసామ్రాజ్యమయ్యెను. ఆయనయపుత్రుఁడై మరణించుటతో రాజ్యమునఁ గలతలు బయలుదేరెను. ప్రజలలో, నమాత్యదండనాథులలో, దుర్గాధిపసీమాధిపులలోఁ జీలికలు వచ్చెను.

ధనదవోలు రాజ్యము మొదటినుండియు నొక విధమగు స్వతంత్ర ప్రతిపత్తి ననుభవించుచుఁ బ్రధాన రాజ్యమునకు సామంత రాజ్యముగ నుండెను. మాచారెడ్డి యనంతర మాయన కుమారుఁడు పెదకోమటిరెడ్డి యీ రాజ్యమును బాలించెను. ఆయనకు వేమా రెడ్డియు, మాచారెడ్డియునని యిరువురు పుత్రులు. అనవేమారెడ్డి యనంతరము కొండవీటి రాజ్యము తనకు రావలెనని యీ వేమారెడ్డి పట్టు పట్టెను. ఇతఁడు వీరమాహేశ్వర దీక్షాశాలి. కుమరగిరిరెడ్డి వంశాచారమును విడిచి వైష్ణవము స్వీకరించెను. దేశమునఁ జీలికలు వచ్చుట కిది యొక కారణము. రాజ్యమునఁ బ్రజల యందును, నమాత్య దండనాథాదుల యందును నధిక సంఖ్యాకులు శైవమతా వలంబులు. వీరందఱకుఁ గుమరగిరి రాజగుట యంతగా రుచింపలేదు. కొందఱు బహిరంగముగఁ గోమటి వేమారెడ్డియే రాజు కావలెనని యుద్ఘోషించిరి. అభిప్రాయభేదము లంతఃకలహములుగాఁ బరిణమించి తీవ్రమయిన యంతర్యుద్ధముగాఁ బర్యవసించెను. శైవాభిమానులయ్యు వైష్ణవద్వేషులు గానియమాత్య దండనాథ సామంతాదుల యండ సంపాదించి మహావీరుఁడు, రాజనీతిజ్ఞుఁడునైన కాటయవేమారెడ్డి కుమర గిరిరెడ్డిని కొండవీటి సింహాసనమునఁ బ్రతిష్ఠించెను. రాజద్వేషులగు పలు వురు ప్రధానోద్యోగులను బదవీ భ్రష్టులను గావించెను. అట్లు భ్రష్టు లయినవారిలో సింగనమంత్రి యొకఁడు. రెండు మూఁడు తరములుగా ంగనమంత్రి వంశీయులు రెడ్డి రాజులకు మంత్రులుగా నుండిరి. ామిడిపెద్దయమంత్రి యనపోతారెడ్డికిని, అనవేమారెడ్డికిని మంత్రిగా నుండెను. సింగనమంత్రియు ననవేమారెడ్డి మంత్రివర్గమునఁ బ్రముఖ స్థానము నలంకరించి యుండెను. వైష్ణవద్వేష మాయనకుఁ బదవీచ్యుతి హేతువయ్యెను. దానితో నాయనకు వీరావేశము పుట్టుకొని వచ్చెను. కొండవీటి వీరశైవుల కాయన నాయకుఁడు.

పింగళజటాధారులు, భస్మోద్ధూళితగాత్రయష్టులు, కంఠావలగ్న శివలింగమూర్తులు, కరకీలిత కరవాలురు నగు భైరవోపాసకులు, నానావిధప్రమథ వేషధారులై కొండవీటి కోట వాకిట సింగయమంత్రికి స్వాగత మొసఁగిరి. ఆదిభైరవీదేవి వాహనములం బోని వీరభటులేఁబదిమంది యాయన వెంట నుండిరి. సన్నగాఁ బొడవుగా నున్న సింగనమంత్రి వారినడుమ జంగమ మైన మహాకాలుని త్రిశూలము వలె నుండెను. బంగరు గుబ్బలలోఁ బొదివిన యుసిరిక కాయలంత రుద్రాక్షముల దండ భసితాలిప్తమగు నాయన వక్షఃస్థలమునఁ బరమేశ్వరుని యురమందలి యురగహారమువలెఁ దళతళలాడుచుండెను. విభూతి త్రిపుండ్రముపై దిద్దిన కుంకుమరేఖ నిటాలమునఁ దృతీయలోచనమువలె వెలుఁగుచుండెను. పింజలువోసి కట్టిన నీరాకావిదోవతి ప్రత్యగ్రమైన గజాజినశోభ వెలార్చుచుండెను. బంగరుకోళ్ళ దంతపుఁబావలు చిటుకు చిటుకు మనుచుండ సింగనమంత్రి చిఱునవ్వులు నెమ్మోమునకు భసితాంగరాగ పరిపాకము వహింపఁ జేయుచు త్తి యెల్లరను దీవించెను. శంఖ కాహళ డమరుకములు ఘోరన మొరసెను. వీరాంగములు, కొమ్ముబూరలు, జేగంటలు దిక్కులు బూరటిల్లఁ జెలరేగెను. హరహరమహాదేవ శంభో! జయ మహాకాళీ! జయకాల భైరవ! జయచండీశ్వర! యను ఘోషలచే నాకస మావులించినట్లయ్యెను. కాశీనాథుఁడు మహాదేవుఁడు స్వయముగఁ గొండవీటికి విజయంచేసినట్లు వీరమాహేశ్వరుల హృదయము లుప్పొంగిపోయెను. వీరావేశమున భక్తులు గళములెత్తి యొత్తిలి యఱచు రుద్రజయ ఘోషలు కొండవీటి రాజభవనముల యంతరాళముల ఘూర్ణమాన ప్రతిధ్వాన గుంభన గంభీరములై విజృంభించెను. సింగనమంత్రి పాదరజో లేశస్పర్శకై భక్తులు బాటకిరు కెలంకుల సాష్టాంగముగ నేలపై జాగిలిపడిరి. మొగుడుఁ దమ్ములవంటి వారి

యంజలి పుటములపై బంగరుకోళ్ళ దంతపుఁబావలు చిటుకు చిటుకు మనుచుండ సింగనమంత్రి ముందుకు సాగిపోయెను.

ఊరేగింపు ప్రధానవీథుల వెంటఁబోవుచుండఁ బ్రజలెల్లరు విఱుగఁబడి యా వింతను దిలకించు చుండిరి. నందీశ్వరుల వంటి వృష భములఁ బూన్చిన శకటముపై సింగనమంత్రి వీరశైవ ప్రభవలె నిలు వఁబడి యుండెను. చతుష్పథము లందించుకంత నిలుచుచు నూరే గింపు సాగిపోవుచుండెను. వీరణములయుఁ గొమ్ముబూరలయు, డమరు కములయు మ్రోఁతలకుఁ జెవులు దిబ్బడలువోయి ప్రజలకుఁ దాత్కా లిక బాధిర్య మావహిల్లుచుండెను. వీరణముల రుంయి రుంయిమను రొదలు నరములకుఁ బురి యెక్కింప నొడళ్ళు మఱచి మైలార వీరభటులు చతుష్పథములందు వికృత భీషణ తాండవము లాడు చుండిరి. ఒక వీరభటుడు చురకత్తితోఁ గన్నులు పెరికి వృషభముల నుదుళ్ళ నంటించి కన్నులందొరగు రుధిరధారలు శకటము ముందు వారలు పోసెను. సింగనమంత్రి శకటమా భక్తుని దేహము మీదుగా ముందుకు సాగిపోయెను. వేఱొక చతుష్పథమున నింకొక వీరభటుఁడు గండ కత్తెర వైచుకొనఁబోవుచుండ రాజభటులు వచ్చి నడివీథులలో నట్టి ఘోరదృశ్యములను బ్రదర్శింపరాదని రాజాజ్ఞ ప్రకటించిరి. వీర శైవులందుఁగలవరము పుట్టెను. సింగన మంత్రి ముఖము నల్లవడెను. యన కాలభైరవునివలె గర్జించుచు "ప్రభువులు స్వమతచ్యుతికిఁ ల్పడినది చాలక స్వధర్మ క్షతికిఁగూడఁ బూనుకొనుచున్నారా! రమ మాహేశ్వరులకుఁ బట్టు గొమ్మ యైన కొండవీటఁ బరమేశ్వర భక్తులకు నేఁడు నిలువనీడయు లభింపదు గాఁబోలు! కానిండు, అన్నింటిని జక్కఁబెట్టుట కాదిభైరవీ శక్తియే కలదు." అనుచు నాయన యూరేగింపు నిలుపుచేయ నాజ్ఞాపించెను. వాద్యఘోష

లాకస్మికముగఁ జల్లారెను. తటాలున శకటము డిగ్గనురికి యెవరి యిండ్లకు వారిని జెదరి పొండని యదలించుచు సింగనమంత్రి చరచర స్వగృహాభిముఖుఁడై నడచిపోయెను. ఆ లాతచక్రములవలెఁ బరిభ్రమించుచున్న యాయన కన్నులనుండి వెడలు కోపపుసెగల కావసంత కాలపు టీరెండలు కణకణ మండిపోయెను. బంగరుకోళ్ళ దంతపు పావల చిటుకు చిటుకు సవ్వడులకుఁ బుడమి పెటిలు పెటిల్లు మని చిట్లుచున్నట్లుండెను. పరమశివుని పాదమంజీరమైన పాపతేఁడు పడగవిప్పి బుస్సలుకొట్టుచుఁ దోకపైఁ బ్రాకిపోవుచున్నట్లాయన క్రోధావేశమునఁ దూగుచు రోజుచు రివ్వునఁ దన యింటి కేగెను. వీథిమెట్లెక్కి గిఱ్ఱున వెనుకకుఁదిరిగి ద్వారబంధపుఁ గమ్ముల నిరుగేలఁ బట్టుకొని శిరము ముందునకు నిక్కించి యాయన వీథిలోనికిఁ జూపు సారించెను. ఆ చూచుట పాదతాడితమైన మహాభుజంగము పుట్టలో దూరుచుఁ దలయెత్తి బుస్సుమన్నట్లుండెను. ఆయన రెండు నేత్రములును క్రోధజ్వాల లుమియుచు నిటలమునఁ గలిసికొని యొక్కటే నేత్రముగాఁ దోఁచెను. వెనుక వచ్చుచుండిన రాజభటు లాయన లలాటమునఁ ద్రిశూలాకృతియైన భ్రూభంగభంగిమం గాంచి తటాలున నాగిపోయిరి.

కాటయవేమారెడ్డికిఁగూడ కుమారగిరిప్రభువుస్థితి యాందోళన హేతువయ్యెను. ప్రభువుమనస్సునుబట్టి పీడించుచున్న దుఃఖమాయన యెఱుఁగనిదిగాదు. అయినను నాదుఃఖములోతుల నాయన యీవఱకంతగా గుర్తింపలేదు. శిల్పమందిరమునఁ బ్రభువు దీనాకృతివీక్షించి నప్పటినుండియు నాయన కీక నుపేక్షింపరాదను భావ ముదయించెను. ప్రభువు నంతరంగమునందలి వేదన యాయనకుఁ బ్రస్ఫుటమయ్యెను. వేమారెడ్డి అమాత్యదండనాథులతో నాలోచించెను. దుర్గాధిప సీమాధిపులతో మంతనము గావించెను. అల్లాడరెడ్డిని సంప్రతించెను. నర

సింహాపండితుని బిలిపించి ముహూర్తముపెట్టించెను. ఆపద్ధర్మముగా నాయన తేపు సప్తమినాఁడే ముహూర్తము నిశ్చయించెను. కాటయ వేమారెడ్డి ప్రభుపు నేకాంతమునదర్శించి తనయభిప్రాయము నివేదించెను. ప్రభుపు కన్నులింతచేసికొని కాటయవేమారెడ్డిని చూపులలోఁ గాఁగిలించెను. వాడిపోయిన లేమావిచిపురులవంటి యాయన పెదవులప్రయత్నముగ నించుకవిరిసి చిఱునవ్వురూపు దాల్చెను. గాఢాలింగనమునఁ దన్ను బొదివికొని యానందాశ్రువులఁ దన్నభిషేకించుచున్న ప్రభుపు పరిష్వంగబంధము సడలుట గుర్తించి కాటయవేమారెడ్డి యాయనకంటినీటిని కరాగ్రమునఁ బరామర్శించుచు "ప్రభుపులు ప్రసన్నచిత్తులు కావలెను. ప్రభుపులు ఖిన్నులైనచోఁ గొండవీడు చిన్నబోవును. నరసింహాపండితునివాణి యమోఘమైనది. సర్వము సంపన్నము గాఁగలదు. ప్రభుపు చిఱునవ్వులు కలకాల మిట్లే కొండవీటికి వెన్నెలగొడుగుపట్టఁగలవు." ఇట్లనుచుఁ గాటయవేమారెడ్డి కుమరగిరి ప్రభుని కన్నులలోనికిఁజూచెను. పక్ష్మాంచలసంలగ్నములగు నశ్రుకణములనప్పళించుకొనుచు నాయన ముద్దులమఱంది మొగమును మోహాపుఁజూపుల ముద్దులాడెను. మిలమిలమెఱయు నాయన కనుపాపలలోఁ గాటయవేమారెడ్డికిఁ దనమూర్తి యగపడెను. ఆమూర్తికిఁ బ్రభుపు కనుఱెప్పలు ముత్యాలగొడుగులు పట్టినట్లుండెను.

కాటయవేమారెడ్డి ప్రభుపుకడ సెలవుదీసికొని యంతఃపురము వెడలివచ్చెను. నరసింహాపండితునిచే, లకుమాదేవికీశుభవర్తమానము పంపెను. తనమందిరమునకేఁగి మల్లాంబికకు స్వయముగా నీశుభము నెఱిఁగించెను. నాఁటి సాయంకాలము కొండవీట నీశుభవార్త యుద్ఘోషింపఁబడెను. కొండవీట నెవ్వరినోట విన్నను గుమారాన్నపోతారెడ్డి యావరాజ్యపట్టాభిషేక వార్తయే. నాటి సాయంకాలము వరద

గోపీనాథుని యాలయఘంటారావములు స్వయంభూ శ్రీమహాదేవుని యాలయఘంటారావములతోఁ గలిసి కొండవీటి రాజప్రాసాదము మొగసాలపై ఘటికాగారమున మ్రోఁగు ఘంటాధ్వనులను గబళించివైచెను. మూలస్థాన మైలార దేవుని యాలయము మూఁగవోయెను. భద్రకాళికాదేవి యాలయము నిద్రపోవుచుండెను. గుత్తాలపరమేశ్వరి యాలయ ప్రాంగణమున భద్రాశ్వముల మధుర హేషలు, రవగాలునడకలు చెవులకుఁ గనులకుఁ బండువులయ్యెను. కుమారాన్నపోతారెడ్డికి దీర్ఘాయురారోగ్యనిత్యాభ్యుదయ పరంపరాభివృద్ధి యగుటకై వీరబలంజ్యధర్మ రక్షకులు కన్యకాపరమేశ్వరియాలయమునఁ గనకవర్షములు గురిపించిరి. భద్రగజముల సుందరమందగమనములతో, జాత్యశ్వముల యాస్కందితధౌరితకప్లుతక్రమములతో నగరవీధులన్నియు సమ్మర్దములయ్యెను, మందిరములానందతుందిలములై, కాసారములు మధురనీరములై, యారామములు చిత్రకుసుమాభిరామములై నగరమంతయు నానందపరవశమయ్యెను. కొండవీటికిఁ గుమరగిరిప్రభువు ప్రాణము. కుమరగిరిప్రభువునకుఁ గుమారాన్నపోతారెడ్డి ప్రాణము. ఆప్రాణమున కిప్పుడు రాజ్యమునఁ బ్రతిష్ఠ జరుగుచున్నది.

లకుమాదేవి కాటయవేమారెడ్డి భవనమునకు ముత్యాలపల్లకినెక్కి వరుగున వచ్చెను. ఆయన యల్లాడరెడ్డితో వామనభట్టుతోఁ గలిసి యుత్సవనిర్వహణవిధానముఁ జర్చించుచుండెను. నడుమ నడుమ సింగన మంత్రిముచ్చటలువచ్చి ముగ్వురును బకపక నవ్వుకొనుచుండిరి. కాటయవేమారెడ్డి లకుమాదేవిని గొంచెమెడముగాఁ దీసికొనిపోయి యేవో గుసగుసలు పోవుచుండెను. కిలకిలనవ్వుకొనుచువచ్చిన మల్లాంబిక యది గాంచి గిరుక్కునఁ దిరిగిపోయెను. ఘల్లురనిన యామె యందియల రవళికిఁ గాటయవేమారెడ్డి యొడలుజల్లుమనెను. ప్రభువునుత్సాహము

నుద్దీపింపఁజేయుటకై లకుమాదేవిని రాజభవనమునకుఁ బంపివైచి యాతఁడు రాజమందిరాలంకరణమున నల్లాడ రెడ్డిని, నగరాలంకారమున వామనభట్టును నియోగించి తానంతఃపురములోనికిఁ బోయెను.

వసంతోత్సవములలోఁ జివరినాటి రాత్రి మాళవికాగ్ని మిత్ర నాటకమును బ్రదర్శింపవలెనని నిశ్చయింపఁబడెను. కాటయవేమారెడ్డి శాకుంతల వ్యాఖ్యానము పూర్తిగావించిన యనంతరము మాళవికాగ్ని మిత్రమునకుఁగూడ వ్యాఖ్య రచింపఁగుతూహలపడుచుండెను. లకుమా దేవి మాళవిక పాత్రమును ధరించును. కాళిదాసుని హృదయమును జక్కఁగాఁ దనకు వివరించి తన యభినయమునకు మెఱుఁగులు దిద్దుకొను నాసతో నామె యానుకుమఁడ అచు కాటయవేమారెడ్డి మందిరమునకు వచ్చుచుఁ బోవుచుండెను. చంద్రశాలపైఁ దా నధ్యయనము గావించు కొను గదిలోఁ గాటయవేమారెడ్డి లకుమాదేవితో నభినయవిషయములు చర్చించుచు నామె మాళవికాభినయమును విమర్శించి సంస్కరించుచుఁ బ్రతిదినమును గొంతకాలము గడపుచుండెను. మల్లాంబికకు మొదటినుండియు నీవిషయమంతగా నిష్టము గాదు. నానాటికిని వారి యేకాంతగోష్ఠి దీర్ఘతరమగుచుండుట గమనించిన యామెకు రెండు నాళ్ళనుండియు లకుమాదేవి రాకపోకలు తలనొప్పిపుట్టించుచుండెను. ఇప్పుడు తన భర్తయు లకుమాదేవియు నేదియో చెవులు కొఱికికొను చుండుట యామెకు కంటగింపయ్యెను.

యావరాజ్య పట్టాభిషేకవార్త విని యామె యుప్పొంగిపోయెను. అన్నగారిని, మేనల్లుని జూచుటకు రాజభవనమున కేఁగఁదలఁచి యామె చక్కఁగా నలంకరించుకొని మగని కగపడిపోవలెనని చతుశ్శాలలోనికిఁ గిలకిలనవ్వుకొనుచు వచ్చెను. మగడు నట్టునపడుచుతో మంతనములాడుటగాంచి యామె కొడలుమండుకొనిపోయెను. అలంకారము

లోలిచి యావలబడనైచి యామె శయనాగారమునఁ బ్రవేశించెను. పరిచారికల కీపరిణామమేమియు నర్థముకాలేదు. చేరఁబోయిన పరిచారిక నామె కసరికొట్టుటతో నెవ్వరు నామె దరి కరుగుటకే వెరపడిపోయిరి. కాటయవేమారెడ్డి మల్లాంబిక యంతఃపురముఁ బ్రవేశించునప్పటికిఁ బరిచారికలందఱు నెవరికివారు శిలాప్రతిమలవలె నిలిచియుండిరి. వేమారెడ్డి యొకదాసిని బిలిచి తన రాక నమ్మగారి కెఱిఁగింపుమని పంపెను. అది బెదరుచు బెదరుచుఁబోయి శయనాగారద్వారమునఁ జప్పుడు కాకుండ తొంగిచూచెను. మల్లాంబిక కుడిచేతిపిడికిలిపై గడ్డమునానించి శయ్యపై బోరగిలఁ బండుకొని గవాక్షద్వారమున నుద్యానవనము లోనికిఁ జూచుచుండెను. మల్లికాకుసుమమున మకరంద మానుచుండిన మధుకరమొకఁడు చేరువనున్న క్రోవిపూవు వర్ణప్రకర్షచే నాకర్షింపఁబడి యద్దానికి ముసరుకొనుచుండెను. మల్లాంబికకు మగనిపైఁ గోపము పొరలి వచ్చెను. ద్వారమున నిలిచిన దాసి "అమ్మగారూ" అనెను. మల్లాంబిక వినిపించుకొనలేదు. ఆ మధుకర మాక్రోవిపూవుచుట్టు నటులే తిరుగుచుండెను. మల్లాంబిక కాతుమ్మెద యేమిచేయనో చూడ వలెననియుండెను. దాసి మరల "అమ్మగారూ" అనెను. మల్లాంబికకుఁ జిరాకు ముంచుకొనివచ్చి జేవురించిన మొగమును దాసిపైకిఁ ద్రిప్పెను. అది "ప్రభువు దయచేసినా"రనుచుండ మల్లాంబిక దానిపై నురిమిచూచెను. అది యడలుపుట్టి ద్వారముమెనుక దాగికొనెను. మల్లాంబిక మరలఁ దోటలోనికిఁజూచెను. క్రోవిపూవునువీడి యామధుకరము దూరమున నెచ్చటనోయున్న మాలతిపైఁ దిరుగాడుచుండెను. మాలతీనికుంజము నందామధుకరమేమయ్యెనో మల్లాంబికకుఁ గాన్పించలేదు.

పరిచారికపోయి యమ్మగారికి నివేదించితినని కాటయవేమారెడ్డికి విన్నవించెను. ఆయన కొంతసేపటనే కూర్చుండి సనిశ్శ్వాస

మందహాసముగా లేచి "రాజమందిరమునకు దయచేయుమని రాణీ గారికిఁ జెప్పుఁ" డని పరిచారికలతో నని యటనుండి వెడలిపోయెను. ప్రభువునకుఁ గోపమువచ్చునో యని తల్లడిల్లిపోవున్న పరిచారిక లించుక తేరుకొనిరి.

౬

రాయప్పకు నాటిరాత్రియంతయు నుత్సాహజాగరణమయ్యెను. అతనికి నిద్దురపట్టలేదు. నడురేయియగువఱకును ప్రభువు కుమారు నంకమునందిడుకొని లాలించుచు నానందించుటతోడనే సరిపోయినది. ప్రభువు నానందమునుగాంచి తానానందపరవశుఁడగుటతోడనే రాయప్పకు గడియలు నిముసములుగా గడచిపోయినవి. పసివానికిఁ గునుకు పట్టుచున్నది, రేయెల్ల మేల్కనియున్నచో నాతని యారోగ్యముదెబ్బ తినునని పరహితభాస్కరాచార్యులవారు గొడవచేయసాగిరి. అభినందింపవచ్చుచుండిన పౌరప్రవాహము నాపుచేయించి ప్రభువు కుమారా న్నపోతారెడ్డిని శయనాగారమునకనిపెను. భాస్కరాచార్యులవారా రేయెల్లఁ గుమారుని శయ్యప్రక్కనేయుండి గడియగడియకు నేదో యౌషధమును బోయుచుండెను. ప్రభువుగూడ లకుమామల్లాంబికాదుల నిండ్లకుఁ బో నియమించి తానును శయ్యఁజేరెను. ఆయన యంతరంగము లోతులలోఁగలక వేయుచున్న చింతాశల్యము నేడవగతమయ్యెను. ఆయనచిరమనోరథము నేఁడు సిద్ధించెను. ప్రసన్నచిత్తుఁడై యాయన సుఖనిద్రావశుఁడై పోయెను.

రాయప్పకుఁ గాలు నిలుచుటలేదు. ఆతఁడు రాచనగరమంతయుఁ దిరుగఁజొచ్చెను. స్వర్గమునుండి దిగివచ్చి యువరాజ్ఞియాత్మ యంతఃపురము నందానంద సంభ్రమసంచారములు గావించుచు రాచనగరి యలంకరణములకు మెఱుగులు దీర్చుచున్నట్లుండెను. తన మైత్రి

సంతానము - నేఁడు కొండవీట యౌవరాజ్యపట్టాభిషి క్త మగుచున్నది. యువరాజ్ఞి యా రాచనగరునం దెల్లవస్తువులును దానయై యందము లుగా నానందములుగా మొలిచివచ్చుచుండెను. అల్లాడరెడ్డియు నన్న యమంత్రియు నకుళావంజులాదులఁ దోడుచేసికొని యంతఃపురమునఁ బ్రతియంగుళమును సౌందర్యమును బూతలుగా, మెఱుఁగులుగాఁ జిత్రములుగా, రంగవల్లులుగాఁ, దోరణములుగా దీర్పించుచుండిరి. ఎచ్చటఁజూచినను దానయై వెఱ్ఱివానివలెఁ దిరుగాడుచున్న రాయప్పను జూచి వారు నమమనమమ నవ్వులాడుకొనుచుండిరి. అంతఃపురమునఁ దిరిగి తిరిగి రాయప్ప నగరమువెంట బయలుదేరెను. అర్ధరాత్రమునం దానగరమునఁ బట్టపగలువలె నుండెను. చతుష్పథములందు మణి దీపికాతోరణములు కోటి యింద్రధనుస్సులు యుగపదుత్పన్నము లైన ట్లుండెను. లలాటమున యువరాజపట్టము, నురమున యువరాజపతక మును మెఱయఁ బట్టగజము నధిరోహించి యువరాజు కుమారాన్న పోతారెడ్డి రేపీ రాజవీథులం దూరేగింపువచ్చును. ఈ చతుష్పథముల ముహూర్తమాగి నగరలక్ష్మీ మస్తకమకుటమాణిక్య మనోజ్ఞమూర్తియై పౌరజనుల కన్నులకుఁ బండువు చేయును. అప్పు డీమణిదీపికాతోరణము లాయనకు నీరాజనములు పట్టును.

నగరమంతయు నారాత్రి మేల్కనియే యుండెను. వసంతోత్స వాలంకృతము లైన పౌరమందిరముల కలంకారముపై నలంకా మగుచుండెను. దుర్గాధ్యక్షుఁడగు జతనము పెద్దిరాజు భద్రాశ్వము నెక్కి నగరమున సందుగొందులన్నియుఁ దిరుగుచు యువరాజు పుర మేఁగవచ్చునప్పుడు పౌరులు ప్రవర్తింపవలసిన విధానముల నుపన్య సించుచుండెను. ప్రధానసేనాపతియగు ప్రెగ్గడదండనాథుఁడు యువ రాజునకు వందనము సమర్పించుతీసుల నాశ్వికదళమును సాధనము

చేయించుచుండెను. వామనభట్టు చతుష్పథములందెల్ల రెడ్డివంశప్రశస్తి పతాకములను వ్రేలాడఁగట్టించుచుండెను.

రాయప్ప పిచ్చియెత్తినవానివలె వాడలన్నియుఁ దిరుగాడెను. అతనినిగాంచినవారెల్లరును నగరాలంకరణపర్యవేక్షణమునఁ బ్రభు వాతనిని నియోగించెఁ గావలయు ననుకొనిరి. కొండవీటి వీథులన్నియు నద్దములవలె నలికి ముగ్గులుతీర్చి పురలక్ష్మి తనయందము తానే తిలకించుకొని మురిసిపోవుచున్నట్లుండెను. తూర్పునఁ దెలతెలవాఱుచుండ స్నాతానులిప్తయై శుభ్రవసనములు ధరించి లకుమాదేవి ముత్యాల పల్లకిలో నంతఃపురాంగణమున దిగెను. ఒకతూరి నగరు నలుమూలలు దిలకించివచ్చెను. ఇంతలో మల్లాంబికయు వచ్చెను. ప్రధానివేషము మెఱయఁ గాటయవేమారెడ్డి పంచకళ్యాణిపై నమాత్యదండనాథసామంతులతోఁ గూడి యరుదెంచెను. మొగసాలపై వీరాస్వామి మాయామాళవగౌళరాగమున వారికి స్వాగతము నెఱపుచుండెను. ప్రభాత మందమారుతములపైఁ దేలియాడుచు నారాగాలాపము సుఖ నిద్రావశమైయున్న కుమరగిరి మహీపతి శ్రవణేంద్రియమునకు సంగీత స్వప్నములు దెప్పించుచుండెను. ప్రత్యూషశ్శీతల సుగంధిల మరుదంకురములు ప్రభువు సర్వాంగములను బరిష్వజించి యువరాజ్ఞి లలితాంగుళీస్పర్శనములవలెఁ జక్కిలిగింతలు వెట్టుచుండెను. ప్రభువు నెమ్మెన మెలకువ పులకించెను. ఆయనకన్నులరవిరిసెను. ప్రసన్న కాసారమున దరవికచములగు నరవిందములవలె నాకన్నులందము లొలుకుచుండెను. అర్ధనిమీలితలోచనుఁడై ప్రభువించుకసేపు గోపాలనామస్మరణము గావించుకొని శయనము నుజ్జగించెను. కాల్యకరణీయముల నిర్వర్తించెను. సౌఖశాయనికులైన వేమారెడ్డికి నల్లాడరెడ్డికిఁ గడకంటి చిఱునగవుల బదులు పలుకుచు నంతఃపురాంగణమున కుమారునితోఁగూడి ప్రాఙ్ముఖుఁడై దంతపుఁ జీట

నలంకరించెను. మల్లాంబిక మంగళగీతము పాడి బంగరుపళ్లెరమున [illegible]
రారతి పట్టెను. లకుమాదేవి లలాటమునఁ గుంకుమతిలకము దీర్చి [illegible]
నకుళావంజిలాదు లగరునూనియలఁ దలయంటి కస్తూరిపసపుల నలుగులు
పెట్టి గోరువెచ్చని గాంగేసీట జలకములార్చిరి. రాయప్ప [illegible]
యువరాజునకు ఫాలములఁ దిరుమణి తిరుచూర్ణములఁ దిలకములు [illegible]
లకుమాదేవి రాజునకును మల్లాంబిక యువరాజునకును న[illegible] [illegible]
భరణముల నలంకరణము నిర్వర్తించిరి. వందిమాగధులు [illegible]
పఠించుచుండఁ బెద్దియజ్వతోఁ గలిసి పదువురు విప్రులాశీర్వచ[illegible]
పఠించుచుండ ప్రభువు యువరాజసహితుఁడై [illegible]
రెడ్డియుఁ బౌర్యులు నడచుచుండ సభామందిరముఁ [illegible]
మహోజ్జ్వలమగు సింహపీఠిపైఁ బ్రభువాసీనుఁ డయ్యెను. [illegible]
నై పున బాలాసనమునఁ గుమారాన్నపోతారెడ్డి [illegible]
వేదోక్తవిధానమునఁ గుమారునకు యూవరాజ్యాభిషేకము [illegible]
చుండఁ గుమరగిరిప్రభువు కన్నులనుండి [illegible]
ఆయన యంతరంగమున యువరాజ్ఞియు, [illegible]
నిండిపోయిరి. ఫాలమునఁ బట్టుసూత్రము, [illegible]
చిన యువరాజు శీర్షమున బెద్దియజ్వ క్షీరసాగర[illegible]
డిండీరఖండమువంటి ధవళోష్ణీషము నలంకరించుచుండ [illegible]
వాద్యము లాకస్మికముగా బోరుకలంగెను. [illegible]
జయఘోష మిన్నందెను. కుమరగిరి కిరీటధారియు [illegible]
యువరాజుశీర్షమందలి యుష్ణీషము రెడ్డిప్రభువుల [illegible]
మెల్ల నిండి యాయనదృష్టిపథము నావరించియుండెను. [illegible]
భూతమైన యమృతవుసోనవలె వీరాస్వామి [illegible]
నమ్ముప్రభువుశ్రవణేంద్రియమున శబ్దతన్మాత్రను [illegible]

కాటయవేమారెడ్డి సామంత దండనాథామాత్యాద్యధికృతులచే రాజభక్తిప్రమాణములు చేయించెను. అల్లాడరెడ్డి వారందఱు సమర్పించు కానుకలు స్వీకరించెను. లకుమాదేవి రాజునకు యువరాజునకుఁ గర్పూరనీరాజనమెత్తెను. ఆ నీరాజనపుఁ గాంతులలోఁ గుమారగిరి ప్రభువు సంధ్యాతపసమావృతమైన జరతారుణబింబమువలె నుండెను. యువరాజు నీరాజనమునందలి కర్పూరఖండమువలెనుండెను.

రాయప్ప కప్పుడే తెల్లవాఱుచున్నట్లనిపించెను. అతనికిఁ బూర్తిగా నొడలు తెలియునప్పటికి యువరాజు పురమేగి తిరిగి నగరి వాకిటికి వచ్చెను. రాయప్ప తాను నూరేగింపువెంట నుండెను. ఇంటింట యువరాజునకు మంగళహారతులిచ్చుట తాను చూచెను. యువరాజునకు గజదళము, నశ్వదళము, పదాతిదళము వేఱువేఱ వందన సమర్పణము గావించుట తాను తిలకించెను. అగ్నిదళము యువరాజున కిరువదియొక్క శతఘ్నులుప్రేల్చి వందనము సమర్పించుట తాను చెవులార వినెను. ఇదియంతయు నతనికి స్వప్నానుభవమువలెనుండెను. యువరాజు పట్టగజము నవరోహించెను. యువరాజంతఃపురము లోనికిఁబోయెను. మల్లాంబిక యల్లునకు దృష్టిదోషపరిహారవిధులు నిర్వర్తించెను. యువరాజలసిపోయి వాడిన లేఁదమ్మితూఁటివలె వ్రేలఁబడి పోవుచుండెను. రాయప్ప యాతనినెత్తుకొని శయనాగారమునకుఁ దీసికొనిపోయెను. యువరాజున కుష్ణీషము తలపై బరువుగా నుండెను. యువరాజపతకము గుండెలపై బండ లెత్తినట్లుండెను. రాయప్ప వానినిదీసి ప్రక్కనున్న దంతపుఁబీటపై నుంచెను. కుమారవీరభద్రుఁడు గునగున లాడుచు వచ్చి యాయలంకారములు దగిలించుకొని రాచనడకలు వోయి యువరాజును నవ్వించెను.

మూలస్థాన మైలారదేవుని యాలయమున నూర్వురువీరభటులు, భద్రకాళికాలయమున నూర్వురు భైరవీభక్తులు గండకత్తెరలు వైచుకొనిరి.

వసంతోత్సవములలోఁ గొండవీటఁ దమనాటకములను బ్రదర్శించుటకై పెండెలనాగియు, భాగోతులబుచ్చిగాడును బ్రతివర్షము వరుసగా వచ్చుచుందురు. ప్రభువు వారికి వార్షికములుగూడ నేర్పాటు గావించియుండెను. భాగోతుల బుచ్చిగాఁ డచ్చముగ నాడుదానివలెనుండును. అతఁడు సామాన్యముగ నడచుచుండినను, మాటాడుచుండినను నాఁడుది నడచినట్లే, మాటాడినట్లే యుండును. నిరంతరస్త్రీభావనావశమున నాతని శరీరమునకు, మనస్సునకు స్త్రీత్వముపట్టినదా యనిపించును. అతడు వీథులలో నగపడినచోఁ బిల్లలాతని జుట్టుముట్టి కదలనీయరు. అతడు వారినెట్లో బుజ్జగించి, బుగ్గలుపుడికి తప్పించుకొని పోవును. బుచ్చిగాఁడు తమ బుగ్గలు పుడికినాడని, చిబుకము స్పృశించినాఁడని, యలకలు సవరించినాఁడని పిల్లలెల్లరు గొప్పగాఁ జెప్పికొని మురిసిపోవుచుందురు. కొండవీటి రసికయువకులు వాని కూపిరితిరగనీయరు, వానిని దెగఁబొగడుచుందురు. వాఁడు నిజముగ నాడుదియే యైనచో నేలికలనే యేలుకొనియుండునని యందురు. ఆ పొగడితలకాతఁడు పూలతీవవలె మెలికలుతిరుగును. ఆమెలికలకు మోహములొంది యువరసికులొడళ్ళఁ గొంకరలు వోవుదురు.

పెండెలనాగి పామరజనములపాలిటి యచ్చర. అది యాటవేళఁ దప్ప సాధారణముగా లోకులకంటఁబడదు. దాని దచ్చముగా నాడుమేళము. దానిదర్శన మెంతవారికోకాని లభింపదు. ప్రభువులనుదప్ప అన్యులనది దర్శింపఁబోదు. దాని దర్శనమందని యువకులెల్లరు బుచ్చిగాని భక్తబృందమునఁ జేరుచుందురు. ఐదారేండ్లనుండియు నది

వసంతోత్సవములలో బుచ్చిగానితోఁ బోటిగాఁ బ్రదర్శనము లిచ్చుచుండెను. ప్రభువు తారతమ్యనిరూపణము చేయకుండ నిరువురను సమానముగా సన్మానించి పంపివైచుచుండెను. ఈయేడది యటో యిటో తేల్చుకొనవలెనని పట్టుదలతో వచ్చినది. బుచ్చిగాఁడు ఉషాపరిణయమున నుషాకన్యవేసము నద్భుతముగాఁ గట్టునని ప్రతీతి. ఈయేడు నాగియు నుషవేషము కట్టుటకు సిద్ధపడి వచ్చెను.

తలవనితలంపుగా నాడు యువరాజు పట్టాభిషేకము జరిగెడి. ప్రభువుమిత్రుల నుత్సాహముగానున్నాఁడు. నాడే తమ నాటకప్రదర్శనము. పెండెలనాగి మేళమునకుఁ దూర్పువీధియందును, భాగోతుల బుచ్చిగానికిఁ బడమటివీధియందును బ్రదర్శనముల కేర్పాట్లుగావింపఁబడినవి. కొండవీటిప్రజలు తూర్పు పడమరవీధుల రెండుగాఁబంపకమైరి. ఉత్తరదక్షిణముల రాజవీధి కొండవీటికిఁ బాపట చేరువలెనుండును. రాజభవనమద్దానికిఁ జేర్చుక్కవలెనుండును. నాగియొక్కయు, బుచ్చిగానియొక్కయు నాట్యరంగములిప్పుడా పాపటకిరువైపుల సూర్యచంద్రాలంకారములవలెనుండెను. సాయంకాలమే ప్రభువులిరువురకునుఁ గర్పూరతాంబూలములొసంగెను. నాగి తనయాడుతనముబలిమిచే నంతఃపురములోనికేఁగి యువరాజును దనప్రదర్శనమునకు దయచేయ వేడెను.

రాత్రిపదిగడియలప్రొద్దుపోయి ప్రదర్శనమారంభమైనది. రెండు మేళములు నుషాపరిణయమే ప్రదర్శించును. బుచ్చిగాఁడు ముందుగాఁ బ్రదర్శనమారంభించెను. తూర్పువీధినిగూడఁ దనవైపునకు లాగవలెనని వాని యాలోచన. పడమటివీధిలోఁ గంచుతాళములు కంగుమనుటతోఁ దూర్పువీధియంతయు నటుఁబొరలఁదొడఁగెను. బంగరుపల్లకిలో యువరాజువచ్చి రంగమునకుఁ జేరువగా నాసీనుఁడయ్యెను. నాగి యాయనరాకకై కనిపెట్టుకొనియుండెను. ఆయన యాసీనుఁడైనంత నే

నాగి నాటరాగమున నట తాళమునఁ బ్రార్థన దరువునెత్తికొనెను. దాని కంఠము కంచుగీచినట్లుండును. తారస్వరసంచార మామెకు నల్లేరుపై బండినడకవంటిది. తారతరమునఁ బలుకవలెనని యామె యెన్నాళ్లుగనో ప్రయత్నించుచుండెను. కాని కంఠము తెగిపోవుచుండెను. ఏమయినఁగానిమ్మని యిప్పుడామె తెగించినది. ఆమెఅదృష్టము పండినది. తారతరమునందామె యొక్క కేక వైచినది. ఆకేక యాకాశమునంటి కొండవీటిపైఁ జుక్కలు కురిపించినది. ఆకేక కొండవీటి నాలుగుచెరగులను జుట్టుచుట్టి యూరంతయునొక్కచోఁ బోగువెట్టినది. బుచ్చిగాఁడు వట్టిబయలునకే నాటకముఁ బ్రదర్శించుచుండెను. తెలతెలవాఱుచుండఁ బ్రదర్శనములుముగియవచ్చెను. ఉషానిరుద్ధుల పాణిగ్రహణసమయమునఁ బెండెలనాగికి యువరాజు తనమెడలోని ముత్యాలహారముఁ జదివించెను. పెండ్లికూతు సిగ్గులు కులికించుచుఁ బెండెలనాగి యువరాజునకుఁ బ్రణామాంజలి సమర్పించెను.

ప్రదర్శనము ముగిసినంత నాగియు బుచ్చిగాఁడును వేషములు విప్పకుండనే ప్రభువు దర్శనముచేసికొనిరి. ఆయన యిరువురను బ్రశంసించి సమముగ సన్మానించెను. నగరమంతయు నాగిపక్షము రసిక యువకులుమాత్రము బుచ్చిగానిపక్షము. నాగి ప్రభువుతో నిట్లన్నది. " ప్రభువా! మా యభినయముల తారతమ్యము ప్రభువు నిరూపింపవలెను." ప్రభువు నవ్వి యూరకుండెను. నాగి మఱల నిట్లనెను. "కడచినయేండ్లు మే మిరువురము వేర్వేరునాటకములు ప్రదర్శించుచుంటిమి. ప్రభువు లిరువురను సమానముగ మెచ్చుచుండిరి. ఈయేడిరువురము నొకేనాటకమును బ్రదర్శించితిమి. ఒకేపాత్రము నభినయించితిమి. ప్రభువులు మాయభినయనముల తారతమ్యము నిరూపింపవలెను. " బుచ్చిగాని మొగము కోఱకోఱలాడెను. ఆకోఱకోఱ యూతని యాడువేషము మఱుగుపఱచిన మగతనమును గుఱుతునకుఁ దెచు

చుండెను. ప్రభు వినువురివంకనుజూచి మరలనవ్వి యూరకుండెను.
నాగి మరల వాదించెను" పురుషుఁడైన యాతఁడాడుదనము నలవఱచు
కొనుటకుఁగావించిన కృషిని నేనును నభినందించుచున్నాను. ఆతని
యాడుదనము సాధ్యము. నాయాడుదనము సిద్ధము. కాని ప్రభువా!
సిద్ధమైన నాయాడుదనము వెనుక నెన్ని జన్మపరంపరల సాధనయున్నదో
ప్రభువు గుఱుతించిరనుకొందును." నాగి వాదధోరణికిఁ గుమార
ప్రభువు చకితుఁడయ్యెను. విస్ఫారితలోచనుఁడై ప్రభువామె గళమును
జూపులతో నలంకరించెను. తనమెడలోని ముత్యాలహారమును జూచు
కొని నాగి మురిసిపోయెను. యువరాజు తీర్పు జనవాణికిఁ బ్రతిధ్వని
యయ్యెను.

శ్రీనాథుఁడనంతయ్యగారినిఁ గలిసికొనవలెనని రెండుమూడుపర్యా
యములు యత్నించెను. అన్నయమంత్రి యన్నమాట లాతనిని వెన
కకు లాగుచుండెను. బెదురుమదురుగ నెవ్వఁడో తప్ప గళమున లింగము
ధరించినవారు కొండవీట నాతని కంతగా నగపడలేదు. లింగధారణ
మనాగరకలక్షణముగఁ గొండవీటఁ బరిగణింపఁబడుచున్నట్లాతనికిఁ
దోచెను. ఆకొలదిమంది లింగధారులును కన్నడదేశమునుండివచ్చిన
వీరబలిజలే. గళమునందలి యీలింగముతో ననంతయ్యగారిని జూడఁ
బోవుటో పోకుండుటో యాతనికి గుంజాటగానుండెను. రెండుమూడు
మారులాయన యింటిపజ్జకును బోయి తిరిగివచ్చెను. పదుగురతోఁ
గలిసి యాయన కనిపించినప్పుడెల్ల నమస్కారములు చేయుచుండెను.
ఆయన పట్టించుకొననట్లుకనిపించెను. ఒంటరిగా నగపడునేమో పలుక
రింపవలెనని చూచెను. ఎప్పుడుచూచినను అయన కవిపండితులతోడనో
రాజపురుషులతోడనో కలసియే యగపడుచుండెను. కొండవీట నాయన
గొప్పపలుకుబడికలవాఁడే. ఆయనను బట్టుకొన్నచోఁ బ్రభుదర్శనము
సులభముగావచ్చును.

శ్రీనాథుఁడీ నాలుగైదుదినములలోఁ గొండవీఁడంతయుఁ జుట్టి వచ్చెను. బొందిలివాడ సందులలోఁ బూటలకొలఁది పచారులు చేసెను. ఆబొందిలీస్త్రీలయందమే యందము. పండినజామిపండ్లవలె నుందురు. ఆకొమ్మలుసగముదిగియు దిగనట్లు గుత్తముగాఁ దొడిగిన కంచుకముల జలతారంచులక్రిందఁ బనసతొనలవలె మిసమిసలాడు ముడుతలఁగాంచి యాతనికి నోరూరుచుండెను. మేల్ముసుంగుల మఱుగున దోబూచులాడు చందమామల సందర్శింప నాతనిచూపులు వెంపరలాడుచుండెను. చెంగావివలిపెము చెలువుగాఁగట్టి, దళముగా మేన గంధంబునలఁది తిలకంబుకస్తురిఁదీర్చి, జాదులు, కలిగొట్టులుఁ గొప్పునఁ బెట్టి, కంచుదుప్పటిఁగప్పి, యందియడాకాల గీలించి, పువ్వులకోలఁ గేలఁగీలించి, నిద్దమానద్దాలకుచ్చుల చెప్పులు కిఱ్ఱనిమెఱయ, నోడిలోని పోకలాకులుల్లాసమున నములుచు నట్టహాసముగ నొకబొందిలి శెట్టి వీథిలోనికివచ్చెను. ఆతనివెంట గిలుకుటందియలు గలుగల్లురన నెఱచందురునిబింబమరచాటువఱచు మొయిలుతెఱనుబోలు మేలి ముసుంగు సవరించుకొనుచు నాతనియిల్లాలును వచ్చెను. వంగివంగి యాభామిని మోము నోఱగంటఁ దిలకించు శ్రీనాథుని మొగమున నాబొందిలిశెట్టి కోఱమీసలు మెలివెట్టుచు దన బాసలో గుఱ్ఱుమనెను. శ్రీనాథు డడలిపోయి యొడలుముడుంగ నొదిగియొదిగి వీథియోర నడచుచుఁ దనలో గొణిగికొనఁజొచ్చెను.

"వన్నెలగాగరా చెలఁగు
వట్రువ కుచ్చెళులందు పాదముల్
సన్నపువారిభంగముల
సందున నీడెడు బాలకూర్మముల్

గన్న తెలంగుదోఁప కర
కంజములన్ ముసుఁగున్ బిగించి ప్ర
చ్ఛన్న ముఖాబ్జయై నడచె
చంగున బొందిలిభామ గోమునన్.

బొందిలిశెట్టి కోరమీసలు మెలివెట్టుట శ్రీనాథునకుఁ దన చెవులు మెలిపెట్టినట్లుండెను. ఇంటికిఁ జేరువఅకును నాబొందిలిభామ గోము లాతని మోమున వ్రేలుచునేయుండెను.

## ౧౦

శ్రీరామనవమి వసంతోత్సవములఁ జివరిదినము. ప్రభువు స రివారముగ వేణువనమున కేఁగెను. మన్మథపూజ గావించెను. వకుళా వంజులాదుల చర్చరీగీతము లాలకించెను. గొండ్లితిలకించెను. రతిమన్మ థులకు వేణుకాసారమునఁ బ్లవోత్సము నిర్వహించెను. దుర్గాధి సీమాధిపులకుఁ గొంచెముసేపు లతామండపమునఁ గొలువిచ్చెను. క పండితులతో, నర్తకగాయకులతో నల్లంతసేపు వినోదగోష్ఠినొనరి చెను. చిత్రకవి యెఱ్ఱయావధాని సమస్యాపూరణ చాతుర్యమును జి గించెను. ప్రకాశభారతీయోగి యాశువుగాఁ జెప్పిన మదనవిలాసవ నము నవధరించెను. పట్టాశ్వముపైఁ బురవీథులను బర్యటించి పేటపేట జరుగుచుండిన సీతాకళ్యాణమహోత్సవములఁ దిలకించుచుఁ గళ్యా ముహూర్తమునకు శ్రీరఘువేశ్వరాలయము చేరుకొనెను. మట్టమధ్యా హ్నము చిటపటచినుకుల నాకసము పూలవాన కురియుచుండ సీత రాములు తలఁబ్రాలుపోసికొనుట గన్నులారఁ గాంచెను. తానర్పించి బంగరు తలఁబ్రాలదోయిళ్ళులతోఁ గలసి పసపుఁబ్రాలసేసలు బంగరు రాసులయ్యెను. అర్చకుఁడర్పించిన పురపుటాకరతిఁ గన్నులనద్దుకొ

శ్రీపాదములు శిరమున స్వీకరించి, తులసీదళమును చెవిసందునఁ జెరివి కొని, యక్షతలందుకొని ప్రభువు పరివారముతోఁ దిరిగి నగరునకరిగెను.

సాయంకాలము వసంతోత్సవము. చతుష్పథములందెల్లఁ బటి కపుగోళెములఁ గుసుంభరజములు, గందపుఁబసపులుఁ, గస్తూరికా ధూళులుఁ, జిలుబంతిపసపులు భర్గుండపరాగములు గలిపిన పటీర జలములు పొరలిపోవుచుండెను. పెనుదళియలఁ బటవాసరజములు రాసులువోసి యుండెను. నగరమునం దెచ్చటగాంచినను బ్రజలు కొండమల్లెగుత్తులవలె గుంపులుగూడి యుండిరి. ఎల్లరును ధవ ళాంబరములు ధరించి, చిత్రవర్ణాకృతులగు శృంగములు చేపట్టి హృదయముల రతిభావము, గన్నులఁ గామభావము దీపింప నుత్సాహమున నురకలువాఱుచుండిరి. ఎటగాంచినను భిల్లీ వేషములు దాల్చిన వయసుకత్తియల కుండలీన ర్తనములే. మరుపదములతోఁ జిందులుద్రొక్కు వయసుకాండ్ర జిక్కిణీనృత్యములే. ఎటుచూచినను బాలబాలికల దండలాసకములు, నరనారీజనముల హల్లీసకములు గనువిందు గావించుచుండెను. జవరాండ్ర జాజరపాటలలో, నెమ్మో కాండ్ర యేలపాటలలో హిందోళము సాంధ్యమందపవన తరంగముల నాందోళితమగుచుండెను. వేణు వనద్వారమునఁ బూలరథమెక్కి పుష్పబాణదేవుఁడు పురమేగవచ్చుచుండెను. గాత్రమెల్ల నృత్యమై ప్రాణమెల్ల గానమై శృంగారరసాధిదేవత యావేళఁ గొండవీటి రాచ వీథుల వసంతరసాభిషేకముల నోలలాడిపోయెను, పటవాసక్షేపములఁ దేలియాడిపోయెను. సంధ్యాతపమాంజిష్ఠమైన గగనాంగణమున దేవతలుగూడ వసంతము లాడుకొనుచుండిరిగావలయును - క్రిందఁ గొండవీడు, మీఁద గగనమండలము బింబప్రతిబింబభావము భజించి యావసంతసాయంవేళ భూమ్యాకాశములేకరూపమైనట్లు భాసించెను

మోదుగులు పూచినట్లు, అశోకములు కుసుమించినట్లు, కురవకములు విరిసినట్లు చంపకములుపుష్పించినట్లు వసంతరసపరిషిక్తచిత్రాకృతులగు స్త్రీపురుషులచేఁ గొండవీటిపౌరుల భవనములన్నియు నుపవనములయ్యెను.

రాజసౌధనాట్యమందిరమున నా రేయి మాళవికాగ్నిమిత్ర నాటకప్రదర్శనము లకుమాదేవి మాళవికాపాత్రము నభినయించును. నాట్యశాల కవిపండితరసజ్ఞులతో, నమాత్యదండనాథ దుర్గాధిపసీమాధిపులతోఁ, బ్రధానపౌరరాజాధికృతపురుషులతోఁ గిటకిటలాడిపోవుచుండెను. అంతఃపురస్త్రీలు, నాగరనారీజనము ప్రత్యేకస్థలముల నాసీనలై యుండిరి. వసంతరాజీయమార్గానుసారియగు కాటయవేమారెడ్డి వ్యాఖ్యానము రూపించిన యభినయవిశేషముల నాలోకింపనెల్లరును నపహితచిత్తులై యుండిరి. ప్రథమాంకము నడచుచుండెను. ప్రేక్షకులు మాళవికాదర్శనమున కెదురుచూచుచుండిరి. గణదాసకృతమగు నామె నాట్యవిద్యాకౌశల ప్రశంస వారి యంతరంగముల నారటపెట్టుచుండెను. ద్వితీయాంకమవతరించెను. రాజవిదూషకులొకవంకను, ధారిణీపరివ్రాజిక లొకవంకను రంగమున నుపవిష్టులై యుండిరి. మాళవికనాట్యగురువగు గణదాసుఁడు ప్రవేశించి యగ్నిమిత్రునితో "దేవ! లయమధ్యమునుఁ జతుష్పదమునునగు శర్మిష్ఠాకృతప్రబంధముకలదు. అద్దాని-ఛలికప్రయోగమును దేవర యేకచిత్తులై యాకర్ణింతురుగాక" యని నివేదించి నిష్క్రమించెను.

"నేపథ్యపరిగతయగు నామెదర్శనమునకై సముత్సుకములగు నాచక్షువు లధీరములై యాతిరస్కరిణి నపసరింప యత్నించుచునట్లున్నవి" అని యగ్నిమిత్రుఁడు జనాంతికముగఁ జెలికానితో ననుచుండఁ బ్రేక్షకులకాపలుకులలోఁ దమహృదయములు స్పందించినట్లుండెను. ప్రేక్షక

లోకమంతయు నయనేంద్రియప్రధానమై యుండెను. ఆచార్యావేష్ట్య మాణాంగసౌష్ఠవయై మాళవిక యంతటఁ బ్రవేశించెను.

"దీర్ఘాక్షం శరదిందుకాంతి వదనం, బాహూ నతావంసయోః,
సంక్షిప్తం నిబిడోన్నత స్తనమురః, పార్శ్వే ప్రమృష్టే ఇవ,
మధ్యః పాణిమితో, నితంబి జఘనం, పాదావరాళాంగుళీ,
ఛందో నర్తయితు ర్యథైవ మనసి శ్లిష్టం తథాస్యా వపుః"

అని యగ్నిమిత్రుఁడామెను వర్ణించెను. కుమరిగిరిప్రభువు వసంత రాజీయమున నాట్యారంభభంగిమను నిట్లు వర్ణించెను. "అంగస్య చతురస్రత్వం, సమపాదా, లతాకరా" లకుమాదేవి యాభంగిమ మునే యవలంబించెను.

మాళవిక యుపగానమొనరించి చతుష్పద ప్రబంధము నిట్లు గానము చేసెను.

"దుర్లభః ప్రియోమే, తస్మిన్ భవహృదయనిరాశ
మహో! అపాంగోమే పరిస్ఫురతి కిమపి వామః,
ఏషసచిరదృష్టః, కథంపునరుపనేతవ్యో,
నాథ! మాం పరాధీనాం త్వయి పరిగణయ సతృష్ణాం"

పాదచతుష్టయమునఁ గ్రమముగ నిర్వేదము, సాశ్చర్యహర్షము, చింత, దైన్యమునను సంచారిభావములను బ్రదర్శించెను. ప్రథమపాద మున నంతర్బాష్పగాద్గద్యవైవర్ణ్యములచే నిష్టార్థవిరహరూపమై నిర్వేదమును, ద్వితీయపాదమునఁ బ్రసన్నముఖనేత్రపులకోద్గమముల నిష్టార్థలాభసూచనారూపమైన నాశ్చర్యహర్షమునుఁ దృతీయపాదమున జిత్తైకాగ్రతచే నిష్టార్థాలాభరూపమైనచింతను, జతుర్థపాదమున నంగ శైథిల్యాధోముఖత్వములచే నౌత్సుక్యరూపమగు దైన్యమును నభిన

యించి యామె సామాజికులన రౌాగ విప్రలంభశృంగారతన్మయులను గావించెను.

కాటయవేమారెడ్డి విస్ఫారిత కన్నులతో నాయభినయమాధు ర్యమును గ్రోలుచుండెను. లకుమాదేవి యభినయము "పాత్రవిశేషే న్యస్తం గుణాంతరం వ్రజతి శిల్పమాధాతుః" అను గణదాసప్రశం సకు లక్ష్యముగా నుండెను. కుమరగిరిప్రభువున కానాటకమును దిల కించుచున్నంతసేపును దనవసంతరాజీయమునకు చైతన్యమువచ్చినట్లని పించుచుండెను. అంతఃపురకాంతలలోఁ గూర్చుండిన మల్లాంబికకు మాళవికయందు లకుమయే ప్రత్యక్షమగుచుండెను. కాటయవేమా రెడ్డి యగ్నిమిత్రుఁడై తాను ధారిణియగుచున్నట్లామెకుఁదోఁచి యాప రాని యావేశము ముంచుకొనివచ్చెను. ఆమె యాసనమువీడి చరచర నాట్యశాలవెడలిపోయెను. పరిచారికలు కలవరపడుచు నామెవెంటఁ బరువిడిరి.

ప్రదర్శనము ముగియునప్పటికి రాత్రి మూడవయామ మారంభ మయ్యెను. ప్రదర్శనాంతమునఁ గాటయవేమారెడ్డి రంగస్థలమున కరిగి లకుమాదేవియొక్కయు నితరనటులయొక్కయుఁ బ్రజ్ఞావిశేషమును గొనియాడి వారినెల్లరను యథోచితముగ సత్కరించి యిట్లుపన్య సించెను. "కాళిదాసుని నాట్యకళాభిజ్ఞత యద్భుతమైనది. సర్వనాట్య శాస్త్రసారమైనది మాళవికాగ్నిమిత్రము. లకుమాదేవి యభినయము కుమరగిరిమహీపతి వసంతరాజీయమునకు రూపకల్పనము గావించినది. వసంతరాజీయానుసారముగ మాళవికాగ్నిమిత్రమునకు వ్యాఖ్యానము వ్రాయవలెనని యెన్నాళ్ళనుండియో యుబలాటపడుచుంటిని. లకుమా దేవి యభినయము నేఁడా వ్యాఖ్యానస్వరూపమును నాకన్నులకుఁ గట్టి నది. ప్రభువనుమతించినచో నావ్యాఖ్యానమునకుఁ గుమారగిరిరాజీయ

మని నామకరణముగావింప నభిలషించుచున్నాను. "ప్రభువుకన్నులలో నానందము తొలుకాడెను. ప్రేక్షకుల కరతాళధ్వనులు దేవదుందుభులు మొరసెను. కాటయవేమారెడ్డి :

"జయతి మహిమాలోకాతీతః కుమారగిరి ప్రభోః
సదసి లకుమా దేవీ యస్యాశ్రియాసదృశీప్రియా
నవమభినయం నాట్యార్థానాం తనోతి సహస్రశః
వితరతి బహూనర్థా నర్థివ్రజాయ సహస్రశః"

అని కుమరగిరిరాజీయ వ్యాఖ్యానమున కవతారిక పఠించెను.

అంతట వామనభట్టులేచి యిట్లుపన్యసించెను. "ఈనేటి వసంతనవరాత్రోత్సవము లింతటితో ముగియుచున్నవి. శ్రీమన్మహా రాజాధిరాజ శ్రీకుమరగిరిమహీపతి చిరాయువు, స్థిరారోగ్యము, పర మైశ్వర్యముగలిగి యిట్టివింకను నూరు వసంతోత్సవములు నిర్వహించు నట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుగాక!

"భాగ్యంనామ సమగ్ర మీదృశ మతిస్నేహైకపాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధతరిపుధ్వంసే నియుజ్య స్వయం
నిత్యం నందతి నర్తనై రభినవైః కాంతైర్వసంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరిభూపాలో నృపాలోత్తమః"

వామనభట్టు చదివిన శ్లోకార్థమును భావించుకొనుచు నెల్లరుఁ దమతమ నివాసముల కరిగిరి.

కాటయవేమారెడ్డి కుమరగిరిప్రభువుతోఁగలిసి రాజభవనమున కరిగెను. అల్లాడరెడ్డియు నాయనయుఁ దెల్లవారువఱకును ప్రభువుతో నేవో రాజకార్యములు చర్చించిరి. పిమ్మట నొక్కఁగడియ

యట్టె విశ్రమించినట్లు విశ్రమించి లేచి కాల్యములుదీర్చికొని ముఖశాల యందు మువ్వురు నాసీనులై యుండిరి. ఉత్సవములు ముగిసినవి. దుర్గాధిపతులెవరిరాజ్యమునకువారేగుటకై వేగిరించుచుండిరి. అరుణోదయమగుచుండఁగనే కోరుకొండ దురాధిపతి మంచికొండ కూనపరెడ్డి ప్రభువు దర్శనమునకు వచ్చెను. ప్రభువాయనకుఁ జీనిచీనాంబరములు, మణిహారములును, బచ్చలపిడిగల చేపాటి నిర్మలాకరవాలమును బహూకరించెను. "ప్రభూ! కొండవీటి సామ్రాజ్యవృక్షమునకు నాగుండెనెత్తురులు ధారవోయుదు" నని యాయన ప్రతిజ్ఞ చేసెను. ప్రభువువద్ద సెలవుతీసికొని యాయన బయలుదేరెను. అల్లాడరెడ్డిరాజద్వారముదనుక నాయనను సాగనంపివచ్చెను. పిమ్మట నిరవద్యప్రోలు దుర్గాధిపతి భీమదేవచోడఁడు ప్రభువునుదర్శించెను. కుమరగిరిరెడ్డి కాయన మేనత్తమగఁడు. ప్రభువాయన కెదురేఁగి తోడ్కొనివచ్చెను. సత్కారము నెఱపెను. ప్రభువిచ్చినకత్తి నొఱనుండిలాగి "ప్రభూ! ఈకత్తి నాచేతనుండఁ గొండవీటిపై నీగ్రవాలనిత్తునా?" యని భీమదేవచోడుఁడు బీరములాడెను. తనమారుటన్నయగు నన్నెదేవచోడుఁడు కొలువునకువచ్చి యాయన ముఖముకందగడ్డయైపోయెను. ప్రభువు ముఖశాలద్వారమువఱకువచ్చి యాయనను సాగనంపెను. తరువాత సగ్గంకి దుర్గాధిపతి కోటారెడ్డి ప్రభువును దర్శించెను. ఆయన యల్లాడరెడ్డి యన్నగారు. ప్రభువాయనను సన్మానించి పరస్పరాభిముఖులై నిలిచియున్న యాయన్నదమ్ముల భుజములపైఁ జేతులతోఁ దట్టెను. కొండవీటిసామ్రాజ్యమునకుత్తరదక్షిణాంచలముల నిలిపిన విజయస్తంభములంబోని యాసోదరులు ప్రభువునకు నందకసుదర్శనములవలెనుండిరి. ఆయన నిష్క్రమించినంతఁ గందుకూరు దుర్గాధిపతి పినకోమటిరెడ్డి ప్రభువునుదర్శించెను. ప్రభువునకాయన పినతండ్రివరుస. ప్రభువాయనను గౌఁగిలించుకొని సంభావించెను. ఆయన యాశీర్వచనము నచే

క్షించెను. "కందుకూరి వీరభటుల మాంసపిండములు శిలాఖండములై కొండవీటి సామ్రాజ్యశిఖరము నిర్మింపఁగలవు" అని యాయన కుమారునాశ్వసించెను. ప్రభునాయనను ముఖశాలాప్రాంగణముదనుక ననుగమించి యామంత్రణముగావించెను. వినుకొండ దుర్గాధిపతి పెద వెంకప్పరెడ్డి ప్రభువును దర్శించి సత్కారములంది సెలవుగైకొనెను. కడపట త్రిపురాంతక దుర్గాధిపతి వెలుగోటి రాయపనాయకుఁడు ప్రభువును దర్శించెను. రాయపనాయకుఁడు డెబ్బదియేండ్లవృద్ధు. అనపోతారెడ్డినాఁటినుండియు నాయన రెడ్డిరాజ్యమున కండగా నిలిచియుండెను. ఆయన పద్మనాయక వెలమవంశస్థుండు. రాచకొండ, దేవరకొండ వెలమవారు రాచరికమున మరులుగొని సాటిహైందవులగు కొండవీటి యేలికలమీఁదను, విద్యానగరరాజులమీఁదను బహమనీసుల్తానులతోఁ గలిసి కత్తిగట్టుచుండిరి. రాయపనాయకున కీయనార్యసాంగత్యము రుచింపలేదు. ఆయన యాదినుండియు రెడ్డిప్రభువుల పక్షముననేనిలిచి కులమువారితోఁ బెక్కుమారులు కయ్యమాడెను. ఆయనవెంటఁ బెక్కు వెలమకుటుంబములు కృష్ణదాటి త్రిపురాంతక ప్రాంతమునకు వలస వచ్చెను. ఆవలీవలి వెలమపులుల యఱపుల కదరిపోయి కృష్ణవేణి యొడ్లమఱుఁగున నొదిగియొదిగి ప్రవహించును. "కొండవీటిపైఁ గత్తి యెత్తినయరి వీరులను బాతాళగంగలో నూరఁద్రొక్కెంతు" ననుచు రాయపనాయకుఁడు తనపై మూరెడుపొడవున్న బల్లెపుమొనతోఁ బ్రభువు పాదపీఠమును స్పృశించెను. ఒఱవెఱికిన చురకత్తులవంటి యాయనకఱకుఁజూపులు నెఱసిన కనుబొమగుబురులనుండి తళుకుతళుక్కున మెఱసెను. బంగరుటొరలోఁ బొదివిన బారెడుపొడవు పట్టాకత్తిని ప్రభు వాయన నడుమునం దలంకరించెను.

నలుదిక్కులఁ దూములెత్తిన పంటచెఱువునీరము బుస్సునఁ దీసినట్లు ఉత్సవాగతులగు వైదేశికు లెవరిదిక్కునవారేఁగుటతోఁ గొండ

వీటఁ జనసంచారము పలుచపలుచనయ్యెను. కస్తూరీపరిమళములు గుబాళించు రాజవీధులు భద్రసింధురమదగంధ బంధురములగుచుండెను. కర్పూరరజముల దళత్తళలువోవు ఘంటాపథములు కత్తుల మెఱుఁగుఁ బాడులతో మెఱసిపోసాగెను. ఉత్సవజయఘోషలుత్తమ హాయహేషలుగాఁ బరిణమించెను. పౌరవిటబృందములు వీరభట సందోహములై నగరమునందంతటను శృంగారరసతరంగములపై వీరరసము నుఱుములు లెట్టలుగట్టుచుండెను.

కాటయవేమారెడ్డి కూపిరితిరుగనంతపనిగా నుండెను. కొండవీటి దుర్గమునఁగల హస్తితురగపదాతిదళములఁబరిశీలించుట వానివాని సంఖ్యావివరములు సంగ్రహించుట, యాయుధాగారమునందలి యాయుధసామగ్రిని బరిశీలించుట, ఉభయసంధ్యలను మైదానమునజరుగు సైనికవిన్యాసములఁ బర్యవేక్షించుట, మధ్యాహ్నముల సుంకాధికారులను, సుంకగుత్తకాండ్రను గలిసికొని యెక్కుమడిదిగుమడి సుంకములు, నేలసుంకములు, నీటిసుంకములు, గనికట్నములు, వృత్తికట్నములు, ల్లరి, పుల్లరి, వరియరి యున్నగు వివిధశాఖలనుండి యప్పటికి కావసిన యాదాయములను దెలిసికొనుట, వీనితో నాయనకుఁ దినుటకుఁ, నొడుగుటకుఁగూడ దీరికలేకుండెను. గ్రామరక్షణమున నియుక్తులైన యాలెకులను, దలారులను, కారికాపులను సగమునకుసగము తగ్గించి ప్రతిగ్రామము నేబండ్రువీరభటులను, నేవురు పనివాండ్రను సమకూర్పవలెనని గ్రామరెడ్లకు తాకీదులు వ్రాయించెను. సీమాధిపులకొక్కొక్కరు బదిమంది యుక్కుతునకలవంటి దళవాయులను సిద్ధముచేయవలెనని శ్రీముఖములు వ్రాయించెను. ఈ తాకీదులువ్రాయుటలో వ్రాయించుటలో రాయనబాచయ్యగారుక్కిరిబిక్కిరి యగుచుండెను. హీరాంబికకుఁ బంపుటకై శాకుంతలవ్యాఖ్యానపుఁబ్రతిని సిద్ధముచేయు

టలో బాచయ్యగారికి వసంతోత్సవములు జరిగినట్లేలేదు. ఉత్సవ ములు ముగిసినవెంటనే వామనభట్టు తానువిద్యానగరమునకుఁ దిరిగి పోవలెనని చెప్పెను. శాకుంతలవ్యాఖ్యానప్రతి నాతఁడు వెంటఁదీసికొని పోవును. రాయనబాచయ్యగా రాతోండరలోనుండఁగా నాకస్మికముగఁ నీ తాకీదులపని వచ్చిపడెను. వాఖ్యానపుఁబని సగములో నాగిపోయెను. వామనుని ప్రయాణ మాకారణమునఁ గొన్నాళ్ళు నిలిచిపోయెను.

ఈపనులలో మునిఁగి కాటయవేమారెడ్డి యీపదిదినములుగా మల్లాంబికను గలిసికొనలేదు. అర్ధరాత్రమున నింటికేఁగుటయు, సరు ణోదయమున నిలుపీడుటయు నాయనకుఁ బరిపాటి యయ్యెను. భోజన సమయమునఁగూడ మల్లాంబిక యాయన కగపడుటలేదు. ఆయన యావిషయము నంతగాఁ బట్టించుకొనలేదు. అల్లాడరెడ్డి యాయనకు నీడవలెనుండి యీకార్యభారమున సగముపాలు పంచుకొనుచుండెను. ఉత్సవముల యడావుడి వెన్నంటి యీసమరసన్నాహములు ముసరి కొనివచ్చి వేళకు నిద్రాహారము లమరక నాయిరువురును జిక్కి సగ మైనట్లుండిరి.

## ౧౧

తానింతవఱకును రాజునుదర్శింపలేదు. అనంతయ్యగారి దర్శన మైనఁగాని యారాజుదర్శనమున కవకాశమేలేదు. ఈపూజారి చూడ బోయినఁ దనమొగమే చూచునట్లులేదు. ఆయనచుట్టునున్న కవులను బండితులును నట్లేయున్నారు. ద్వారరక్షకుఁడన్నట్లు కొండపేటఁ గవి పండితులెల్లరుఁ బంచకళ్యాణి గుఱ్ఱములవలెనుండిరి. దశమినాటి సాయం కాలము కనకగిరిమహీపతి కవిపండితులను సత్కరించెను. చీనిచీనాం బరములు ధరించి, కాశ్మీరసేలువలు గప్పికొని, కస్తూరితాంబూలములు

సమలుకొనుచు ముంజేతులఁ బసిడికంకణములు, నంగుళుల రత్నాల యుంగరములు మెఱయించుకొనుచు రాజభవనము వెడలివచ్చు కవి పండితులఁ గాంచినప్పుడు శ్రీనాథుని కన్నులు మెరమెరలాడెను. రాజుపై నొకరుచెప్పిన పద్యముల నొకరుప్రశంసించుకొనుచుఁ జిలుకల వలెఁ గోయిలలవలెఁ గిలకిలలాడుచు వారు రాజవీథివెంటఁ బోవుచుండిరి. వారి యగ్రమున ననంతయ్యగారు తానేరాజన్నట్లు ధీరమంథర గమనమున వామనభట్టుతో సల్లాపములాడుచు నడచుచుండెను. శ్రీనాథుఁడు వీథియంచున నిలిచి యనంతయ్యగారికి నమస్కరించెను. వామనభట్టు విసరిన ఛలోక్తి కాయన పక్కుననవ్వెను. అనంతయ్యగారి నవ్వచ్ఛముగాఁ దెలుగునవ్వు. ఆయన మెత్తగాఁ దియ్యగా నవ్వును. కోయిలగొంతులోఁ జిలుకపలికినచో నెట్లుండునో యనంతయ్యగారు నవ్వినచో నట్లుండును. కప్పురపుఁ దాంబూలముల ఘాటు నకు సకిలించుకొనుచుఁ దురికినడకలువోవు నాకవిపండితులు దన్ను త్రొక్కికొనిపోవుచున్నట్లు శ్రీనాథునకుఁ దోచెను. చతుష్పథమునఁ గుడివైపునకుఁ దిరిగి కవిమండలి కనుమఱుగయ్యెను. శ్రీనాథునకొడలఁ గంపరముపుట్టెను. కడుపులో నేదో యావేదనబయలుదేరి కంఠమున కెగఁదట్టెను. ఆతడు కంఠము సవరించుకొనెను. లికుచప్రమాణమగు నిష్టలింగముచేతికిఁ దగిలెను. తనకే తెలియని యేదో యావేశమున నీలింగము తనగళమునకుఁ జుట్టుకొనినది. కొండవీటి కిదియే తన చరణము లకు నిగళమై కూర్చున్నది. శ్రీనాథుఁ డించుక యోజించెను. అన్నయమంత్రి యుపదేశమును, తిప్పయమామ యధిక్షేపమును మతికిఁ దలఁపువచ్చెను. అతఁడు మనస్సు సమాధానపఱచుకొని కంఠమందలి యిష్టలింగమును గటిసూత్రమునఁ గట్టుకొని ప్రాంతసేలువ భద్రముగ నడుమునకుఁ జుట్టుకొని చతుష్పథమునఁ గుడివైపునకుఁ దిరిగి చరచర నడచిపోయెను.

అనంతయ్యగారి యింటఁ గవిపండితు లుపవిష్టులై యుండిరి. మొగసాల కిటకిటలాడుచుండెను. అనంతయ్యగారు తూర్పుముఖముగా గోడనానికొని కూర్చుండెను. గోడపై మూఁడడుగుల యెత్తుగల కవి బ్రహ్మచిత్రపటమును దాని కుడి యెడమల నడుగెత్తుగల యాదికవి చిత్రమును బ్రబంధపరమేశ్వరుని చిత్రము నలంకరింపఁబడియుండెను. వామనభట్టునవ్వుచు "అనంతయ్యగారూ! పదునేనుపర్వములు రచించి నందులకా యేమి కవిబ్రహ్మకింత పెద్దచిత్రము వేయించినారు" అనెను. "స్థూలదృష్టి కట్లే యనిపించు" నని యనంతయ్యగారు మందస్మితము గావించెను.

వామన :— మీకుఁ దిక్కనగారన్న నభిమానముమెండు.

అనంత :— మఱి యాయననుఁ గవిబ్రహ్మయనిన లోకముమాట యేమందురు?

వామన :— లోకముమాట కేమిలెండు. అదివట్టిగతానుగతికము

అనంత .— అనుగతికి పూర్వము గతి యొకఁ డుండవలెఁగదా

వామన .— విమర్శవంతులైన కవిపండితులుగూడ లోకము పాటియేయగుచోఁ గవిత్వము కాకులపాలయినట్లే.

అనంత :— మీరు లోకమునంత తేలికగాఁ దీసివేయుటతగవు గాదు. ఆలోకమునకుఁగానిచో మీకవిత్వము మఱి యెవ్వరికి?

వామన :— రాజరాజులకుఁ గవీంద్రులకును అక్షరమాధుర్య మాత్ర ముగ్ధమగులోకము కవిత్వపులోతు లేమెఱుఁగఁగలదు.

అనంత :— అది మనభ్రాంతి. లోకమంతయు నెఱుంగఁగలదు. లోకము హృదయముతో ననుభవించి యానందించును. మన మంత

టితో నాగక బుద్ధిచే వివేకించి విమర్శింతుము. లోకము మూఁగది. మనము వాచాలురము. భేదమింతే.

వామన :— ఇంతకును నన్నయగారికంటెఁ దిక్కనగారికిఁ బెద్ద చిత్రము వేయించుటలో మీయుద్దేశమేమి ? ఇరువురిలోఁ దిక్కనగారే గొప్పవారనియా ?

అనంత :— ఎంతమాత్రమును గాదు. వారిమార్గములు వేఱు. ఆమార్గములలోఁ దిక్కనగారిమార్గమును లోకము గొప్పగాఁగొనియాడినది. ఈ నూతేండ్లుగాఁ గవిలోకమంతయు నాయనమార్గమునే యనుసరించుచున్నది. నన్నయగారిది-కథనమార్గము. అందు కల్పనావ్యాపారము ప్రధానము. తిక్కనగారిది రసమార్గము. అందు సృష్టివ్యాపారము ప్రధానము. ఒకటి బుద్ధిగోచరమగుప్రజ్ఞ. వేఱొకటి హృదయగమ్యమగు ప్రతిభ.

వామన :— మీవ్యక్తిగతాభిప్రాయమునే మీరులోకాభిప్రాయముగాఁ జిత్రించుచున్నారని నేననుకొనుచున్నాను.

అనంత :— మీరెట్లనుకొన్నను నాకభ్యంతరములేదు.

శ్రీనాథుఁడు మొగసాలగుమ్మమునఁ గమ్మినానుకొని యంతయు నుచుండెను. అనంతయ్యగారాతని వంకఁజూచెను. అతని ముఖము తేటవడి తెలివి దొలుకులాడుచుండెను. అనంతయ్యగారాతనిని లోనికి మ్మని చేసన్న గావించెను. ఆ చేసన్నవెంట సభవారి చూపులు మ్మముమీఁదికి మఱలెను. శ్రీనాథుఁడు సభకు నమస్కరించి నాపేరు శ్రీనాథుఁడందురు. కమలనాభామాత్యులు మా తాతగారు. నేను మరుత్తరాట్చరిత్రమను కావ్యము రచించితిని. శాలివాహనసప్త శతి నిప్పుడు తెలుఁగు చేయుచున్నాను. ఇదె పద్యము వినుఁడా ’’

యనుచు "వారణసేయ దావగోనవా? నవవారిజమందుఁ దేటి" యని చదువుచుండ ననంతయ్యగారు "అబ్బాయి! అన్నియు నుత్పలమాలలే వ్రాసితివా?" యని నవ్వుచుఁ బ్రశ్నించెను. "ఒక్క యుత్పలమాల యేమి? సర్వవృత్తములును వ్రాసితిని. అటనట సీసపద్యములుగూడ వ్రాసితిని" అని యుత్సాహము గదుర శ్రీనాథుఁడు బదులుపలికెను. అనంతయ్యగారద్భుతము నభినయించుచు "అబ్బో! ఏమీ! వ్రేలెడంత లేసి గాథలను వృత్తములుగనేకాక సీసపద్యములుగఁగూడ సాగఁగొట్టితివా? మంచి పనివాఁడవే" యనెను. పరిషత్తంతయుఁ బకాలున నవ్వెను. శ్రీనాథుని మొగము చిన్నఁబోయెను.

అనంతయ్యగారు కవిపండితుల నుద్దేశించి యిట్లనెను. "తలవని తలంపుగా సంఘటిల్లిన కొన్ని కార్యక్రమములవలన నీవసంతనవరాత్రములలో జరుగవలసిన కవితాగోష్ఠి జరుగలేదు. శారదోత్సవములలో నీయంశములకుఁ బ్రాచుర్యము లభింపఁగలదు. ఉత్సవాగతులయిన కవిపండితులకు నాముఖమునఁ బ్రభువు లీ సందేశము నివేదించుచున్నారు. వసంతోత్సవములలో నాట్యగానముల పరిమళములలో మునిఁగి తేలితిమి గదా. శరదుత్సవములలో సాహిత్యచంద్రికల కొఱ కెదురు చూతము గాక!"

కవిపండితులు సెలవుగైకొని వెడలిపోయిరి. వృద్ధుఁడైన పెద్దిభట్టుగారిని జేయిపట్టుకొని నడిపించుకొనుచు వామనభట్టును వెడలిపోయెను. అనంతయ్యగారు శ్రీనాథునికై యటునిటుఁ జూచెను. అతఁ డప్పుడే రాజవీథిలోఁ జరచరనడచి పోవుచుండెను. ఆతఁడు తిన్నగా రాజభవనముదెస కేఁగుచుండెను. ఏమైనఁగానిమ్ము. తాను సూటిగాఁబోయి రాజును దర్శింపవలెను. అనంతయ్యగారి కంతటి యహంకారమా? తన పద్యమును బూర్తిగా విననైన వినఁడా? ఆయన యేదో యనుటయు

నీపండితులందఱును బకాలుమనుటయునా? ఈ కవులందఱు నీయనవల ననే బ్రతుకుచున్నారా! కానిమ్ము. ఒకనాఁడీకొండవీటఁ దనకట్టియధికారము లభింపకుండునా? ఆనాఁ డనంతయ్యగారివంటి యహంకారులు తనయెదుట గడగడలాడిపోదురు.

రాజద్వార మల్లంత దవ్వులనున్నది. అవచి తిప్పయసెట్టి యప్పుడే ప్రభువును దర్శించి తన విడిదలకుఁ బోవుచుండెను. ఆయన యెక్కిన ముత్యాలపల్లకి తన ప్రక్కగాఁబోవుచుండ శ్రీనాథుఁ డాయనకు నమస్కరించెను. తిప్పయసెట్టి యేదో యాలోచించుకొనుచు బ్రతినమస్కార మొనరించెను. తిప్పయసెట్టి వెంకోజీకి గావించిన సత్కారము శ్రీనాథుని కన్నులయెదుటఁ దళుక్కుమనెను. ఆనాటినుండియుఁ దిప్పయసెట్టిని దర్శింపవలెనను నభిలాష మాతని మనస్సులో నొక మూల మెదలుచునే యుండెను. కాలినడకలఁ దిరుగాడు ననంతయ్యగారి దర్శనమే తన కపురూపమైపోయెఁగదా! అందలము దిగని యవచి తిప్పయసెట్టి దర్శనము తన కందుటసంభవమని యాతడు సందేహించుచుండెను. అవచి తిప్పయసెట్టి నిరాడంబరుఁడని యాతని ప్రతివందనము చెప్పుచున్నది. శ్రీనాథుఁ డాయన పల్లకివెంటఁ బడెను.

విడిదలముంగిట నాయన యందలము దిగుచుండగా శ్రీనాథుఁ డాయన కంటఁబడెను. ఉత్సాహము దీపించు నాతని ముఖములోని చులుకుఁదనము తిప్పయసెట్టిచూపు నాకర్షించెను. ఆయన లోనికిఁ బోవుచు "ఏమేని పనియుండి వచ్చితిరా?" యనెను. శ్రీనాథుఁడు తన యూరుపేరులుచెప్పి వచ్చినపనియుఁ జెప్పెను. తిప్పయసెట్టి నడచుచునే "మఱియొక పర్యాయము తీఱికగా దయసేయుఁ" డనెను. "ఒక్కపద్యము చిత్తగింపుఁ" డని శ్రీనాథుఁడు కోరెను. తిప్పయసెట్టి "కానిం" డనెను. శ్రీనాథుఁ డాయన వెనుక నడచుచు

"వారణసేయ దావ గొనవా ?
నవవారిజమందుఁ దేటి క్రొ
వ్వారుచు నుంట నీవెఱుఁగవా ?
ప్రియ ! హా తెలంగఁగంటి గంటి కే
వ్వారికిఁ గెంపు రాదె ? తగవా
మగవారల దూఱ ? నీవిభుం
జూరసి నీనిజం బెఱుఁగు
నంతకు నంతకు నోర్వ నెచ్చెలీ !"

యని రాగధోరణిలోఁ బఠించి "యిది నాశాలివాహనస ప్తశతి యందలి" దని నుడివెను. తిప్పయసెట్టి పద్యము సొంతముగా విని "యర్థము సరిగా నంతుపట్టకపోయినను బద్యము మాత్రము బాగుగనే యున్న" దనెను. శ్రీనాథుఁడు "సెలవైనచో నిందలి యన్యోక్తి చిత్రమును వివరింతు" ననెను. "మఱియొక పర్యాయము తీరికగా నాపనిచేయుదురులెం" డనుచుఁ దిప్పయ్యసెట్టి శ్రీనాథునకుఁ బంచెల చాపుఁ గర్పూరతాంబూలము నొసఁగి పంపివైచెను. "మఱల దర్శనము చేయుదును. మఱువకుఁడు సుఁడీ" యని తిప్పయసెట్టిగారికిఁ దిరిగితిరిగి నమస్కరించుచుఁ గవిసార్వభౌమత్వ మబ్బినంతగా నుబ్బిపోవుచుఁ జేటంత మొగము చేసికొని శ్రీనాథుఁడెగిరివచ్చి యింటఁ వ్రాలెను.

గడపలో నడుగుపెట్టుచునే శ్రీనాథుఁడు "మామా" యని కేకవైచెను. లెక్కలనొడవలో మునిగియున్న తిప్పయగారా కేక కదరిపడి యల్లునివంకఁ జూచెను. అతని ముఖములో నేదో వింతమార్పు గోచరింపఁ దిప్పయ్యగారు "ఏమిరా! ఆమెడలోని దేడ దాచితివి ?" అనెను. శ్రీనాథుఁడు నడుము దడవుకొనుటఁగాంచి యాయన "యట్లయిన నొకమెట్టుదిగితివన్నమాట" యనెను. "దిగితినో యెక్కితినో

పోయి తిప్పయసెట్టిగారి నడుగుము ” అనుచు శ్రీనాథుఁడు సేలువలోఁ జుట్టిన పంచెలచాపును దిప్పయగారి యొడిలో విసరివైచెను. ఆచాపు మడతలలోనుండి కప్పురపుఁదాంబూలము గుప్పున గుబాళించెను. దుర్గ యిదియంతయుఁ దలుపుచాటునుండి తొంగితొంగి చూచుచుండెను.

ఎండలు ముదురకముందే కొండవీటినుండి బయలుదేరవలెనని యవచి దేవయసెట్టి యాతురపడుచుండెను. కొండవీటినుండి సరాసరి కాంచీపురమునకుఁ బ్రయాణము. తండ్రిని గంచిలో డించి తిప్పయసెట్టి తాను దిరిగి విక్రమసింహపురము చేరుకొనవలయును. ఉభయసంధ్య వేళలందప్ప మధ్యాహ్నములయందు దేవయసెట్టి ప్రయాణముగావింపఁ జాలఁడు. ఎంత తరిమి పయనించినను నలసటలేకుండ నరుగవలయుననినఁ గనీసము నెలదినములుపట్టును. చైత్రబహుళ పంచమినాఁడు బయలు దేరవలెనని తిప్పయసెట్టి నిశ్చయించుకొనెను. శరత్కాలమునాటికిఁ గలపెట్టిన తూర్పుదండయాత్రకుఁ గావలసిన యుద్ధసామగ్రీ వివరములు గాటయవేమారెడ్డి తన కందఁజేసెను. ఐదువేల యేనుఁగులు నిరువది వేల గుఱ్ఱములు దానిప్పుడు పరదేశములనుండి తెప్పింపవలెను. ఈజంతు వులితరఖండములనుండి యోడలపై దిగుమతియగుటకు గనీసమైదారు నెలలు పట్టును. త్రోవలో విక్రమసింహపురమున రెండుదినములాగి యీయేర్పాట్లు గావింపవలయునని తిప్పయసెట్టి నిశ్చయించుకొనెను. చవితినాటి సాయంకాలమే తండ్రియుఁగొడుకును గుమరగిరిప్రభువును దర్శించి వీలయినంత త్వరలో యుద్ధసామగ్రిని గొండవీటికిఁ జేర్పింపఁగల మని విన్నవించి యాయనవద్ద సెలవుదీసికొనిరి. పంచమినాఁటి యుద యము సూర్యోదయాత్పూర్వమే ప్రయాణము కట్టిరి.

తిప్పయసెట్టికడఁ జనవుసంపాదింపవలెనని శ్రీనాథుఁ డానాటి నుండియు నాయన విడిదలకుఁ బ్రతిదినమును బోయి వచ్చుచుండెను.

నేఁడాయన వెడలిపోవును. కోటవాకిటఁగసిపెట్టుకొనియుండి శ్రీనాథుఁడు తిప్పయసెట్టికి నమస్కరించెను. ఆయన చిఱునవ్వుతోఁ బ్రతివందన మాచరించెను, "మఱల దర్శనమెప్పటికో. మఱువకుందురుగదా" యని శ్రీనాథుఁడల్లంత దూరమాయనపల్లకివెంటఁ బరువిడుచు విన్నవించుకొనెను. ఆయన చేసన్న నొసంగిన యభయమునుఁ జేలచెఱఁగున ముడివైచుకొని శ్రీనాథుఁడు తిన్నగా సింగనమంత్రిగారియింటిముఖము పట్టెను. సింగనమంత్రిగారానాఁడు వీథిలోఁ బ్రదర్శించిన వీరావేశము శ్రీనాథుని హృదయవీథి నత్తుకొనిపోయెను. మైలారదేవునిగుడికో, భద్రకాళికాలయమునకో యాయన వచ్చుచుఁ బోవుచుండుట నాతఁడు పెక్కుసార్లు తిలకించెను. దూరమునుండియే యాయనకు నమస్కారములు గావించెను. ఆయనను సమీపించి మాటలాడుటకు ధైర్యము చాలలేదు. ఆయన యూపిరితిత్తులు కొలిమితిత్తులై, నాసికారంధ్రములు కొలిమిగొట్టములై, యాయన కన్నులనెడు కొలుములు సెగలనుఁ బొగలను, స్ఫులింగములను జిమ్ముచున్నట్లుండును. ఆయన వీథివెంట బోవుచుండ నెల్లవారును నొదిగి యొదిగి యోరగాఁ దొలఁగిపోవుచుందురు. ఆయన యాకృతియందలి యనిర్వచనీయమైన శక్తి యేదో తన్నాయనవైపునకుఁ లాగుచున్నది. ఆయన కన్నులలోని యగ్నిజ్వాలలు తన్నదలించి వెనుకకుఁ ద్రోయుచున్నవి. శ్రీనాథుఁ డాయన యెదుట నటునిటు నూగులాడిపోవును. సింగనమంత్రిగారు షట్కాను శివపూజాధురంధరుఁడు. అరుణోదయమునఁ, దపనోదయమున, సంగవమున, మధ్యాహ్నమున, సాయంకాలమున, నర్ధరాత్రమున నాఱువేళల నాయన లింగార్చనము గావించును. ఆయన యిటీవల బాహ్యపీఠార్చనమువదలి కరపీఠార్చనము నాచరించుచుండెను. చండికా యతీని మునఁ బూజారియాయనకుఁ భైరవీమంత్రోపదేశము గావించి యోగిచక్రము నొసఁగియుండెను. ఆ భద్రకాళికాలయమునం దాచక్రము

ప్రతిష్ఠించి ప్రతిదినమును ఆయన జపములు, హోమములు, బలిపూజా విధులు నిర్వర్తించుచుండెను.

సింగనమంత్రిగారి వాకిటఁజేరియున్న శివభక్తులఁదిలకించినంతే శ్రీనాథునకుఁ దన యిష్టలింగము గుఱుతువచ్చెను. నడుము దడవి కొనుచు నాతఁడు సందుమఱుగున కేఁగి గళమున లింగముగట్టికొనివచ్చి భక్తులలోఁ జొరఁబడెను. సింగనమంత్రి తపనోదయలింగార్చనము ముగించుకొని వడసాలలోనికివచ్చెను. వాకిటఁగూడియున్న యనుచరులం బిలిచి విభూతియుఁ దీర్థము నొసంగెను. ఎల్లరు నేగినపిదప శ్రీనాథుఁడు సింగనమంత్రినిజేరి యాయనపాదములకడ సాష్టాంగపడెను. సింగన మంత్రి యాతని నాశీర్వదించి కూర్చుండనియమించి "నాయనా! నీవీ కొండవీటికి దారితప్పివచ్చినట్లున్నావు. కొండవీటలింగము ధరించుట యనగాఁ గంఠమున కురివోసికొనుటె యని యెఱుఁగవు కాఁబోలు" అనెను.

శ్రీనాథుఁడు .— ఇప్పుడు తెలిసివచ్చుచున్నది. నేను కవిని. శివభక్తి నాకు జీవము. కవిత్వము నాకు జీవితము. కొండవీటఁ గవిగా బ్రతుకవలయునని వచ్చితిని.

సింగన :— కొండవీటఁ బ్రభువు వైష్ణవుఁడు. ఆయనకుఁ బ్రభుత్వమునను గవిత్వమునను మంత్రాంగమునెఱపువారు వైష్ణవులు. కుమారగిరిరెడ్డియుఁ గాటయవేమారెడ్డియు, ననంతయ్యయు నున్నంతకాలము నీకీకొండవీటఁ బిడికెడుబిచ్చముగూడఁ బుట్టనీయరు.

శ్రీనాథ :— తమరు పరమమాహేశ్వరులు. త్రికాలజ్ఞులు. నాకిచ్చట నంతయు గందరగోళముగ నున్నది. తమరు నా కేదేనిఁ దరణోపాయముఁజూపి ధైర్యముచెప్పవలెను.

సింగన :— నీకుజ్జ్వలమగు భవిష్యత్తు కలదు. నీయంతరంగము శైవక్షేత్రము. నీ కవిత్వము శైవతీర్థము. ఆక్షేత్రమును దర్శించి యాతీర్థమున నోలలాడి తెలుగుజాతి తరించఁగలదు. నీ వశ్రైర్యపడ వలదు. నీకవిత్వము కొండవీటి నేలుకొనుకాలమొకనాటికిఁ రాఁగలదు

శ్రీనాథ :— చిత్తము. ఇప్పటి కింతియేనా ?

సింగన :— నేనొక యుపాయముచెప్పెదను విందువా ?

శ్రీనాథ :— చిత్తము.

సింగన :— నీవేమైనఁ గావ్యములు వ్రాసితివా ?

శ్రీనాథ :— చిత్తము. చిన్ననాఁడే మరుత్తరాట్చరిత్రము వ్రాసితిని. ఇప్పుడు శాలివాహన సప్తశతినిఁ దెనిగించుచున్నాను.

సింగన .— మంచిది. సప్తశతి యనినఁ గోవటీవేమారెడ్డిగ ప్రాణము.

శ్రీనాథ :— ఆయన యెవరు ?

సింగన :— ఆయన కొండపల్లికైన ప్రభువు. కొండవీటికిఁ గాఁబోవుప్రభువు. నిన్నాయనవద్దకుఁ బంపెదను. పోయెదవా ?

శ్రీనాథ :— తమ సెలవైనచో.

సింగన .— మంచిది. మాకు సంగవలింగార్చనా వేళ యైనదిఁ నీవిఁకఁ బోయిరమ్ము.

శ్రీనాథునకుఁ గొండయెక్కినంత యుత్సాహముగ నుండెను. కొండపల్లియుఁ గోమటివేమారెడ్డియు నాతనికన్నులలో నిండిపోవు చుండెను. ఇల్లు సమీపించినకొలఁదియు నతనికొడలు తెలియుచుండెను.

కంఠమందలి లింగమును గటిసూత్రమునకు దింపుటా మానుటా యను గుంజాటనలోఁబడి యేమయినఁగానిమ్మని యతఁడక్కడే యింటికిఁబోయెను. తిప్పయ్యగారాతని వాలకముచూచి "ఏమిరా! మఱలఁ బైకెక్కించి తివి. కొండవీటఁ దిన్నగానుండఁ దలఁపలేదా యేమి?" యనెను. "పోనీ మామా! కొండవీటుగాకున్నఁ గొండపల్లి యగునులెమ్ము. కవి గానికొక యూరని సిద్ధాంతమేమిటి" అనుచున్న శ్రీనాథుని మాటలు తోటలోఁ బచారుచేయుచున్న యన్నయమంత్రిగారి చెవులఁబడెను.

౧౨

సీమసీమలనుండి వచ్చిచేరుచున్న సేనాదళము లూరిబైలుపల గొల్లెనలెత్తివిడియుచుండెను. గ్రామగ్రామములనుండియు రాచగాదె లో నిలువయుంచిన కప్పురభోగములు, ప్రాసంగులు మున్నగు ధాన్య లు దేవధర్మకార్యములకుఁబోగా మిగిలినవి రెండెడ్ల బండ్లపైఁ ట్లపైఁ బుట్లుగా వచ్చి గరిసెలలో నిండిపోవుచుండెను. పనసపొట్టు గారెలతో, మెంతికూరపప్పులతోఁ బచ్చిమామిడిపచ్చళ్ళతో నుభయ ళల భోజనములు, మధ్యాహ్నములఁ బనసతొనలతోఁ బలకమారిన మామిడిబద్దలతో ఫలహారములును, మిరియపుఁబొడియు నేలకులుఁ ర్చిన చెఱకుపానకములతోఁ బానీయములును దండులకుఁ, బడివాయ లకు దండిగా నమరుచుండెను. కొండవీట వైశాఖమునందే గ్రీష్మ మారంభించినట్లుండెను. ఎండలప్పుడే ముదురుచుండెను. మండుటెండ లో నీడదండుకూర్చుట యెందులకో యెవ్వరికిని దెలియుటలేదు.

కాలరులు విన్నవించు దండు లెక్కలతో, వేగరులు నివేదించు ర్తలతో నల్లాడరెడ్డి యుక్కిరిబిక్కిరి యగుచుండెను. ఆయన యసలే

స్థూలకాయుఁడు. దానికిఁదోడు వేసంగియెండలు. ఎండకాలమున నాయన తాపము సహనయించుటకు గోదావరియే చాలదు. పన్నీటఁ దడిపిన వట్టివేళ్ళ తడికెలు గడియగడియకుఁ దడియారి యాయన కించు కంతయుఁ దాపశాంతి గలిగింపఁజాలకుండెను. కాటయవేమారెడ్డి కార్య భారము తనపైఁబెట్టి తానహోబిలమున కేగెను. వైశాఖపూర్ణిమనాఁ డహోబిలమున నృసింహస్వామి యుత్సవము జరుగును. ఏఁటేట నా యుత్సవసమయమున స్వామిని దర్శించి వచ్చుట కాటయవేమారెడ్డి కాచారము. శాకుంతలవ్యాఖ్యానపుఁబ్రతి యెట్టకేలకుఁ బూర్తియైనది. వామనభట్టు దానికొఱకై యింతకాలము కొండవీట నిలిచిపోయెను. ఇప్పుడు వేమారెడ్డియు నాతఁడును గలిసియే బయలుదేరిరి.

మల్లాంబిక భర్తనుజూచి నెలదినములైనది. మొదటమొదఁ దానే భోజనసమయములందుసైతమాయన కగపడకుండఁ దప్పించు కొనెను. తరువాత కార్యవ్యగ్రుఁడై యాయనయే వేళకుపాళకు భో నము రాలేదు. మగనిచిత్తము నేకపత్నిగా నేలుకొనుచుంటి న గర్వము మల్లాంబికకు గాఢముగఁ గలదు. తానెన్నిపర్యాయముల మూతిముడిచినను భర్తయే తన్నుఁ బ్రసన్నురాలి నొనర్చుచుండెన అది యామెకు మఱింత యలుసయ్యెను. తాను రాజసహోదరిననియ దన్నుఁ బెండ్లాడుటచేతనే యాయనకు మంత్రిపదవి లభించెననియు దుర మానరేఖ మల్లాంబికమనసు మూరుమూల నెచ్చటనో లేకపోలేద కాటయవేమారెడ్డి కది తెలియకపోలేదు. మల్లాంబికయందలి చులుక దనమునకీ యాభిజాత్యాభిమానమే కారణము. అచులుకఁదన కాటయవేమారెడ్డి కిష్టము. మల్లాంబిక వట్టి ముద్దరాలైనచో నెట్ల డునోయని యప్పుడప్పుడాయన యాలోచించుకొని నవ్వుకొనుచుండును మల్లాంబిక యభిమాన మభిమానమే. మగనిపై వలపు వలపే. మగని

యంధమునకామె మురిసిపోవును. ఏవో బింకపెట్టి యాయన యొడలిని బులుముకొనును. ఆయన యేదేనియు నాలోచనలోఁ బరాకుగనుండి నచో నాయనను గవ్వించి నవ్వించును. కాటయవేమారెడ్డి నలుపు మీరిన చామనచాయవాఁడు. కలువ తేకులఁబోని కాటుకకన్నులు, కొదమతుమ్మెద తెక్కలవంటి నిగనిగని మీసములు, కుదురైన నెన్నుదురు, ముత్యములవంటి పలువరుస ఆయన నవ్వినచోఁ బురుషులుగూడ సమ్మోహితులగుదురు. అట్టివాఁడు తనకువశుఁడై నప్పుడు మల్లాంబిక గర్వపడుటలో నాశ్చర్యమేమున్నది.

లకుమయు సంగత్తెయే. పుట్టువుచే వేశ్య. ఆపై నట్టువరాలు. నాటకమని పేరుపెట్టి యామె తనభర్తను వలలో వైచుకొనుచున్నది. తప్పు తనదే. తఱచుగాఁ దనమగనితో నామె యేకాంతగోష్ఠులు జరుపుచుండఁ దానేల యూరకుండవలయును. తాను మగనిచిత్తమును లోఁగొంటి నను గర్వమే తనకింతచేసినది. మల్లాంబిక మాళవికాగ్ని మిత్రనాటకప్రదర్శనము నాటినుండియుఁగోపముతో, ననుమానముతో, దిగులుతో, దుఃఖముతోఁ గ్రుంగిపోవుచుండెను. ఎంతరాజకార్యముల యొత్తిడియున్నను దన్నొక్కమారైనను జూడరాకుండనేల? తన యలుక లాయనకుఁ గ్రొత్తలుగావుగదా! ఆయన నిజముగఁ దనయధీనమునుండి తప్పిపోవుచున్నాఁడు. ఈతలఁపు వచ్చినప్పుడు మల్లాంబిక లోలోనఁ గుమిలిపోవుచుండును.

మల్లాంబిక యలంకారములు పూర్తిగామానివైచినది. పరిచారికల బలవంతము నేదో వేళకింత యెంగిలిపడుచున్నది. రాజభవనమున కేగుటయు మానివైచినది. వేమాంబ నాలుగైదుపర్యాయములు కబురుపంపినది. ఇదిగోవత్తు నదిగోవత్తు నని తప్పించుకొనుచున్నది.

అన్నయమంత్రిగారు దుర్గకు సంగీతమునేర్పుమని యడుగగా నైదాఱునెలలనుండియుఁ దానామెకుఁ బాఠముచెప్పుచున్నది. పది దినములనుండి తానదియుఁ దిన్నగా జరుగనిచ్చుట లేదు. ఒకనాఁడు దుర్గ కాటయవేమారెడ్డితో "మాయక్క యెందుచేతనో మిగులఁ జిక్కిపోవుచున్న" దనెనఁట. ఆయననవ్వి "అహోబిలమునుండి స్వామిప్రసాదము దేఁబోవుచున్నాను. అది స్వీకరించినచో నన్నియుఁ జక్కఁబడు" ననెనఁట. ఈయూహతో మల్లాంబిక మేనఁ గంపముపుట్టెను. ఆమె యొక పరిచారికను బిలిచి "ప్రభు వంతఃపురమున నుండిరేమో చూడవే" యనెను. "ప్రభువు మొన్ననే యహోబిలమున కేఁగిరిగదా. మిమ్ముఁ గూడ రమ్మని యడిగిరిగదా" యనెను. మల్లాంబిక యాశ్చర్యముతో "ప్రభువిచ్చటికివచ్చిరా?" యనెను.

దాసి :— వచ్చినారు తల్లీ!

మల్లా :— నన్నుఁగూడ రమ్మనినారా?

దాసి :— రమ్మనినారమ్మా!

మల్లాంబిక కిది యంతయు నగమ్యాగోచరముగ నుండెను. ఆయనవచ్చుటేమి? తన్నడుగుటయేమి? ఆమె కేమియుఁదోచలేదు.

మల్లా :— నిజమేనఁటే

దాసి :— నిజమే తల్లీ!

మల్లా :— అప్పుడు నేనేమంటినే?

దాసి :— (మాట్లాడదు)

మల్లా :— చెప్పవే. ఏమంటిని?

దాసి :— ఆమెనే తీసికొనిపొండు. నేనెందులకు? అంటిరమ్మా!

మల్లాంబిక కెవ్వునఁగేకవైచి శయ్యపై విఱుచుకొనిపడిపోయెను. పరిచారికలందఱుఁ బరువెత్తికొనివచ్చి మొగమునఁ బన్నీరు చల్లి, వట్టివేళ్ళ విసనకఱ్ఱతో విసరి పరిపరివిధముల నుపచారములు గావించిరి. ఒకగడియసేపటికి మల్లాంబికయించుక తేఱుకొనెను. మగఁడువచ్చుటయుఁ దానారీతిఁబలుకుటయు మల్లాంబకుఁ దెలియును. కాని యదియంతయుఁ గలలోని ఘటనగా నామెకుఁ దోచుచుండెను. పరిచారికయన్న దానిని బట్టిచూడ నది కలగాదు. వాస్తవమే. "అయ్యో! ప్రభు వేమనుకొనెనో! మల్లాంబిక యొక దీర్ఘనిశ్వాసముఁ బుచ్చి మెల్లగా లేచి కూర్చుండి "ఏమే! ప్రభువునకుఁ గోపము వచ్చినదా?" యనెను. "లేదు తల్లీ! ఆయన చిఱునవ్వు నవ్వుకొనుచు వెడలిపోయెను. కాని చిన్నబుచ్చుకొనిరేమో యనుకొందును" అనెను. మల్లాంబికకు మది మదిలో లేదు. ఆక్షణమున నెగిరిపోయి మగనియొడిలో వ్రాలవలెనని యామె హృదయ మారాటపడెను. కాని యాయన యేడీ?

కాటయవేమారెడ్డి యహోబిలనరసింహ దేవునకు సహస్రనామ పూజ చేయించెను. కుమరగిరి ప్రభువునకును, కుమారాన్నపోతారెడ్డికిని శుభపరంపరాభివృద్ధి గావుటకై స్వామికి వెలలేని కానుకలు చదివించెను. శిరమున విష్ణుపాదములు స్వీకరించి, శ్రీగంధము నురమున నలందుకొని, పాదతీర్థము, ప్రసాదముఁ బుచ్చుకొని యాయనఁ గర్భాలయము వెడలివచ్చి మండపమునందలి గంట ముమ్మారు మ్రోగించి మెల్లగా మండపముమెట్లు దిగుచుండెను. బంగరుజరీయంచుల పీతాంబరముధరించి, యురమున శ్రీచందనములంది, గళమునఁ దులసీమాలయుఁబచ్చలపతకమునుదాల్చి, పుండరీకములఁ బురుడించు విశాలనేత్రములఁ బ్రసాదమాధుర్యము దొలుకాడ సోపానపరంపర నవతరించు నా శ్యామసుందరమూర్తి యొక రాజకుమారిహృదయమునేకాదు చూచు

చుండిన యెల్లరహృదయములను జూరఁగొనెను. కాటయవేమారెడ్డి మెట్లుదిగి యల్లంత దవ్వుననున్న శిలాఫలకముపై నాసీనుఁడయ్యెను. చేరువ నేయున్న వేఱొకశిలాఫలకమున నొకవృద్ధుఁడాసీనుఁడై యుండెను. తనవంక నాశ్చర్యచకితుఁడై నట్లు తేటిపాఱఁజూచు నావృద్ధునితో "ఆర్యా! తమరే ప్రాంతమువారో యెఱుఁగవచ్చునా?" యనెను.

వృద్ధుఁడు :— మాది విద్యానగరము. తమది?

కాటయ :— మాది కొండవీడు.

వృద్ధు :— అయినచో మావామనభట్టు నెఱిఁగియే యుందురు. వసంతోత్సవములకని పోయి వాఁ డచ్చటనే కూర్చుండినాఁడు.

కాటయ :— తమరు డిండిమకవిసార్వభౌము లనుకొందును.

వృద్ధు :— ఆయనను మీ రెట్లెఱుఁగుదురు?

కాటయ :— జగద్విఖ్యాతులగు అరుణగిరినాథ డిండిమకవిసార్వభౌముల నెఱుఁగని వారుందురా? విశేషించి తమనామము వామనభట్టు నాలుకపై నిరంతరముఁ దాండవమాడుచుండును.

వృద్ధు :— ఇచ్చట మారాజకుమారి వానికొఱకై కలవరించుచున్నది. ఇంతకును దమ రెవరో చెప్పితిరికాదు.

కాటయవేమారెడ్డి కించుక కపటనాటకమాడవలె ననిపించినది.

కాటయ :— కుమరగిరి మహీపతి బంధుకోటిలోని వాఁడను. వామనభట్టును నేను బాగుగా నెఱుఁగుదును.

డిండిమ :— కాటయవేమారెడ్డి శాకుంతలమునకు వ్యాఖ్యానము రచించినాఁడట. వామనభట్టా వ్యాఖ్యానపుఁ బ్రతియొకటి తెచ్చిపెట్టు నని మా హీరాంబిక యెదురెదురులు చూచుచున్నది.

కాటయ .-- వామనభట్టు విద్యానగరమునఁ దమకొఱ కెదురు చూచుచుండును.

డిండిమ :— మంచిది. హీరాంబిక వచ్చుచున్నది. నేను సెలవు తీసికొందును.

కాటయవేమారెడ్డి మెట్లదిక్కు దిలకించెను. ఆయచ్చరకన్నెయే కావలయును హీరాంబిక. సంధ్యాతపతపనీయరేఖా చిత్రితాంచలమగు శరన్మేఘమువలె నున్నది. అసదుఁగొనసియాడ నల్లనల్లన మెట్లుదిగి వచ్చు నామె పిల్లగాలికిఁగదలియాడు వెన్నెలతీవను దలపించుచుండెను. కాటయవేమారెడ్డి యామె మెయిదీవయొదుగులను గనుదమ్మి రేకులలోఁ బొదువుకొనుచుండెను. మెత్తనియామె యడుగులు మెట్లరాలపై నొత్తుకొనిపోవునేమో! కాటయవేమారెడ్డి చూపులు కలువపూరేకుఁ బొత్తికలై యామె యడుగులకు మడుగు లొత్తుచుండెను. హీరాంబిక కడుగుసాగుటలేదు. గంగాదేవి "హీరా" యనుచు నామె మొగము వంకఁ జూచెను. ఆమొగము కాటయవేమారెడ్డి వంకకుఁ జూచుచుండెను. పెదతల్లిపిలుపున హీరాంబికకుఁ దెలివివచ్చెను. చరచర మెట్లు దిగి యామె తలవంచుకొని డిండిముని వెంట నడచిపోయెను. ఆ నడకల యొయ్యారములు లకుమాదేవి నాట్యములను బుడికిపుచ్చుకొనుచున్నట్లుండెను.

పచ్చపూల యడవులలో మేలిరకపుఁ గాఱుదున్నలు దొరకును. ఏటేట నీయడవులలో నొకదున్ననుబట్టికొనిపోయి శరదుత్సవములలో దేవికి బలియిచ్చుట కాటయవేమారెడ్డి కలవాటు. ఆయన తన పరివారముతో నడవులవెంట బయలుదేరెను. అడవిదున్నలు తిరుగు ప్రాంతము లాయనకుఁ బరిచితములే. వచ్చునప్పుడే వారికిఁ గొన్ని యుగ

పడెను. కాని యందేదియు నాయనకు నచ్చలేదు. తిరుఁగు ప్రయాణమున నడవి లోతట్టులఁగూడ వెదుకసాగిరి. రెండవనాఁటి మధ్యాహ్నమొకపొదలోనుండి వందత్రాఁచులు బుసకొట్టినట్లు వినిపించెను. వేమారెడ్డి పరివారమును నిశ్శబ్దముగ నిలువ నియమించి యల్లంతదవ్వులఁ గ్రిక్కిరిసియున్న చెట్లవరుసకుఁ జివర నినుపగొలుసులతో నురులు పన్నించి పిమ్మట నొక్కుమ్మడి నెల్లరును బొదచుట్టిముట్టి యడవిదున్నను చెట్లవరుస నడిమికి దరుముసళ్లేర్పఱచెను. ఆదున్న ముట్టెనుండి తోకవఱకు రెండుధనుస్సులపొడవుండెను. దానికొమ్ములుభయపార్శ్వముల నొరసికొనుచుఁ బృష్ఠములం బొడిచికొనుచుండెను. అనుకొన్న తీరుగనే యది యురిలోఁ దగుల్కొనెను. ఐననేమి? ఏనుగంతబలము గల దానియూపున కా యినుపసంకెళ్ళు పుటుక్కునఁ దెగిపోయెను. మెడకుఁ దగుల్కొనిన యురిగొలుసుతో నది యాకాలడవిలో మటుమాయమయ్యెను. ఆనాఁటికింక దానినిబట్టుకొనుట బ్రహ్మతరముగాదు. పంచమినాఁ డరుణోదయముననే యల్లాడరెడ్డి వెడలిపోవలసియున్నది. గొలుసు మెడకుఁ దగిలించితిమి గదా. ఇది యింకెక్కడికిఁ బోవునని కాటయవేమారెడ్డి యటనుండి పరివారముతోఁ గదలిపోయెను.

## ౧౩

ఎండలు ముదురుచుండెను. మామిడిపండ్లును, జెఱకుగడలును బండ్లకొలఁదిగాఁ గొండవీట దిగుచుండెను. వీటివెలుపల విడిసిన దండునకుఁ బనియు పాటయుఁ గనఁబడలేదు. ఉదయమున నొక నాలుగు గడియలు సాయంకాల మొక నాలుగు గడియలు విన్యాసములు సలుపుట, పూర్వాహ్ణమునఁ బుష్కలముగఁ బిండివంటలతో విందులుగుడుచుట, మధ్యాహ్నముల వెలుపల నెండలుమండుకొనిపోవుచుండ గొల్లెనలలో నొడళ్ళనిండఁ జిక్కనిచందనము లలందుకొని పట్టియుఁ బట్టని

కనుకులుతీయుట, యపరాహ్ణమునఁ గుడిచేత మూరెడుపొడవు చెఱకు మామిడిరసములుచీకుచు, బారెడుపొడవుచెఱకుగడల నములుచుఁ గాలక్షేపముచేయుట. రాత్రులందు వెన్నెలలలోఁ జెడుగుడులుఁ జెల్లాటలు. కొండవీటి కాదండంతయుఁ బెండ్లికివచ్చినట్లుండెనేకాని దండయాత్రకు వచ్చినట్లు లేదు.

అవచితిప్పయసెట్టి విక్రమసింహపురమునుండియు, మోటుపల్లి నుండియుఁ బంపుచుండిన యాయుధసామగ్రి నానాఁటికి గొండవీటికిఁ జేరుచుండెను. జ్యేష్ఠమాసాంతమున ముట్టడులు జరుపవలెనని యల్లాడ రెడ్డియుఁ గాటయవేమారెడ్డియు నిశ్చయించుకొనిరి. కందుకూరు సేన లద్దంకికి, రాజమహేంద్రవర సేనలు నిరవద్యప్రోలునకును, వినుకొండ సేనలు బెల్లంకొండకును జ్యేష్ఠపూర్ణిమనాటికిఁ జేరవలయును. బహుళపంచమి నాఁడు బయలుదేరి యద్దంకివారు ధనదవోలుకోటను, నిరవద్యప్రోలు వారు కొండపల్లిని ముట్టడింపవలయును. దశమినాఁడు బయలుదేరి బెల్లంకొండవారు ధాన్యకటకమును ముట్టడింపవలయును. విశ్వసనీయు లగు వేగరులచే నీవివరముల నాయాదుర్గములకుఁబంపి కాటయవేమా రెడ్డి కార్యము సాధింపఁబడినట్లే నిశ్చింతముగ నుండెను.

మాళవికాగ్నిమిత్ర నాటకప్రదర్శనము జరిగిననాఁడు తానా నాటకమునకు వ్యాఖ్యానము రచించి కుమరగిరి ప్రభువున కంకిత మొనరింతు నని యుండెఁగదా. ఆవిషయ మప్పటినుండియు నాయన మనస్సులో మెదలుచునే యుండెను. మాళవిక యాకృతి యాయన యెంత భావించినను రూపుకట్టలేదు. నాటకపాత్రలన్నియుఁ గన్నులముందు రూపొందించుకొనిగాని యాయన వ్యాఖ్యాన మారంభింపఁదలఁపలేదు. గణదాసుని భావించినప్పు డాయనకు మహాదేవపండితుఁడు గుఱుతు వచ్చుచుండెను. విదూషకుఁ డచ్చముగ వామనభట్టే. లకుమాదేవి మాళవిక యంద

ముగనే యభినయించెను. కాని మాళవిక యట్లుండునా? మాళవిక కంత ధీరమైన యాకృతియుండియుండదు. మల్లాంబిక యైనచో నంత కంటె బాగుగనుండును. లకుమకంటె మల్లిక నేతగానుండును. మల్లాంబికయందము కొట్టవచ్చినట్లుండును. అది పురుషుని దననశముగావించు కొనఁజూచునేకాని కేవలపరవశత్వము గలిగింపదు. కాటయవేమారెడ్డికి వైశాఖపూర్ణిమనాఁడు మాళవికమూర్తి తళుక్కున మెఱసెను. ఆమె పాలవెల్లి తరగలపైఁ దేలియాడు నురుగువలె నుండును. పులుగడిగిన ముత్తియమువలె, లావణ్యము ముద్దవలె నుండును. ఆమె తరపివెన్నెల వలెఁ జల్లగా తెల్లగానుండును. మీఁగడతరకవలె మెత్తగాఁ దియ్యగా నుండును. ఆమె హీరాంబికవలె నుండును.

కాటయవేమారెడ్డి వ్యాఖ్యాన మారంభించెను. పసిఁడిగంటము చేతఁబట్టి రాయనిబాచయ్యగారాయన మొగమువంకఁ దిలకించుచుండెను. వేమారెడ్డి యొకక్షణ మిష్టదేవతా ధ్యానముగావించుకొని నాట్యసారసర్వస్వముగాఁ దాను రచింపఁబూనిన వ్యాఖ్యానమున కారంభమున నాట్యవేదజన్మహేతువగు నటరాజును స్తుతించెను. పసిఁడి గంటపుగిలుకలు గలగలలాడుచుండ రాయనబాచయ్యగారు ముత్తెపు సరులుపోహళించి నట్లక్షరపంక్తులు దీర్చికొనిపోవుచుండెను.

> "వేదాదీనాం విశుద్ధానాం విద్యానాం జన్మహేతవే
> పార్వతీ పరతంత్రాయ పరస్మైవస్తునేనమః"

ప్రార్థనాశ్లోకము విష్ణుపరముగా నుండునని రాయనబాచయ్య గారనుకొనిరి. ఇది శివపరముగా నున్నది. వేమారెడ్డి నాందీశ్లోకమునకు వ్యాఖ్యానముచెప్పెను. "సన్మార్గాలోకనాయేత్యనేనాత్ర కశ్చిన్మార్గాశ్రయః ప్రతిపాద్యత ఇతిసూచ్యతే" యనునప్పటికి బాచయ్యగారి సందేహము తీఱిపోయెను. నాందీశ్లోక వ్యాఖ్యానముతో నాపూటకు

వ్రాతకట్టిపెట్టిరి. బాచయ్యగారు పటికరాలమెట్లుదిగుచుండగా లకుమా దేవి చతుశ్శాలలోనికి వచ్చెను. "నీపుణ్యమాయని నాకు మఱల జేతినిండ పనితగిలినది" అని యాయన లకుమాదేవిని బలుకరించెను. లకుమాదేవి "ఏమి విశేష" మను నట్లు కన్నులతోఁ బ్రశ్నించెను. "వ్యాఖ్యాన మారంభించితిమి." అని బాచయ్యగా రనఁగా "లోక మున కొకమేలు జరుగుచున్న" దని నవ్వుచు లకుమాదేవి చంద్రశాల మెట్లెక్కెను.

కాటయవేమారెడ్డి మనస్సింకను నాటకమునందే మునిఁగి యుండెను. ఆయనమనస్సున హీరాంబికయు మల్లాంబికయు నొకరిపై నొకరుగా ముసరికొనివచ్చుచుండిరి. ఆయన యాలోచనలో మునిఁగి యటునిటుఁ బచారు చేయుచుండెను. పరకీయముగ్ధాస్వీయమధ్యలనడుమ నాయన పూలడోలికలఁ దేలుచుండెను. లకుమాదేవి యందెరవళి యాయనకు మెలకువ గలిగించెను.

కాటయ :— ఏమి మునిఁగిపోయినదని యింత యెండలోఁబడి వచ్చితివి?

లకుమ :— అన్నయమంత్రిగారు కబురుచేయఁగా నాయనగారి యింటికిఁబోయి యిటువచ్చితిని.

కాటయ :— విశేషమేమో?

లకుమ :— తీరికయైనప్పు డొకసారివచ్చిపొమ్మని యాయన కబురుచేసిరి. నేఁడు గుఱుతువచ్చి బయలుదేరితిని. ఆయన తీరికగాఁ గూర్చుండి తిప్పయ్యగారికూఁతునకుఁ బాఠము చెప్పుచున్నారు. ఆపిల్ల యనిన నాయనకెంతప్రాణమో! నే నిదివఱకెన్నఁడు నాపిల్లను జూడ లేదు. అంత యందకత్తె కాదుగాని ఆయున్న యందమంతయు నామె చెక్కులయందే యున్నది.

కాటయ :— ఇక్కడకు వచ్చిన దా చెక్కులను వర్ణించుట కేనా ?

లకుమ :— తిప్పయ్యగారి మేనల్లుఁడఁట. పేరు శ్రీనాథుఁడఁట. పిల్లకుఁదగిన యందగాఁడే. మేము మాటాడుకొనుచుండఁగాఁ గ్రొత్త పంచెలుగట్టుకొని పెండ్లికొడుకువలె నాతఁడు వీథిలోనికి బయలుదేరి నాఁడు. అన్నయమంత్రిగా రాతనిని జూపుచుఁ దిప్పయ్యగారియల్లునిఁ జూచితివా ?" యనిరి. నే నాపిల్ల చెక్కులనే చూచుచుంటిని. అన్నయమంత్రిగా రన్నమాట కామె చెక్కులపైఁ జూచుచుండఁగనే మందారములు విచ్చిపోయెను. "వీని మెడలోని లింగము వదలినప్పుడు గదా దానిమెడలో మంగళసూత్రము పడుట" యని తిప్పయ్యగా రనుచుండఁగనే ఆమందారము లరవిందములై యా యరవిందము లిందీ వరములై పోయెను. భావములనంత యచ్చుగ్రుద్దినట్లు ప్రకటించుచెక్కుల నేనెక్కడను జూడలేదు. "ఈమె నాట్యము నేర్చిన నెంతబాగుండు నని" నేననుకొనుచుండ నన్నయమంత్రిగా రామాటయే యనిరి. నేనామెకు నాట్యము నేర్పవలెనఁట.

కాటయ :— ఇచ్చట నేర్చుచున్న గానము చాలలేదుగావలయును.

లకుమ :— దేవిగారి కారోగ్యము తిన్నగాలేదని తెలిసినది. రెండుమూఁడుపర్యాయములు వచ్చితినిగాని దర్శనము కాలేదు.

కాటయ :— అనఁగా నది శారీరకవ్యాధి కాదన్న మాట. ఆమెకుఁ గోపమువచ్చినచో నెవ్వరికిని దర్శనమీయదు.

లకుమ :— ఆమెకు నాపైఁ గోపముకలిగియుండును ?

కాటయ :— అందఱిమీఁదికోపముల నామె నామీఁదనే చూపు చుండును గనుక నీవు చింతింపనక్కరలేదు.

లకుమ :— మీరు నవ్వుచున్నారు. నాకు బాధగానున్నది.

కాటయ :— నవ్వినచోఁ గొందఱు బాధపడుదురు. బాధించినచోఁ గొందఱు నవ్వుదురు. అది వారివారి స్వభావము.

లకుమ :— ఆమె మిగుల నీరసించుచున్నదని వింటిని.

కాటయ :— మానవశేషమున నీరసించుటలోఁగూడ రసమున్నది గదా?

లకుమ :— మీరు జీవితసమస్యను కళావిషయములోనికి దింపుచున్నారు.

కాటయ :— కళ యనఁగా నాకసమునుండి యూడిపడినదా? జీవితమేకళ. నీజీవితమంతయు నాట్యము. ఆమె జీవితమంతయు సంగీతము. ప్రభువుజీవితమంతయు శిల్పము. వట్టిసుఖములోనుండి కళ యుద్భవింపదు. హృదయాంతరాళమునం దేదో యొక యావేదన యుండవలెను. ఆవేదననుండియే యుత్తమకళ యావిర్భవించును. శ్రీకృష్ణదేవునికై నీయావేదనయేకదా నీనాట్యమంతయు. మరణించిన రాణికొఱకైన ప్రభువు నావేదనయేకదా యాయనశిల్పమంతయు. మల్లికగానమును నీవీనడుమ వినలేదు. రాత్రులం దామె యప్పుడప్పుడు గానముచేయుచుండును. ఆమె యాగానమును నాకొఱకే చేయుచున్నది నేనెఱుంగుదును. ఆవేదనానుభవముచేఁ బండిన హృదయమునుండి రసమోడికలు గట్టినట్లుండు నామెగానము వినుచు నేను పరవశుఁడ నగుచుందును. పూర్వమామె కంఠమున నభిమానముండెడిది. ఇప్పు డావేదన యున్నది. పూర్వమామెగానము విని పులకితుఁడనగుచుంటిని. ఇప్పుడు మూర్ఛితుఁడ నగుచున్నాను. ఆవేదనచే హృదయము మెత్తఁబడును. మెత్తనిహృదయమునుండియే యుత్తమమైన కళ యావిర్భవించును. అట్టికళయే మానవులను స్వర్గమున కెత్తును.

కాటయవేమారెడ్డి యిట్లేమేమో చెప్పుకొనిపోవుచుండెను. లకుమాదేవి యనిమిషలోచనయై యట్లే యాలకించుచుండెను.

ఎన్నిపర్యాయములు కబురంపినను మల్లాంబిక రాకుండుటచే నాటిసాయంకాలమున వేమాంబిక తానే యామెను జూడవచ్చెను. పరిచారిక లామెను శయనమందిరములోనికిఁ దీసికొనిపోయిరి. మందిర మంతయుఁ జిన్నఁబోయినట్లున్నది. ఆమె లోపల నడుగిడుచు "మఱఁదలు గారు బొత్తుగాఁ గంటిలో నలుసయిపోయిరే" యని నవ్వుచు ననెను. నిజముగనే యామెనలుసువలె శయ్యకంటుకొనియుండుటఁగాంచియామె నివ్వెఱపోయెను. కుమారవీరభద్రుఁ డామె చంకలోనుండి శయ్యపై నుఱికి మల్లాంబికశరీరము నల్లుకొనెను. "ఏమమ్మా! యిట్లయితివి?" అని మల్లాంబిక యొడలుదడవుచు వేమాంబ "మీరయినఁ జెప్పరైతి రేమే?" యని పరిచారికలను గసరుకొనెను. "అమ్మగారు చెప్పవల దనినా" రని వారు బెదురుచు బదులు పలికిరి. వీరభద్రుని కిలకిలలు దిలకించి మల్లాంబికమొగ మల్లంత విప్పారెను.

వేమాంబ :— ఏమమ్మా యిట్లయితివి?

మల్లాంబిక :— ఏమియులేదమ్మా.

వేమా :— ఏమియు లేకయే యింతచిక్కిపోయితివా?

మల్లాంబిక మెల్లగానవ్వెను. ఆనవ్వు గులాబీపూవుపై మంచు పెరవలె నంతలోఁ గరగిపోయెను.

వేమా :— క్షణముతీరికలేక యాయనయు, నేమియుఁ దోచక నీవును నీవిధముగఁ జిక్కి సగమైనచోఁ జూచువారికెట్లుండును? ఈ సంగతి విన్నచోఁ బ్రభువునకుఁ బ్రాణములు నిలుచునా? ఈపనుల యొత్తిడి తీఱునంతవఱకు నీయన్నగారి యంతఃపురమున నుండుము నమ్మా.

మల్లాంబిక వలదనెను. వేమాంబిక బతిమాలెను. బలవంతము చేసెను. వేమారెడ్డిగారికిఁ దెలియపఱచుటకును, బల్లకి సిద్ధపఱచుటకును వేమాంబ పరిచారికలం బనిచెను. మల్లాంబిక నెట్లో యొప్పించి ప్రభుమందిరమునకుఁగొనిపోయెను. అన్నగారి యుపదేశముచేనన్నియుఁ జక్కఁబడునని కాటయవేమారెడ్డి కడకన్నులలో కులికికొనెను.

చెల్లెలినిగాంచి ప్రభువు తెల్లబోయెను. ఈమె యెందుల కిట్లాయినది. వ్యాధివల్లనయినచోఁ దనకుఁ దెలియఁజేయకుండునా? ఆధి యనుకొనుట కామెకు లోపమేదియును లేదే. మాణిక్యమువంటి మగఁడు. పొరుపెఱుఁగని కాపురము. తనకు జీవితమున నానందము గలిగించునదామె సంసారమొక్కటియే. అందమునకు, ననురాగమునకు, నైశ్వర్యమునకుఁ గొఱఁతలేక చిలుకయు గోరవంకయువలె నానందముగఁ గాపురము చేయు మఱఁదిని చెల్లెలినిగాంచి తాను జీవితమందలి దుఃఖములుమఱచిపోవుచుండును. మల్లాంబిక స్వాధీనపతికయని తానెఱుఁగును. మల్లాంబిక మనస్సునందలి దిగులేమైయుండును? ఆమెజీవితమునం దొకటే లోపము. ఆతేండ్లనుండియుఁ గాపురముచేయుచున్నను నింతవఱకామె గర్భము ఫలించలేదు. తనకే యీదిగులుండఁగా నామె కుండదా? ప్రభువు మనస్సు నీయూహ గట్టిగాఁ బట్టుకొనెను. ఇతరోహలకిఁక నటఁ దావు లేదు. ఈయూహ వచ్చి యాయన చిఱునవ్వు దొలుకాడఁ జెల్లెలి చిబుకముఁ బుడికి శిరము నిమిరి యంతిపురిలోని కనిపెను. వేమాంబనుఁ జేరఁబిలిచి తనయూహ నామెకుఁ దెలిపెను. వేమాంబ యాయన యమాయికపుటూహకుఁ దనలో నవ్వుకొనెను. ఆల్మగలనడుమ నేదో పొఱపు పుట్టనిదే యనురాగవతియగు నతివ యాతీరునఁ గృశించుట పొసఁగదని యామె మఱదలి మొగముఁ జూచినప్పుడే యనుకొనెను. ప్రభువు అమృతహృదయుఁడు. తన దుఃఖమును దిగమ్రింగి యాయన

యితరుల సుఖమున కానందించును. ఆయునయూహా యాయన యాశ యమునకుఁ బ్రతిబింబము. ఆయన యాశయమే యాశీర్వచనమై మల్లాంబిక గర్భముఫలించవలెనని వేమాంబిక వేయిదేవతలకు మ్రొక్కు కొనెను.

౧౪

వామనభట్టు వైశాఖబహుళపంచమినాఁడు విద్యానగరమును జేరుకొనెను. తిన్నగా గంగాదేవి యంతఃపురమునకేఁగెను. ఆమె హీరాంబికను వెంటనిడికొని యహోబిలమున కరిగెనని యెఱింగి యాతఁ డయ్యో యనుకొనెను. ఎంతచక్కని యవకాశముఁ బోఁగొట్టు కొంటిని. అహోబిలమువఱకును గలిసిపోవుదము రమ్మని కాటయ వేమారెడ్డి తన్నెంతో బలవంతపఱచెను. విద్యానగరమున కదిమిగులఁ జుట్టుదారి యగునని తాను దిన్నగా నందికనుమ మార్గమున వచ్చి వేసెను. వ్యాఖ్యానమునుజూచునఱకును హీరాంబిక యారాటపడు చుండునని తానిటు పరువెత్తిరాఁగా నామె తానావ్యాఖ్యాతనే చూచు టకై యటు పరువెత్తెను. ఆ యుత్సవకోలాహలములో నెవరెవ్వరో! ఆయనకామెయు నామె కాయనయు నగపడవచ్చిరా? ఏమో! నృసింహదేవుఁడు కొండపీటిని జల్లగాఁజూచినచో సర్వమును సుసంప న్నము గాఁగలదు. తానే యచ్చటనుండినచో నిరువురకు నాఁగుడి లోనే ముడిపెట్టియుందుననుకొనుచు వామనభట్టు డిండిమకవిసార్వ భౌముల యింటిమొగము పట్టెను. ఆయనయు నహోబిలమున కేఁగెనని విని వామనభట్టున కేమిచేయుటకును దోఁచలేదు. అతనికి గాండ్ల నాగమణి గుఱుతువచ్చెను. తానెన్నఁడును దానియింటికిఁ బోలేదు. దానియందేమైన దొరకునేమో చూతమనిపించి యాతఁడు దాని యింటికిఁ బోయెను. వామనున కాపూటయంతయు దండుగ త్రిప్పట

యయ్యెను. నాగమణి యీనడుమనే పుట్టినింటికేఁగెనని దాసి యాతే
నికి వీథి/సమ్ముఖముకడనే వార్త చెప్పెను.

వామ :— అనఁగాఁ గొండపీటికా ?

దాసి :— కాదు కొండపల్లికి.

"కొండపల్లి దీనికెక్కడిపుట్టిని" ల్లని గొణిగికొనుచు వామన భట్టు దాసినిజూచి "యత్తవారింటికిఁ దిరిగివచ్చునా ?" యనెను. ఆమాటకది కిసుక్కున నవ్వుకొని "ఆహా! మహారాణిలాగునఁ దిరిగి వచ్చును." అనెను. "ఆశ చాలవఱకుఁ బ్రాకినదే" యను కొనుచు వామనభట్టు విద్యారణ్యులవారి యాశ్రమమునకు బయలుదేరెను. "ఈదాసిపిల్ల మొగము కళగలదే. దీని మాటలధోరణిచూడ నాగ మణిపట్ల నేదో యసంతృప్తి యున్నట్లు కనఁబడుచున్నది. దీనిసంగతి యేమో చూడవలసినదే" అనుకొనుచు నాతఁడాశ్రమము ప్రవేశిం చెను. ఆశ్రమమంతయు నిశ్శబ్దముగ నుండెను. విద్యారణ్యులకు నెల దినములనుండియు నస్వస్థముగానుండెను. శతవసంతోత్సవము నాఁటి నుండియే యాయన నలతగానుండెను. ఇటీవలబొత్తిగా మంచము పట్టెను. వామనభట్టాయనకు సేవచేయుచు నాశ్రమమునందేయుండెను.

పాడ్యమినాఁడే బయలుదేరవలయునని గంగాదేవి యనుకొనెను. మరిరెండుదినములుండి పోదమని హీరాంబిక యనెను. ఆరెండు దిన ములు నామె కోవెలలోనే యెక్కువకాలము గడపెను. పందపర్యాయ ములు మండపము మెట్లెక్కిదిగెను. మెట్లు దిగునప్పుడును నెక్కునప్పు డును నెవరికొఱకో వెదకికొనుచున్నట్లుండును. చేసిన స్వామిదర్శనము నే మరలమరలఁ జేయుచుండును. ఈరెండుదినములలో గంగాదేవి మధురా విజయమునఁ గొన్నిశ్లోకములు వ్రాసి డిండిములకు వినిపించెను. శ్లోక ములు లోకోత్తరములుగనున్నవని యాయన ప్రశంసించెను. స్వామి

సన్నిధానమహిమ గావలయునని యామె సంతసించెను. "వ్యాఖ్యానపుఁబ్రతి విద్యానగరము చేరినదఁట. మనమిక్కడ నింకెన్నాళ్ళు కూర్చుండుము" అని డిండిములామెతోఁ బ్రసంగవశమున హెచ్చరించెను. "అమ్మాయి యీపచ్చమలపై మరులుగొన్నట్లున్నది. రేపు రేపనుచున్నది." అని గంగాదేవి పలికెను. "వ్యాఖ్యానముమాట తెలిసిన నామెయే పరుగెత్తివచ్చు" నని డిండిములనిరి.

డిండిములన్నమాట నిజమే. మఱునాఁడే హీరాంబిక ప్రయాణమునకుఁ దొందరచేసెను. త్రయోదశినాఁడు వారు విద్యానగరము చేరిరి. చేరినదే తడవుగ వామనభట్టునకుఁ గబురుచేసిరి. ఆతఁడు వచ్చి వ్యాఖ్యానపుఁబ్రతిని చేతికిచ్చువఱకును హీరాంబిక యారాటము గంగాదేవికిఁ బట్టరాని నవ్వులు పుట్టించెను. వామనుఁడు, డిండిములు, గంగాదేవియుఁ జతుశ్శాలలోఁ గూర్చుండి సంభాషించుకొనుచుండఁ బ్రతిని చేతఁబట్టుకొని హీరాంబ ప్రక్కగదిలోనికిఁబోయెను.

గంగాదేవి :— ఏమి వామనయ్యగారూ! ఇట్టెవత్తునని చెప్పి యింతకాలము నిలిచిపోతిరి? అమ్మాయి చదు వేమికావలెననుకొంటిరి?

వామన :— అందులకేకదా తల్లీ! ఇంత యాలస్యమయినది? ముత్తెములవంటి యక్కరములుగాని రాకుమారి కంటి కెక్కవుగదా. అట్టివ్రాలు చేతనయినవాఁ డొక్క రాయని బాచయ్యగారే. కాటయవేమా రెడ్డిగారి కాయన ప్రియలేఖకుఁడు. ఆయన లెక్కలగొడవలలో మునిఁగి తేలుచు రాజకుమారి యందభిమానముచే రాత్రులంతయు మేల్కని యీప్రతి వ్రాసియిచ్చినారు. దానికింతకాలము పట్టినది.

డిండిమ :— నీవు విద్యానగరము వచ్చినట్లు మాకవహోబిలమునసే తెలిసినది. కుమరగిరి రెడ్డిగారి బంధువఁట. ఆయన చెప్పినాఁడు.

వామన :— ఆయన యెట్లుండునో గుఱుతు చెప్పఁగలరా?

డిండిమ :— ఎట్లుండు నేమి! అచ్చముగ రాజకుమారునివలె నుండును.

వామన :— అయినచో నాయనయే కాటయవేమభూపతి.

హీరాంబిక గ్రంథమును దిరుగవేయుచుండెను. ఆమెకన్నులు గ్రంథముమీఁదను చెవులు వారి సంభాషణమీఁదను నుండెను. ప్రథమాంకముచివఱ "ఇది శ్రీకాటయవేమభూపతి..." యని కన్నులకగపడుటయు, వామనభట్టునోట నామాటయే చెవులఁబడుటయు నొక్కసారిగా జరిగి హీరాంబిక మనస్సహోబిలమున మండపము మెట్లపై వ్రాలెను.

గంగాదేవి :— ఆయనయేనా? వామనయ్యగారూ! ఆయనను నేనుగూడఁ జూచితిని. హీరయు నేనును స్వామిదర్శనమున కేఁగుచుంటిమి. మండపముమెట్లపై ధీరము నుదాత్తమునగు నొకమూర్తి నిలిచి యుండెను. ఆకస్మికముగఁ జూచి యాయన నృసింహదేవుఁడే యనుకొంటిని.

హీరాంబిక మనస్సులో లీలగాఁ దారాడుచుండిన యొకభావ మీమాటలలో మూర్తిమంతమయ్యెను. ఆమె యాగ్రంథమునుగన్నుల నద్దుకొనుచుఁ, జెక్కులనొత్తుకొనుచుఁ బరవశమగుచుండెను.

వామన :— వ్యాఖ్యానము చేతికివచ్చినదిగదా. రాజకుమారికింక నాతోఁ బనిలేదనుకొందును.

. గంగా :— మీరిచ్చట నున్నంతవఱకు నమ్మాయి మిమ్ము విడిచిపెట్టదు. మీరీనాటకమును బూర్తిచేయువఱకును నిచ్చటినుండి వెళ్ళుటకును వీలుండదు,

డిండిమ :— అమ్మా! సెలవిచ్చినఁబోయివత్తుము. ఒడలంతయు బడలికగానున్నది. తీఱికగా మరల దర్శనము చేసికొందుము. వామనయ్యా! నీవుగూడ బయలుదేరుచుంటివా?

వామన :— మఱచితిని. విద్యారణ్యులవారు మిక్కిలి యస్వస్థులై యున్నారు. మీరుగూడ నాదారిన వచ్చినచో వారినిజూచి పోవచ్చును.

గంగాదేవి బంగరుపళ్లెరమునఁ బండ్లు, వక్కలాకులు దెప్పించి హీరాంబికనుబిలిచి వారిరువురకు నిప్పించెను.

విద్యారణ్యులు మంత్రిత్వము విసర్జించిన నాఁటినుండియు హరిహరరాయలవారి రసికత హద్దుమీఱినది. అంతకుమును పంతిపురము మాత్రమే విస్తరిల్లుచుండెడిది. ఆతరువాత వేశ్యవాటముగూడ విస్తరిల్ల సాగినది. ఆ వాటమునఁ గ్రొంగ్రొత్తగా వెలసిన సౌధము నాగమణిది. ఆమె కొండపల్లినుండివచ్చి నాల్గయిదు నాళ్ళయినది. ప్రతిదినమునామె ప్రభుమందిరమునకుఁ బోయివచ్చుచున్నది. ప్రతిరాత్రియు రాయలవారామె సౌధమునకు వచ్చిపోవుచున్నాఁడు.

కొండవీట జరుగుచున్న సైన్యసమీకరణము కొండపల్లికిఁదెలియ వచ్చినది. కోమటి వేమారెడ్డికి గుండెలు గుబగుబలాడెను. ఇంతలో నింతముంచుకొనివచ్చునని యాయన యనుకొనలేదు. పిల్లిపై నెలుకను, నెలుకపైఁ బిల్లినెక్కించి యెట్లో కొండవీటిని గాఁజేయవలెనని యాయన చాలకాలముగ నాలోచించుచుండెను. రాజ్యభ్రష్టుఁడైన యన్నదేవచోడనితో నాలోచన లారంభించినాఁడు. కృష్ణదక్షిణము దనకు దక్కించినచో నుత్తరరాజ్యమంతయు వారికిఁ గట్టఁబెట్టుదునని రాచకొండవారికి దేవరకొండవారికి నాశలుపెట్టినాఁడు. రాయబార

ములు నలుగుచుండెను. ముడివడునని యాసలు పుట్టుచుండెను. పశ్చిమమునుండి విద్యానగరమువారి నుసికొలుపుటకు సర్వప్రయత్నములు చేయుచుండెను. హరిహరరాయలవారిని ముగ్గులోనికి దింపుటకే నాగమణి నాయనమీఁదఁ బ్రయోగించెను. వీరశైవులను రెచ్చఁగొట్టి కొండవీటఁ గల్లోలము రేపుటకై మంత్రిసింగనగారితో సీనదుమ మంతనములు నెఱపెను. ఈపన్నాగమంతయు రాఁబోవు శరత్తునాటికిఁ గార్యరూపమున ఫలించునని యాయన యెదురు చూచుచుండెను. మండువేసవిలో నెవరు దండు వెడలుదురు? ఎందులకైన మంచిదని కోమటివేమారెడ్డి ధనదవోలున సైన్యములు ప్రోగుచేయుమని మాచారెడ్డికిఁ గబురుచేసెను. తా నమరావతికిఁబోయి మామగారితో మంచి చెడ్డలు మాటాడివచ్చెను. రాచకొండవారికి రాయబారము పంపెను. ఇంతకును గొండవీటి దండయాత్ర యెవ్వరిమీఁదికో యాయన కంతు చిక్కలేదు. కప్పము చెల్లింపని తమమీఁదికా? భృగుబండసీమ నాక్రమించుకొనిన రేచర్లవారిమీఁదికా? కృష్ణానది వేసంగిలో సేనలు దాటుటకు వీలుగానుండునుగనుక రాచకొండమీఁదికే కొండవీడు దండెత్తుచున్నదని తనకు నిశ్చితముగఁ దెలియవచ్చిన ట్లాయన సింగమనాయకునకుఁ గబురు పంపెను. అసలు రహస్యమేమో సింగనమంత్రిగారు తెలియఁజేయుదురని యాయన యాశపెట్టుకొనియుండెను. కొండవీటినుండి వీరశైవుఁడనువాఁడు కొండపల్లికిఁ జేరఁజాలఁడని సింగనమంత్రి కనిపట్టెను. వట్టిచేతులతో రెండుమూఁడుపర్యాయములు వీరభటుల నంపి చూచెను. గూఢచారులు వారినందఱను గట్టి పడవైచినారు. శ్రీనాథుఁ డింకను గొండవీటఁ బరదేశియే. అందునుఁ గవిత్వము చెప్పికొనువాఁడు. గూఢచారు లీతనినైనచో ననుమానింపరు. సింగనమంత్రి శ్రీనాథునిఁ గొండపల్లికిఁ బంపించెను. సింగనమంత్రి మాటల కుబ్బి, కోమటివేమారెడ్డి తనకేదో త్రవ్వి తలకెత్తునని యువ్విళులూరుచు

శ్రీనాథుఁ డింటిలో నెవ్వరికిని జెప్పకుండఁ గొండపల్లికిఁ బ్రయాణము కట్టెను. శ్రీనాథుఁ డిట్టువైపునఁ గొండపల్లిలో నడుగుపెట్టెనో లేదో అల్లాడరెడ్డి సేనలు సుడిగాలివలెఁ జుట్టుకొని వచ్చిపడుచున్నవని కోట యంతట గగ్గోలు పుట్టెను. కోమటివేమారెడ్డికిఁ దత్తరము పుట్టెను. ఆయన కోట యంతయుఁ గలవరముగాఁ దిరుగుచుండెను. చేతి కందిన యాహారపదార్థములను దీసికొని ప్రజలనుఁ గోటలోనికిఁ జేర్పింపుఁడని సేనానులఁ దొందరపెట్టెను. శ్రీనాథుఁ డాయనవెంటఁబడి సింగన మంత్రిగా రంపినవార్త నెఱిఁగించెను. సింగనమంత్రి పేరు విని యాయన చిరాకుపడెను. శత్రుసైన్యములు చుట్టుముట్టుచున్నవని బురుజులపైఁ గేకలు రేగుచుండెను. కోమటివేమారెడ్డి కోటతలుపులు మూయించి సమకూడిన స్వల్పసైన్యముతో నాత్మరక్షణమున కాయత్తపడెను.

అద్దంకిసైన్యములానాఁడే ధనదవోలు ముట్టడించెను. మాచారెడ్డి యేమిచేయఁగలఁడు? అన్నగారినినమ్ముకొని తానీపన్నాగములోఁ జిక్కుకొనెను. తానెంతయత్నించినను నల్పవ్యవధిలో నైదువేలకంటె సేన సమకూర్చలేకపోయెను. అద్దంకిసేన పదునైదువేలు. కోటబిగించుకొని కూర్చుండినను దానునెగ్గలేఁడు. తనది వట్టిమట్టికోట. పాలిక యేండ్లుగా బాగుచేతగూడలేనిది. మాచారెడ్డి సంధియే యుత్తమపక్షముగఁ దీర్మానించుకొనెను. కోటబురుజుపై గొమ్ములవానిచేఁ ధర్మ దార యూఁదించెను. కోటతలుపులు దెరిపించెను. కోటారెడ్డియుఁ జినకోమటిరెడ్డియుఁ గోటవశపఱచుకొని మాచారెడ్డి నాయనమందిర మునసే యమపులోనుంచి కాటయవేమారెడ్డి యుత్తరువుల కెదురు చూచుచుండిరి.

కొండపల్లిముట్టడి యమరావతిలో గుప్పుమనెను. గన్నారెడ్డి యమరావతిసేనలను గొండపల్లికిఁ బంపుటా లేదా యని యాలోచించెను.

పరిస్థితినిబట్టిచూడ నల్లాడరెడ్డిసేనలు కొండపల్లిమీఁదికిని, బెల్లంకొండసేనలమరావతిమీఁదికిని నుద్దేశింపఁబడినట్లాయనకుఁ దోచెను. ఒకవైపున బెల్లంకొండసేనలు నింకొకవైపున రాజమహేంద్రవరసేనలు ముట్టినచో నమరావతి నిలువఁజాలదు. తానుబోయి కొండపల్లికిఁ దోడ్పడినచోఁ బైనుండి యల్లునిసేనలు క్రిందనుండితనసేనలు నల్లాడరెడ్డిసేనల నడగత్తెరలో నొక్కవచ్చును. ముందుకొండపల్లి నిలిచినచో నమరావతిమాట యావలఁజూచుకొనవచ్చును. గన్నారెడ్డి తనసైన్యమును గొండపల్లికిఁ దరలించెను. మఱునాఁడు తెల్లవాఱునప్పటికి బెల్లంకొండసేన లమరావతికి వచ్చెను. దుర్గరక్షకుఁడగు నప్పన్నరెడ్డి యరి యేటిలింగనమంత్రికి. గోటనొప్పఁజెప్పెను. బెల్లంకొండసేనలతో లింగనమంత్రి పెదవెంకప్పరెడ్డిని కొండపల్లిమీఁదికి దఱిమి పంపించెను. కొండపల్లి యమరావతి సేనలనడుమ నల్లాడరెడ్డి యుక్కిరిబిక్కిరి యగుచుండెను. భీమదేవచోడనితో నాలోచించి యల్లాడరెడ్డి యొక యెత్తువేసెను. కోటముట్టడి చాలించి తమసేనలను కృష్ణమొగముపట్టించెను. వెనుకతట్టుగాఁ దాఁకిన గన్నారెడ్డిసేనను తమయుభయసైన్యములతో నెదురుకొని కృష్ణయొడ్డువఱకుఁ దఱుముకొనివచ్చెను. కృష్ణలోదిగుటయనఁగా బెల్లంకొండసేనలో దిగుట యన్నమాట. గన్నారెడ్డి తనపన్నాగములోఁ దానే చిక్కుకొనిపోయెను. ఆయనకాకలుతీరిన వీరుఁడు. అభిమానధనుఁడు. ఆయన కరవాలచాలనములకు శత్రుసైనికుల శిరములు జొన్నకంకులవలెఁ దునిసిపడుచుండెను. రెండుజాముల మండుటెండలో రెండుసేనల యందును సైనికుల యొడళ్ళఁ జెమ్మటలు నెత్తురులు నేకధారగాఁ గురియుచుండెను. అల్లాడరెడ్డి యాయనతోఁ దారసిల్లెను. ముప్పదియేండ్లయువకుఁ డల్లాడరెడ్డి. అఱువదియేండ్లవృద్ధు గన్నారెడ్డి. గడియసేపుకంటె నల్లాడరెడ్డియెదుట నిలుచుట గన్నారెడ్డికి గగనమయ్యెను. ఉభయసేనలనడుమఁ జిక్కుకొని యాయనదండు సగము తెగి సగము

విరిగిపోయెను. మిడిమిడియెండలో నల్లాడరెడ్డి కత్తికత్తళముల మెఱపులకా యనకన్నులు మిఱుమిట్లుగొనుచుండెను. చక్రాకారమున నాయనను జుట్టినప్పుడు నల్లాడరెడ్డి హయమును త్రిప్పులఁ బెట్టుచుండెను. గన్నారెడ్డి గుఱ్ఱమునకు నాలుగుకాళ్ళపై నిలుచు తావైనఁ జిక్కుట లేదు. అది భయంకరముగ సకిలించి రెండుకాళ్ళపై నిలువెత్తున లేచి నిలువఁబడెను. రెప్పపాటులో నల్లాడరెడ్డి యా రెండుకాళ్ళనుఁ దుండెములుగా నఱికెను. గుఱ్ఱముతోపాటు గన్నారెడ్డి నేలపైఁ గుప్పవలె గూలిపోయెను.

అల్లాడరెడ్డి సేన లమరావతిపైఁ బడుచున్నవని తలఁచి కోమటి వేమారెడ్డి కోటలోనిసేనల నమరావతికిఁ బట్టించెను. రాచకొండసేన లేక్షణమునకైన రావచ్చుననియే యాతఁ డాసపడుచుండెను. కోటలో నుండియే పోరుసాగించినచోఁ గొంతకాలమైన నిలువఁద్రొక్కికొని యుండునేమో! కోటవిడిచి వచ్చి కోమటివేమారెడ్డి గొప్ప ముప్పును గొని తెచ్చికొన్నట్లయినది. కొండపల్లినుండి రెండుగవ్యూతుల దవ్వు జరుగకమున్నే విజయవిజృంభితులైన వైరిసేనలు తన దండుతోఁ దాకసిల్లెను. సముద్రమువంటి శత్రుసేనముందు తమసేన చిన్నచెఱువు వలెనుండెను. కోమటివేమారెడ్డి దండునకు గుండెలు నిలువలేదు. విఱిగి వెన్నుఁజూపిన కొండపల్లిసేనలను విఱుగఁద్రొక్కుకొనుచు నల్లాడరెడ్డి తనసేనలతోఁ గోటలోఁ బ్రవేశించెను.

౧౫

జ్యేష్ఠపూర్ణిమ నాఁ డేరువాకపండువు. ఆదివ్యవృషభ యజ్ఞమను పేరఁ గొండవీటి రాజ్యమునందెల్లెడల నుత్సవము జరుపఁబడును. కొండవీటి రెడ్డి ప్రభువులు చతుర్థకులజులు. వృషభమే యా కులమువారికిఁ

ప్రాణాధారము. కృషియొక్క యావశ్యకతను గుర్తించి రెడ్డిప్రభువులు తమరాజ్యమునందీ యుత్సవమును మిగుల నుత్సాహముతో జరిపించుచుండిరి. రైతులెల్లరు నుదయముననే దమ యెద్దులను జక్కఁగాఁ గడిగి, కొమ్ములకు, గిట్టలకు రంగులు పూసి, మెడలలో మువ్వలు, గంటలు కట్టి, మొగముల నద్దాలకుచ్చుల నలంకరించి, నడుముల నద్దాల పట్టెడలు పెట్టి నందీశ్వరులవలె నలంకరించిరి. చావడులలో గాళ్లలకును, నాగళ్లకును ధూపదీపములిచ్చి నైవేద్యముపెట్టినపొంగళ్ళు వృషభములకుఁ దినఁబెట్టిరి. సాయంకాలము మంగళవాద్యములతోఁ బశువుల నన్నింటిని బ్రధాన వీథుల నూరేగించి యూరిబయటకుఁ దోలుకొని పోయిరి. కోటవాకిటఁగట్టిన పుంటిత్రాటి తోరణమును రైతులు చేతికోలలతోఁ బీచుపీచుగాఁ గొట్టి యెవరికి దొరికినపీచు వా రెత్తుకొని పోయిరి. అట్టులుసాచి, తోకలెత్తి పశువులమంద యూరిలోనికిఁ బరువెత్తి వచ్చుచుండఁ జిటపటమను చినుకులును జిటుకుచిటుకుమను వడగండ్లును బశువులవెన్నులఁ గురిసి తొలకరి యారంభమయ్యెను.

పశువులు కోటలోఁ బ్రవేశించిన మఱు గడియలో నైదువందల యశ్వదళముతోఁ గాటయ వేమారెడ్డి యద్దంకి దిక్కునఁ దరలిపోయెను. పిండియారఁబోసినట్టు పండువెన్నెల గాయుచుండెను. ఆ చల్లని వెన్నెలలోఁ దెల్లవాఱులు బ్రయాణముచేసి సూర్యోదయమునకుఁ గాటయ వేమారెడ్డి యద్దంకిఁ జేరుకొనెను. ఆదినమంతయు నచ్చటి సన్నాహములు పరిశీలించి, సేనల కుత్సాహముపుట్టించి తిరిగి యా రాత్రి యటనుండి బయలుదేరి ధనదవోలు పొలిమేరలఁ ద్రొక్కికొనుచుఁ దదియనాఁటి యుదయము బెల్లంకొండ చేరెను. పగలంతయు నచ్చటి దండును బరీక్షించి మఱునాఁడుకూడ నశ్వదళమునకు విశ్రాంతి యిచ్చి పంచమినాఁడు బెజవాడ చేరుకొని యల్లాడరెడ్డిగడనుండి వార్తల కెదురుచూచు

చుండెను. అత్యవసరమైనఁగాని యశ్వదళము నుపయోగింపరాదని యాయన నిశ్చయించుకొనెను. ఈ యెండలలో గజదళము ననలేకద లింపఁ దలఁపలేదు. ఏక్షణమున కాక్షణము తనకు వార్తలందించుటకై యాయన యన్నిదిక్కులను నాశ్వికులయిన వేగరులను నియమించెను.

ఆషాఢశుద్ధ పంచమినాఁడు కాటయవేమారెడ్డి మైదువందల యశ్వదళము చెక్కుచెదరకుండఁ బెండ్లికిఁ బోయివచ్చినట్లు కొండవీటికిఁ దిరిగివచ్చెను. కుమరగిరిప్రభువాయనకుఁ గోటవాకిట స్వాగత మిచ్చి కౌఁగిలించుకొనెను. దశమినాఁడు విజయోత్సవమునకు సన్నాహములు జరుగుచుండెను.

ఈ యిరువది దినములలోఁ గొండవీట వీరశైవులు ఱొమ్ములు విరుచుకొని వీథులలోఁ దిరుగుచుండిరి. గుంపులుగాఁ జేరి గుజగుజలు పోవుచుండిరి. కోటలోని మూలబలము కదలిపోయినవెంటనే కోటను వశపఱచుకొనవలయునని కుట్రలు పన్నుచుండిరి. సింగనమంత్రిగారి యిల్లే కొండవీటికిఁ గేంద్రమైనట్లుండెను. దుర్గాధ్యక్షుఁడు జతనముపెద్ది రాజు, దండనాథుఁడు ప్రెగడయ్య, మంత్రి యన్నయ్యయుఁ గలిసి యాలోచన చేసిరి. విట్టవీగుచు వీథులలో విచ్చలవిడిగాఁ దిరుగుచున్న వీరభటుల నెల్లరను నడువీథులలో నరికి ప్రోవులుపెట్టించవలెనన్నంతగా వారికిఁ గోపము మండుకొనిపోవుచుండెను. ప్రభువిందుల కంగీకరింపఁడు. వారొక నిశ్చయమునకు వచ్చిరి. కోటవెలుపలి దండులనుగూడఁ గోట లోనికి రప్పించి వంతులవెంట వీథులలోఁ బగలు ముప్పదిగడియలు రేయి ముప్పదిగడియలు విన్యాసములు దీర్పించిరి. కదలిన వీరభటులకుఁ గాళ్లు తెగిపోవును. మెదలిన వీరభటులకు మెడలు తెగిపోవును. సింగన మంత్రిగారి మాట కట్టువడెను,

మల్లాంబిక యన్నగారి యంతఃపురముననే యుండెను. వేమాంబ యామె యంతరంగములోని రహస్యములను బయటికి లాగుటకై గాలములు వైచుచుండెను. మల్లాంబిక యెక్కువ కాలము కుమారాన్న పోతారెడ్డితోఁ గడపుచుండెను. మేనత్త మొగఁదలోని దిగులు నాపసివాఁడు కూడ పసికట్టెను. ఆమె నవ్వినఁగాని పాలు ద్రావనని యాతఁడు పట్టుపట్టెను. ఆమె నవ్వెను. అతఁడు పాలు ద్రావును. మీయిరువురిలో మల్లాంబిక యల్లుఁ డెవ్వరని వేమాంని వీరభద్రునిఁ, కుమారాన్నపోతనిఁ గవ్వించును. వారు నేను నేనబ వాదులాడుదురు. మల్లాంబిక ముసిముసినవ్వులు పోవుచు వీరభద్రుని నోడిలోనికిఁ దీసికొనును. యువరాజు మూతి ముడుచుకొనును. ఆమె యాతనిని బతిమాలి బుజ్జగించును. దినము లీతీరునఁ దిరిగిపోవుచుండెను.

ఒకదినమున నరసింహాపండితుఁ డంతఃపురమునకు వచ్చెను. ఆయనను జూడఁగనే మల్లాంబిక కొక యాలోచన పోయినది. ఆయాలోచనలో నామె మొగమున దిగులుముసుగు గ్రమ్మినది. నరసింహాపండితుఁ డామెను జూచి యాశ్చర్యపడి "ఏమితల్లీ! యిట్లు దిగులుపడి యుంటివి" అనెను. మల్లాంబిక మాటాడలేదు. ఆయన మరల నట్లే ప్రశ్నించెను. ఆమె తలవాల్చుకొని పాదాంగుళ్యగ్రమున నేల నిమురుచు —

మల్లాంబిక :— నరసింహయ్యగారూ! తమరు నాకుఁ దండ్రి వంటివారు. మిమ్మొకటి యడుగుదునా?

నరసింహ :— అడుగుముతల్లీ. అను మానమెందులకు? చిన్నతనమున నిన్ను నాచేతులలో నాడించితిని. మీయన్నగారి తరువాత నిరువదియేండ్ల మెడముగా నీవు లేకలేక యొక్క యాడుబిడ్డవు పుట్టితివి. నిన్ను జూచి మురిసికొను నదృష్టముకూడ మీతల్లిగారికి లేక

పోయినది. నీవు పృథివిపైఁ బడితివి. ఆమె స్వర్గము నలంకరించినది. ప్రభువులు నిన్ను గంటిని పాపవలెఁ గాపాడినారు. నేఁడేమో నీవు దిగులుపడుచున్నావు.

మల్లాంబిక చీరచెఱఁగునఁ గన్నులు తుడిచికొనుచు "నరసింహయ్యగారూ! మీరు నాజాతకమును బరిశీలించినారా?" అనెను.

నరసింహ :— నీ జాతకమున కేమితల్లీ! మహారాజ్ఞి జాతకము!

మల్లాంబిక :— భాగ్యభావము సరియే. కాని......

నరసింహ :— అనుమానింతువేల? అడుగుముతల్లీ!

మల్లా :— భర్తృభావము సంగతి యెట్లుండునో చెప్పుఁడు.

నరసింహ :— ఆదర్శప్రాయమైన యనురాగదాంపత్య మందఱకు నగపడుచునే యున్నదిగదా. ఇందొకరు చెప్పవలసిన దేమున్నది తల్లీ!

మల్లాంబిక :— కాలమొక్క విధముగా నడచునా నరసింహయ్యగారూ!

నరసింహ :— ఇంతకు నీ యనుమాన మేమనితల్లీ!

మల్లా :— లకుమాదేవి మాయన్నగారి యుంపుడుకత్తెయని యనుకొందురుగదా.

నరసింహ :— శివశివా! ఎవరమ్మా! ఆయన్నవారు?

మల్లా :— లోకము.

నరసింహ :— లోకమున కేమి తెలియును? పోని లోకమనినంత మాత్రమున నీవెట్లునమ్మితివి. ప్రభువునకు నీవొకటియు లకుమాదేవి యొకటియునా తల్లీ!

మల్లాంబిక తెల్లఁబోయి నరసింహపండితునివంకఁ జూచెను.

నరసింహా :— తల్లీ! నీవు మఱచితివా? మీతండ్రిగారికి పంప, పొన్ని, రన్ని యని ముగ్గు రుంపుడుకత్తె లుండిరిగదా. వారిలో పంప నాయన రెండవ దేవేరిగా మన్నించెడివాఁడు. ఆ పంపాదేవి కూఁతురే కదా యీ లకుమాదేవి! ఆమె ప్రభువున కేమగును? నీకేమగును? ప్రభువంత వావివరుస తెలియఁగని వాఁడనుకొంటివా?

మల్లా :— నరసింహయ్యగారూ! ప్రభువువిషయమున నేను పొరపడితిని. సవరించుకొందును. ప్రభువువిషయము నాకుఁ బ్రధానముకాదు. ప్రధాని విషయమే నన్ను బాధించుచున్నది.

నరసింహా :— ఆ విషయమున నీవనుమానించినను దప్పులేదు.

మల్లాం :— నాజాతకమునకు సపత్నీదోషము పట్టినదేమో మీరు చెప్పవలయును.

నరసింహా :— ఆ విషయమునకు జాతక మక్కఱలేదు. ఏది? ఎడమచేయి చూపింపుము.

మల్లాంబిక గుండెలు బిగఁబట్టుకొని నరసింహపండితునకుఁ దన యెడమ యఱచేయి చూపించెను. నరసింహపండితుఁ డాచేయి నిదానించి చూచి "తల్లీ నీయనుమానము కేవల మసత్యముకాదు" అనెను. మల్లాంబిక నిలువున నీరయ్యెను.

నరసింహా :— తల్లీ! ఒకక్షణము సావధానముగ వినుము. నీ చేతిలో సపత్నీరేఖ యున్నది. కాని యామె లకుమాదేవిమాత్రము కాదు. ఇంతవఱకు నిశ్చితముగఁ జెప్పఁగలను.

మల్లాంబిక కించుక ప్రాణములు తేఱుకొనెను. ఆమె "ఎట్లు చెప్పఁగలరు?" అనెను.

నరసింహా :— వేశ్యలు సపత్నీ భావములోఁ జేరరు. నీకు సపత్నీ భావము పట్టినను ఆసపత్ని లకుమాదేవిమాత్రము కాదు. ఎవరగుదురో నేను చెప్పఁజాలను. ఇఁక నీభర్తకు వేశ్యాసక్తి యున్నదో లేదో యాయన చేయిచూచి చెప్పవలయును. ఇంతకును మహారాణుల జాతంములు సాధారణముగా సపత్నీ భావ రహితములుగా నుండవు. తల్లీ! నీవు నీచిత్తమును సమాధానపఱచుకొని సుఖముగానుండుట యుక్తమో త్తమమైన మార్గము.

మల్లాంబిక హృదయభారము సగము తీసివైచినట్లయ్యెను. ఆమె కన్నులు చక్కఁగాఁదుడిచికొని నరసింహపండితుని యథోచితముగ సత్కరించి పంపెను. దినములు గడచుచున్నకొలందియు మల్లాంబిక చిత్తమునఁ దా నన్నగారియెడ నపచారముచేసితి నన్న చింత యుత్కటముగా జొచ్చెను. అన్నగారి కంటఁబడుట కామెకు భయముగలుగుచుండెను. తన యపచారము నాయనతోఁ బోయి చెప్పికొందమనిపికచెను. ఏమనిచెప్పికొనవలెను? ఆమె కేమియుఁ బాలుపోలేదు. ఆమెకు ధైర్యము చాలలేదు. నరసింహపండితుఁడు తనది మహారాజ్ఞి జాతకమని చెప్పెను. మహారాణుల జాతకములు సాధారణముగ సపత్నీ భావ రహితములుగ నుండవని చెప్పెను. తనకు సపత్ని యుండునుగాని యా సపత్ని లకుమాదేవిమాత్రము కాదని చెప్పెను. మహారాజ్ఞీత్వము కావలసినచో దానితోపాటు సపత్నీత్వమునకుఁ గూడ సిద్ధపడవలెను. జాతకమున వ్రాసియున్న దొకటి జరిగి, యొకటి జరుగకుండునా? సపత్నీ రేఖ తనచేతిలో స్పష్టముగ నగపడుచుండఁగా మగనిపైఁ గోపించి యేమి లాభము? మల్లాంబిక మనస్సు మెల్లమెల్లగా నీవిషయమున సమాధానపడుచుండెను. అయినను ననుమానాంకుర మల్లె మిగిలి యుండెను.

దశమినాఁడు విజయోత్సవము. ఇది యువరాజు తొలివిజయ మని కాటయవేమారెడ్డి కొండవీటఁ బ్రకటనచేయించెను. ప్రభువున కాప్రకటన పరమానందహేతు వయ్యెను. మాచారెడ్డిని వెంటఁబెట్టుకొని పినకోమటిరెడ్డియు, గన్నారెడ్డిని వెంటఁబెట్టుకొని యల్లాడరెడ్డియుఁ గొంచెము కొంచెము సేనలతో వచ్చిరి. మాచారెడ్డియు, గన్నారెడ్డియుఁ గుమారాన్నపోతారెడ్డియెదుట రాజభక్తిప్రమాణములు గావించిరి. పట్టపుటేనుఁగునెక్కి యువరాజు కొండవీటివీథుల నూరేగింపుపోయెను. ఆషాఢారంభమున నాకసమునఁ జిఱుమబ్బులు తోఁచి యువరాజునకుఁ బట్టుగొడుగులుపట్టెను. చిఱుతజల్లులు తెరలు తెరలుగావచ్చి యువరాజుపైఁ బూలవానలు గురిసెను. చేటంతమబ్బు కోటంతయై యుఱుములతో మెఱపులతో నూరేగింపును దఱిమిదఱిమి రాజభవనద్వారమునకుఁ దెచ్చి నిలిపెను. పట్టగజమునుండి యువరాజును దింపుచు రాయప్ప గడగడలాడిపోయెను. యువరాజునొడలు జ్వరతీవ్రమునఁ గాలిపోవుచున్నది. ప్రభువు వెంటనే భాస్కరపండితుని బిలిపించెను. ఆయనవచ్చి సంజీవనులవంటి యౌషధములునూరిపోసెను. జ్వరతీవ్రత తగ్గినట్లేతగ్గి మరల హెచ్చుచుండెను. రాజభవనమంతయు నీయలజడిలో మునిఁగియుండెను.

శ్రీనాథుఁ డింటిలోఁ జెప్పకుండ నెచ్చటికిఁబోయెనో యిరువది నాళ్ళయినది. తనకే తెలియని దిగులుతో దుర్గ నలిగిపోసాగెను. ఆమె లకుమాదేవికడ నాట్య మారంభించి యీ యిరువదిదినములనుండియుఁ గ్రమముదప్పకుండ నేర్చుకొనుచునే యున్నది. మల్లాంబిక యామెకు గీతగోవిందమున రెండుమూఁడుగీతములు పాడుట నేర్పినది. లకుమాదేవి యాగీతములువిని దుర్గకు వాని యభినయము నేర్పుచుండెను. అన్నయమంత్రిగారి కామె యాటపాటల కానంద ముప్పొంగిపోవు

చుండెను. ఆడుచున్నను బాడుచున్నను దుర్గయేదో యన్యమనస్కగా నున్నట్లు తోఁచును. అన్నయ్యగారికా యన్యమనస్కత యుద్దువచ్చుచుండెను. ఆమె పసిహృదయములో నప్పుడే యనురాగము, ఆ యనురాగమున కాఘాతము! శ్రీనాథుఁడు సింగనమంత్రియింటికిఁ బోయివచ్చుచుండెను గదా! ఆయన యీతని కేదేని ఆసచూపి కొండపల్లికిఁ బంపియుండునా! కోమటి వేమారెడ్డి కొండపల్లినుండి పలాయనము చేసెను గదా! శ్రీనాథుఁ డేమైయుండును? కొండపల్లిలోనుండినచోఁ దమ సేనలవశమున నేయుండును? అల్లాడరెడ్డి నడిగిన నంతయుఁ దేలవచ్చునని యన్నయమంత్రి యనుకొనెను.

నాలుగునాళ్లయినను యువరాజు పరిస్థితి బాగుపడలేదు. మీఁదుమిక్కిలి నాల్గవనాఁ డాతఁడు మఱింత యావేదన పొందసాగెను. ఎడతెగని దగ్గుచే నాతఁ డూపిరి తీసికొనుటకును జాలకున్నాఁడు. ఆ దగ్గుటలో నొకమా రాతఁడు చేరెడు రక్తము గ్రక్కినాఁడు. ప్రభువు హృదయము తల్లడిల్లి పోయెను. అశ్వినీ దేవతలవంటి యాస్థానవైద్యులు చికిత్స చేయుచుండినను రోగమంకెకు వచ్చుటలేదు. ఆకాశమునఁ జిన్న చిన్న మబ్బుతునకలు గున్న యేనుఁగులవలె గుంపులుగట్టుచుండెను. వేణువనము వెదురుపొదలపైనుండి చిఱుగాలి యీలలు వేసికొనుచుఁ జల్లగాలి వీతెంచుచుండెను. హజారమున వీరాస్వామికి మేఘమల్లారు రాగము నాలపింపవలెననిపించెను. పిల్లగాలితరగలపైఁ దేలియాడుచు మంద్ర స్వరసంచారము రాజమందిరమును మెల్లమెల్లఁగా నావరించుచుండెను. యువరాజా గానము దిక్కునకుఁ గన్నులు త్రిప్పి నెమ్మనెమ్మ నుచ్ఛ్వాస నిశ్శ్వాసములు బిగఁబట్టుకొనుచు వినుచుండెను. రాయప్ప ప్రభువు చెవిలో నేదియో చెప్పెను. ప్రభువు వీరాస్వామిని బిలిపించెను. అతఁడు వచ్చి "ప్రభూ! నాదస్వరము దూరమునుండియే వినఁదగినది. మేఘ

మల్హారు క్షయవ్యాధి కుపశమనకారియగుట సత్యమేకాని సజీవమైన గాత్రముగఁ బలికినంతమాత్రగా నా సొన్నాయిగొట్టమునఁ బలుకదు. సొన్నాయిపాటలోఁ బ్రకోపనశక్తి యున్నంతగా నుపశమనశక్తి యుండదు. ప్రభువుల కిరువది యేండ్లుగా మేలుకొలుపులు పాడిపాడినా సొన్నాయిగొట్టము మూర్ఛితులనుగూడ మేల్కొలుపుశక్తి గలవఁబడుచు న్నది. అమ్మాయిగారిచే మేఘమల్హారు పాడింపుఁడు. చాలవఱ కుపశాంతి కలుగవచ్చును" అని విన్నవించెను. ప్రభువు మల్లాంబిక వంకఁ జూచెను.

మల్లాంబిక మంద్రస్థాయిలో మధ్యషడ్జమున నారంభించి కంఠ మున శంఖములు పూరించెను. మంద్రమునుండి మెల్లగా ననుమంద్రము లోనికి జారెను. అనుమంద్రమున నామెకంఠమునఁ బుష్కలావర్తకము లంతఃపరి ఘూర్ణితములైనట్లు ధీరము గంభీరమునగు మేఘగర్జానాదము పలుకుచుండెను. అంతఃపురమున శయనమందిరాంతరాళమున వాయు వులు సాంద్రములగుచుండెను. మల్లాంబిక మంద్రమున నించుక సంచా రముచేసి మధ్యమస్థాయి ప్రవేశించి యంతలో జల్లునజారి మంద్రమున విహరించెను. వాయుపరమాణువు లొత్తికొని యొత్తికొని శయన మందిరమునఁ గాంతులు మందగించుచుండెను. మల్లాంబిక మరల మంద్రమునుండి మధ్యమము నందుకొని యచ్చట నించుక సంచా రముచేసి తారస్థాయి ప్రవేశించి యంతలో నంచెలంచెలుగ జారివచ్చి మంద్రమున విహరించెను. వాయు పరమాణువు లొరసికొని యొరసి కొని యొండొరులఁ బెనవైచికొని శయనమందిరమున నంధతమసముల లముకొనుచుండెను. మల్లాంబిక మధ్యమముమీఁదుగాఁ దారము నందు కొని తారషడ్జమునఁ గంఠము గలగల లాడించెను. వాయు పరమా ణువు లొండొరులఁ బిడిచి పిండుకొని శయనమందిరమున జలజలఁ జిను

కులు రాలెను. మిలమిల మెఱపులు మెఱసెను. మల్లాంబిక తారము నుండి జరజర జారివచ్చి యనుమంద్రమునంటి మంద్రమున విదారించి యాలాపనము ముగించెను. యువరాజు ప్రశాంతముగ శయనించి యుండెను. ప్రభువు ప్రసన్నవదనుఁడై సమాధిలో మునిఁగియుండెను.

ఆ యాలాపము నాలించుచుఁ ప్రభువు పరవశుఁడయ్యెను. ఆకాశమున నవజలధరము లావరించుచున్నట్లు, అవనిపై మయూరములు పింఛములు విప్పియాడుచున్నట్లు, ఆ గగనమునుండి జలబిందువులు చిందుచున్నట్లు, పృథివిపై వృక్షములు క్రొత్తచివురులు దొడుగుచున్నట్లు, తమాల నికుంజముల శ్యామసుందరుఁడు మురళి వాయించుచున్నట్లు, బృందావనమున గోబృందములు వర్షబిందు స్పర్శ కానందించుచు నెత్తులెత్తి యశ్రువు లొలుకుచున్నట్లు — ప్రభువు పారవశ్యమునఁ గలలుగాంచుచుండెను. కొంతసేపటి కాయన కన్నులు తెఱచెను. ఆయన కన్నులలో నశ్రుజలములు తొలుకుచుండెను. కనరెప్పల నప్పళించుకొనుచుఁ ప్రభువు కుమారుని బరికించెను. యువరాజు ప్రశాంతముగ నిద్రపోవుచుండెను. ప్రభువు మల్లాంబికవంకఁ జూచెను. ఆనందము పట్టఁజాలకపోయెను. ఆమె శిరము మూర్కొని, చెక్కిళులు స్పృశించి, చిబుకము పుడికి ప్రభువు తన ముద్దుచెల్లెలిపై ప్రేమముడి యొలుకఁబోసెను.

౬

అల్లాడరెడ్డికి మామిడిసింగన్నమంత్రినిఁ దలచుకొనినప్పుడెల్ల నొడలు మండుకొనిపోవుచుండెను. కుమరగిరిప్రభువుపై నాయన పగఁబట్టినాఁడు. వీరశైవులతో సింగనమంత్రి యూరేగుచుండ నడివీథులలో మిడితలలు వేసికొనరాదని రాజాజ్ఞపంపిన దాయనయే. ఆనాఁటి

నుండియు నల్లాడరెడ్డి సింగనమంత్రినొకకంటఁ గనిపట్టుచునేయుండెను. సింగనమంత్రి కొండపల్లెకుఁ గబురులు చేరవేయుటకు వీలులేకుండఁ గట్టుదిట్టములు చేయించెను. ప్రభువంశనాశనమునకై యాయన యభిచారహోమములు చేయుచున్నట్లుకూడ అల్లాడరెడ్డికి వినవచ్చెను. కుమారాన్నపోతారెడ్డి రక్తముగ్రక్కికొనుటతో నాయనకు సింగనమంత్రి దుశ్చర్యలపై ననుమానము బలపడెను. ఆయన యింక నాగ్రహముపట్టలేకపోయెను. సింగనమంత్రిని ప్రత్యక్షముగ నిగ్రహించుటకుఁ బ్రభువుగాని ప్రధానిగాని యంగీకరింపరు. ఆయన యాలోచించి యాలోచించి యేమైననగానిమ్మని తెగించి సింగనమంత్రిని దన విడిదలకు రావలసినదిగాఁ గబురుచేసెను. ఆయన యనుష్ఠానముననుంటిననిసమాధానమంపెను. అనుష్ఠానము ముగిసినవెంటనే రావలసినదిగా అల్లాడరెడ్డి మరలఁగబురుపంపెను. సింగనమంత్రి వచ్చెను.

అల్లాడ :— సింగనమంత్రిగారూ !

సింగన :— నామంత్రిత్వ మేనాఁడో మంటఁగలిసినదికదా.

అల్లాడ :— అందుచేతనే కాఁబోలు మాంత్రికులయినారు.

సింగన :— మాహేశ్వరులను మాంత్రికు లనుట యీశ్వర ద్రోహము.

అల్లాడ :— ఈశ్వరద్రోహము చేసినను, రాజద్రోహము చేసినను మీవంటి మాంత్రికులు చేయవలసినదే. మే మీశ్వరభక్తులము, రాజభక్తులము. మీరు మిణ్ణిమిణ్ణిచూచి లాభములేదు. ఈశ్వరుఁడు రుద్రుఁడని, భైరవుఁడని, లయకారుఁడని వర్ణించి భయపెట్టుటకు మేము నెట్టిప్రజలముగాము. ఈశ్వరుఁడు శివుఁడు, శంకరుఁడు సృష్టికిఁ బ్రభువునని మే మెఱుంగుదుము. అసలు పరతత్వ మొక్కటియే. అభిరుచి భేద

మునుబట్టి దానినే కొంద ఱీశ్వరుఁడనియుఁ గొందఱు విష్ణువనియు నను చున్నారు. హరిహరైక్య మీ యాంధ్రభూమిలో వందయేండ్లుగా వర్ధిల్లుచున్నది. పాతాళమున నణఁగారిపోయిన వీరశైవమును మఱల నీ నాఁడు మీరు పైకిఁ బెల్లగించుచున్నారు. వీరశైవమును, రెడ్డిప్రభువులేమాత్ర మేని నభిమానించినచో నది దేశాభ్యుదయము కొఱకే. శివకేశవుల యభేదము రెడ్డిప్రభువుల జీవితములలోఁ దేట తెల్లమగు రహస్యము ఆ వీరశైవము నేఁడు దేశద్రోహమునకు దిగుచున్నది. దానికిమీరు మూలకారణము. కుమరగిరిప్రభువు ధర్మమూర్తి. పరమ శాంతుఁడు. కనుకనే మీ యాగడ మింతవఱకును సాగుచువచ్చినది. ప్రభువు ధార్మికత్వమును, మీ బ్రాహ్మణత్వమును, మీశిరస్సును గాపాడుచున్నవి. ఆ చూపులే చూడవలదనుచున్నాను. ఈశ్వరభక్తుల మని మీరేమో హెచ్చులు చెప్పుకొనుచున్నారు. భక్తికిని ద్వేషము నకునుఁ, బొత్తెచ్చటనున్నది ? ఈ ద్వేషమే మీ మాహేశ్వరమును మాంత్రికతలోనికి దింపినది. మీరు శైవులగుట యొప్పయి ప్రభువు వైష్ణవుఁడగుట తప్పయినదా ? పారమార్థికమైన తత్త్వైక్యమును విడ నాడి వ్యావహారికమైన నామరూపభేదమును బట్టుకొని దేవులాడుట మీవంటి వివేకులకుఁ దగనిపని. ఇది యంతయు నట్లుండనిండు. ప్రభు వంశముపై నభిచారహోమములు చేయుట, ప్రభువైరులతో భైరవ తంత్రములు నడపుట, శత్రువులకుగూఢచర్య నిర్వహించుట మున్నగు నభియోగములు మీ తలపైఁ బుట్టెదున్నవి. అయినను మీ తల నిలువఁబడుటకు గారణములు ప్రభువు ధార్మికత్వమును, మీ బ్రాహ్మ ణత్వమును, నొకనాటి మీ మంత్రిత్వమును. చివరిమాటగా నిది వినుఁడు. భద్రకాళికాలయమునను, మైలారవీరభద్రాలయమునను నిత్య నైవేద్యములు జరుపు నర్చకులుతప్ప నన్యులు ప్రవేశింపరాదు. మీరు

మీయింట స్వేచ్ఛగా జపతపోహోమాదులు చేసికొనవచ్చును, వీథిలో నడుగుపెట్టుటకు వీలులేదు. మీ రింకఁ బోవచ్చును.

సింగనమంత్రి కోఱలు పెరికిన కోడెత్రాచువలెఁ దలవ్రేలవైచుకొని దవుడలు చప్పరించుకొనుచుఁ దనయింటికిఁ బోయెను.

మల్లాంబిక మేఘమల్లారురాగము నాలాపించిననాఁటిరాత్రి కుమరగిరిప్రభువామె నెంతయో కొనియాడెను. అల్లునిప్రాణములు నిలుపుకొంటివని యుల్లసమాడెను. మల్లాంబిక యుల్లాసము లేమి నాయనగుర్తించి యామె దిగులుగానుండుటకుఁ గారణము గ్రుచ్చి గ్రుచ్చియడిగెను. మగనిమీఁది తనయనుమానమును తానులోకుల మీఁదఁబెట్టి యన్నగారికందించెను. ఆయన ముక్కున వ్రేలువైచుకొనెను. లకుమవయస్సేమి? కాటయవేమారెడ్డివయస్సేమి? లకుమ నలువదియేండ్లది. వేమారెడ్డి యామెకన్నఁ బదియేండ్లుపిన్న. తానీ మాటవిని యాశ్చర్యపడెను. ప్రభువు లకుమాదేవి తారుణ్యరహస్యము వివరించెను. లకుమాదేవి సామాన్య నర్తకికాదు. ఆమె నాట్యము నొక యోగముగా నభ్యసించెను. నాట్యశాస్త్రము నొక వేదముగా నధ్యయనము చేసెను. ఆమె నాట్యములోని రహస్యము సామాన్యులు గ్రహింపఁజాలరు. ఆమె నాట్యభంగిమలన్నియు యోగాసనములు. ఈ యోగాభ్యాసముచే నామె కర్మేంద్రియపంచకమును శపఱచుకొన్నది. నాట్యవేదము నామె రసబ్రహ్మ ప్రతిపాదకముగా రాధించును. “రసో వై సః” అనునదియే యామెకు మహావాక్యము. ఈ రసజ్ఞాన మామెకు జ్ఞానేంద్రియపంచక వశీకరణము గలిగించెను. విష్ణుదేవుఁడు రసమయుఁడు. లోకము విష్ణుమయము. కాటయ వేమారెడ్డి యామెకు ప్రత్యక్ష విష్ణుదేవుఁడు. ఆమె యభినయ మంతయు విష్ణుపరమైనదే. ఆ యభినయమందలి రసభావములకు వేమారెడ్డి

యాలంబన విభావము, యోగబలము, భావనాబలము నామె కభినవ మైన యౌవనలావణ్యములను బ్రసాదించినవి. ఆమె పరమ వైష్ణవి. ఆమె జీవితము పాలసముద్రము.

మల్లాంబిక మనస్సునకంటిన మాలిన్యము కుమరగిరిప్రభుని యుపదేశ జలముచే సంపూర్ణముగఁ బ్రక్షాళితమైపోయెను. వర్షానంతర వియదంతరాళమువలె నాయమ హృదయాంతరాళము నిర్మలముఁ బ్రసన్నము నయ్యెను. క్రొత్తగా నత్తవారియింటికిఁ బోవు పెండ్లికూఁతురువలె నామె యన్నగారి పాదములఁ గన్నులకద్దుకొని పల్లకియెక్కి తన భవనమునకుఁ బోయెను. గగనముననొక జలధరము మంద్రమధురముగ నుఱిమెను. మల్లాంబిక పల్లకిముత్యాల తెరలలోనుండి నింగి వైపుఁ దొంగితొంగి చూచెను. ఆ నీలాంబుదము మెఱపుఁ జిఱునవ్వు తళుక్కుమనెను. మల్లాంబిక యెక్కినపల్లకీ మందిర ప్రాంగణమునం దాఁగెను. మందిరమయూరము పురివిప్పి యాడుచు నెదురువచ్చి యామెకు స్వాగత మిచ్చెను.

"త్వమసి మమ భూషణమ్ త్వమసి మమ జీవనమ్
త్వమసి మమ భవజలధి రత్నమ్"

కాటయవేమారెడ్డి మందిర చంద్రశాలపై నెవరో పాడుచు నాడుచుండిరి. మల్లాంబిక కా కంఠము తనదేయనిపించెను. అది తన కంత పరిచితమైనకంఠము. ఆ పాడుచున్నది దుర్గ. ఆ పాట యైదాతేండ్ల క్రిందట మల్లాంబిక పాటవలె నుండెను. దుర్గను వినోదపఱచుటకును, దన్ను వినోదపఱచుకొనుటకును గాటయవేమారెడ్డి యప్పుడప్పు డామెకుఁ గబురుపంపి పిలిపించుకొని పాడించి యాడించి యానందించు చుండెను.

గ్రీష్మఋతు వంతయుఁ దీవ్రా తపతాపమున నావటిల్లిపోయిన యవని యాషాఢాంతమున జిలుగుజిలుగు జల్లులకుఁ జిఱుచల్లగాలులకుఁ బులకరించి పచ్చని దుకూలము నొడలంటఁ గప్పుకొనెను. హాల ముఖముల చక్కిలిగింతల కవనీకాంత యవశయై పోవుచుండెను. కురంటక లేపనములచేఁ దరుణుల కరములును రక్తచందన లేపనములచేఁ బురుషుల యురములును నరుణారుణములయ్యెను. కోడెగిత్తలు కొమ్ముల కొనలను గొమ్ములతోఁ గోరాడెను. కొదమయేనుంగులు కొండకొమ్ములను గోరలతోఁ గ్రుమ్మివిడిచెను. ఆకాశమున నంబుదముల రొదలకు అరామముల మయూరములు బదులుచెప్పెను. తనకిది తరుణముగాదని కోయిలగొంతు నొక్కుకొనెను. కొండవీటి నాగరకు లిప్పసారాయముల కెగఁబడిరి. తుమ్మెదలకుఁ జాతుర్మాస్యములును, జకోరములకుఁ జాంద్రాయణములు నారంభమయ్యెను.

అధికాషాఢమాసమంతయు వామనభట్టు నాగమణి దాసితో నేస్తము గట్టిపఱచుకొనెను. కొండపల్లి పతనమై కోమటివేమారెడ్డి రాజుకొండవారి యండఁ జేరెనని విన్నప్పటినుండియు నాగమణికి నిప్పులలోఁ బొరలినట్లుండెను. హరిహరరాయల వారామె యొత్తిడి తాఁగ లేకపోవుచుండెను. కొండవీటిపై కేమి నెపమున దండు పోవలయును? త్రిపురాంతకమును గొండవీటివా రాక్రమించుట చాలదా? కొండపల్లె యమరావతి, ధనదపోలు నిప్పుడు తమచేతికిఁ జిక్కినవి గనుక నేఁడో రేపో వారు శ్రీశైలమునుగూడ నాక్రమింపవచ్చును. నడివేసంగిలో సైన్యసమీకరణము చేయుటకు వేఱు కారణ మేముండును? నల్లమల యడవులలో, నడివానకాలమున యుద్ధమునడపుట యెట్లు? నాగమణి వంద విధములఁజెప్పియు హరిహరరాయల నప్పటిలో యుద్ధమునకు సిద్ధపఱుపఁజాలక పోయెను.

వామనభట్టు నాగమణి రాజుతోనున్నప్పుడెల్ల దాసిదానిని గదలించి నాగమణి యంతస్సు నింతింతగా సంగ్రహించెను. తనకెన్ని యో యాసలుపెట్టి విద్యానగరమునకుఁ దెచ్చి నాగమణి తన్ను దాసిగాఁ జూచుచున్నదని దాని కామెపై గుట్టు. వామనభట్టు దానికి మఱెన్ని యాసలువెట్టి వలలో నైచుకొనెను. కొండవీటిపై లేనిపోనికొండెములు చెప్పి హరిహరరాయలవారి నకారణ సమరములోనికి దింపుచున్నదని యాతఁడు వీలుచిక్కించుకొని గంగాదేవికిని, సాయణమాధవులకును, నిరుగప్పదండనాథులకును, ముద్దప్పమంత్రికిని నూరిపోసెను. రాయలవారు కొండవీటిప్రసక్తి తెచ్చినప్పుడెల్ల వారెల్లరును విముఖత్వము వహించుచుండిరి. గంగాదేవియనిన హరిహరరాయలవారి కొకవిధమైన భయము నొకవిధమైన భక్తి. గంగాదేవి రాయలవారికంటె వయస్సునఁ బెద్ద. అన్నగారి భార్య. ఆయన యాకస్మికమరణమువల్లనే తనకు రాజ్యము సంక్రమించెను. మంత్రులు, దండనాథులుఁ, బ్రజలును నామెనే మహారాణిగా గౌరవింతురు. ఈ విధముగ రాయలవారి కామె యనిన నొక విధమగు భయము. ఆమె విద్యారణ్యుల శిష్యురాలు. ఆయనకడ నామె వేదాంతసారమును జక్కఁగా గ్రహించెను. ఆమె గొప్ప పండితురాలు, కవయిత్రి. ఈ విధముగ రాయలవారి కామె యందొక భక్తి. ఆమె కాదనిన దాని నాయన యెన్నఁడును జేయ సాహసింపఁడు. ఆయన వ్యక్తిగత విషయముల నామె పట్టించుకొనదు. రాజ్యవిషయములందే యామె కల్పించుకొనును. కొండవీటి దండయాత్ర కామె యామోదముద్ర లభింపలేదు.

నిజాపాథమునఁ జాతుర్మాస్యములు పట్టుదురు. అహోబిలము నుండి తిరిగివచ్చిన యనంతరము గంగాదేవి మధురా విజయమునఁ గొన్ని శ్లోకములు రచించెను. అహోబిలమున రచించిన శ్లోకముల

పాకము వీనిలో నామె కగపడలేదు. డిండిములు గూడ నాయభి ప్రాయమునే వెల్లడించిరి. విజయదశమినాఁటికి మధురావిజయమును బూర్తిచేయవలెనని యామెకు సంకల్పము గలిగెను. చాతుర్మాస్యమును దానహోబిలమున స్వామిసన్నిధిని గడుపదలఁచినట్లామె రాయల వారికిఁ దెలియపఱచెను. డిండిములను, వామనభట్టును దమతోఁ దీసికొని పోదుమనియు నామె తెలియఁజేసెను. తన కావ్యము వినుటకు డిండిములును, హీరాంబికకుఁ బారము చెప్పుటకు వామనభట్టును తమ వెంట నుండవలెను. రాయల వారామెమాట కడ్డమాడు నాచారమే లేదుకదా. వర్షములలోఁ బచ్చమల యడవులలో వాగు నాలుగు నెలలు నిలువయుండు టాయనకు మనసులో నిష్టములేదు. ఆమాట నాయన యనలేఁడు.

గంగాదేవి రాచకొమార్తెతో నహోబిలమునకు వచ్చినట్లును, జాతుర్మాస్యము లచ్చటనే వెళ్ళఁబుచ్చునట్లును వామనుని మూలమునఁ గొండవీటను, నాగమణి మూలమున రాజు కొండలోఁ గోమటివేమా రెడ్డికినిఁ దెలిసెను. కోమటిరెడ్డి రాజుకొండ దేవరకొండల నడుమ నాసులో గొట్టమువలె నాడుచుండెను. అన్నె దేవచోడఁ డొకవంకఁ గోమటివేమారెడ్డి యొకవంకఁజేరి పెదవేదగిరినాయనికి సింగమనాయనికిఁ జెవులలో నిల్లుగట్టుకొని కూర్చుండిరి. వారిపోరు పడఁజాలక నాయకులిరువురు మెల్ల మెల్లగా మెత్తఁబడుచుండిరి. విద్యానగరమునకునుఁ గొండవీటికినిఁ బోరు పుట్టించినఁగాని తమకుఁ జోటు దొరకదు. వెలుగోటి రాయపనాయకుఁడు కొండవీటివారి చంకక్రిందదూరి వెలమ కులమునకుఁ గళంకము తెచ్చినాఁడు. రాయపనాయకునకుఁ గుడిభుజము గజరావు తిప్పానాయకుఁడు. తిప్పానాయకుఁడు పెదవేదగిరినాయనికి సవతితమ్ముఁడు. దేవరకొండ రాజ్యము తనకు రావలెనని తగవు లేవఁ

దీసి యాతఁడు దేశభ్రష్టుఁడై దేవరకొండ వీడి నాలుగైదేండ్లక్రిందట రాయపనాయకుని యండఁ జేరెను. తన బలపరాక్రమములచే నాయకుని మెప్పించి క్రమముగఁద్రిపురాంతకమున దండనాయకపదవి సంపాదించెను. రాయప్పనాయకుఁడు వృద్ధుఁడు. యుద్ధమనిన నిప్పటికిని బులివలె గాండ్రించి యురుకును. వెలమరాజ్యపు సరిహద్దున నీ వెలమపులి యుండుటయే మంచిదని త్రిపురాంతకము నాక్రమించినవెంటనే కాటయవేమారెడ్డి రాయపనాయకునే యచ్చట దుర్గాధిపతిగా నియమించెను.

అన్నె దేవరచోడఁడీ నడుమ వేదగిరినాయని కొక యుపాయము చెప్పెను. గజరావు తిప్పానాయకుని జల్లగాదువ్వి తమవైపునకుఁద్రిప్పుకొన్నచోఁ ద్రిపురాంతకము తమగుప్పిటిలోనుండును. దానితో వీలు చూచుకొని కొండవీటి నొకయాట యాడించవచ్చును. అన్నెదేవచోడని కుమారుఁడు వీరభద్రుఁడు గుండెలుతీసినబంటు. గజరావు తిప్పనిఁదమవైపునకుఁద్రిప్పుకొనుటకు వీరభద్రుఁడు నియుక్తుఁడయ్యెను. వీరభద్రుఁడు తిప్పానాయకునితోఁ జెలిమిచేసి యిట్టివలలో వైచుకొనెను. త్రిపురాంతకదుర్గమున దండుమూకలకు తిప్పానాయకుఁడెంత చెప్పిన నంతియే. రాయపనాయకుని ద్రోసి రాజని తిప్పానాయకుఁడు త్రిపురాంతకదుర్గము నాక్రమింపవలయును. దీనికిఁ గినిసి కొండవీఁడు త్రిపురాంతకముపై దండెత్తవలయును, ఈ దండెత్తుట విద్యానగరము మీఁదికే యని వాదు పుట్టింపవలయును. పిల్లియుఁ బిల్లియుఁ బోరాడుకొనును. పిట్టలు తీర్పు చెప్పును.

హీరాంబిక యహోబిలమునకు వచ్చియుండుట కోమటివేమారెడ్డి కొకవింతయూహ పుట్టించినది. ఆయూహను బ్రేరేచినది నాగమణి

లేఖ. హీరాంబిక యహోబిలమునకు వచ్చిన వర్తమానము నంపుట చాలక నాగమణి యామె యందచందము లభివర్ణించుట యేటికో! వామనభట్టీ యందగత్తెను గాటయ వేమారెడ్డికిఁ గూర్చవలెనని యత్నించుట గోమటి వేమారెడ్డికిఁ జూచాయగాఁ దెలియును. శాకుంతల వ్యాఖ్యానపుఁ బ్రతి సిద్ధమైన వెంటనే తాను విద్యానగరమునకుఁ దిరిగిపోనుంటినని వామనభట్టే సింగనమంత్రిముందు నోరుజారి బయటఁ బెట్టెను. సింగనమంత్రి యా వార్తను కొండపల్లికిఁ జేరవేసెను.

హీరాంబిక నహోబిలమునందుండఁగనే యపహరించి యా నిందను కాటయవేమారెడ్డి తలమీఁదికిఁ ద్రోసినచోఁ గొండవీడును విద్యానగరమునుఁ గొట్టుకొని చచ్చును. రాజ్యముతోపాటు రాజకుమారియుఁ దనకుఁ దక్కును. కోమటి వేమారెడ్డి యీ యాలోచనలోఁ బూర్వభాగము మాత్రము వెలమలముందు వివరించెను. ఈయూహ బాగుగనున్నది. ఇది తీవ్రకోపకారి, శీఘ్రకార్యకారి. కోమటి వేమారెడ్డి యాక్రొత్త యెత్తును వివరించుచుఁ గాటయ వేమారెడ్డి హీరాంబికపైఁ గన్నువైచినట్లు హరిహరరాయలకు నచ్చఁ జెప్ప వలసినదిగా నాగమణికి లేఖ పంపెను. ఉన్నవియు లేనివియుఁ గల్పించి యది రాయలవారికిఁ గొంప మునిఁగిపోవుచున్నట్లు చిత్రించెను. గంగాదేవిని, డిండిమభట్టును నీ కథలో ముడివెట్టి యామె దినమునకొక క్రొత్త రహస్యమును రాయలవారి చెవిని వేయుచుండెను. రాయలవారు తనకు రెండవ యంతఃకరణమైన యిరుగప్ప దండనాథుని బిలిపించి యీ ప్రస్తావనఁ దెచ్చెను. ఆయన నాగమణి మీఁద నూఱు కొండెములు చదివెను. రాయలవారిపని ముందు నుయ్యి వెనుకగొయ్యిగా నుండెను.

## ౧౮

కుమారగిరి మహీపతి తులాపురుష మహాదానమున వివిధ సీమలకుఁ బంచిపెట్టఁబడిన ధనముతోఁ గొండవీటిరాజ్యమునఁ బ్రాఁతచెఱువులు బాగుపడి క్రొత్తచెఱువులుగూడ వెలసెను. పుష్కలముగ వర్షములు గురిసి యొడ్డులెగఁదట్టి పిల్లసంద్రములవలె నున్న యా పంటచెఱువులక్రిందఁ దరిసేద్యములు చక్కఁగాసాగి రాజ్యమెల్లఁ బచ్చనిపైరులతోఁ గన్నులపండువుగనుండెను. రైతులెల్లరును గుమారగిరిప్రభుని యౌదార్యమును గథలుగాఁ జెప్పికొనుచుఁ బదములుగాఁ బాడుకొనుచుండిరి. పంటలక్ష్ములువోలెఁ జేలగట్ల వెంటఁ బచారులు పోవుఁ గాపుఁబడుచుల సిగలలోఁగానుపువ్వులు కలకల నవ్వెను. కమ్మనిజున్నగడ్డలఁ జప్పరించుకొనుచు నెండవానల పెండ్లిపందిటిలోఁ బిల్లకాయలు వానవల్లప్పలాడుకొనిరి. పంటపొలఁతిచెక్కిళ్లపైఁ గుంకుమపత్రభంగముల వలె నింద్రగోపములు పచ్చికబయళ్లపైఁ దీరుతీరుల రంగవల్లులుదీర్చెను. ఆకాశమున బెగ్గురులు కలువపూఁదోరణములుకట్టెను. సెలయేళ్లచిందులకుఁ గప్పలు డప్పులు వాయించెను. ముత్తైపుఁజిప్ప కిన్నాళ్లకుఁజూలు నిల్చెనఁట. గగనలక్ష్మి సీమంతమున బలాకలు బారులు గట్టిముత్యాల చేరులమురువు చూపెను. బంధూకములు చెవిసందులఁ జెరివికొన్న కాపుకన్నెకు సిగలో మొగలిపొత్తికఁ బొదలికో ముచ్చట యయ్యెను. మొగిలు మఱుగున వెలుఁగుఱేఁడు మొగము చాటువైచెను. ముసురు వానల ముసుఁగులోఁ దమ్మి పడఁతి మొగము ముడిచెను. కొండవీటి హంసతూలికాతల్పమున మల్లాంబిక గాఢాలింగనములలోఁ గాటయ వేమారెడ్డియుఁ బాలమున్నీట శేషభోగితల్పమున శ్రీదేవి యంకతలమున శ్రీమహావిష్ణువును శయన సుఖ మవధరించిరి,

అల్లాడరెడ్డి సకుటుంబముగ రాజమహేంద్రవరముఁ జేరుకొని యావానలోనే సేనల సమీకరణమున మునిఁగియుండెను. కోమటి వేమారెడ్డి పట్టుపడునను కొన్నది వేఱువిధముగఁ బరిణమించెను. వానలు వెలిసినంతనే పెద్దయెత్తునఁ గొండవీటిపై దండులయొత్తిడి తాఁకవచ్చును. వెలమరాజ్యపు సరిహద్దులవెంటఁ దగిన కట్టుదిట్టములు చేయఁబడెను. కృష్ణా దక్షిణతీరము పొడవునను బుట్టగొడుగులవలె గుడారములు వెలసెను. ఊడ్పులు పూర్తియైనవెంటనే మఱికొంత సైన్యమును సమకూర్చవలెను. నాగటికఱ్ఱులు చరిచిన దాగళ్ళపై బల్లెపు మొనలు సాగుచుండెను. ఆషాఢారంభమున రగులుకొన్న కొలుములు శ్రావణాంతము వఱకు జ్వలించుచునేయుండెను. శ్రావణ బహుళాష్టమి శ్రీకృష్ణ జయంతి. పల్లెప్రజలకిది యుట్లపండుగ. ఆయేటి యుట్ల తిరునాళ్లలోఁ బల్లెవీథులలో సుట్లుకొట్టిన యువకుల కుట్టికొక కొబ్బరికాయయు నొక మొహరీయు దొరకును. ఆ మొహరీ చూపినచోఁ గుమరగిరిప్రభువు కప్పురపుఁదాంబూలము చేతిలోఁబెట్టి పట్టాకత్తి నడుమునకుఁ గట్టును. ఆకత్తితోఁ గదనరంగమున శత్రువీరుల శిరములు గొట్టినవీరులకుఁ గుమరగిరిప్రభువు బిరుదు పెక్కెములు, వీరమాన్యములు నిచ్చును. ఉట్లపండుగ యెప్పుడెప్పుడా యని పల్లెపల్లెల యువకు లువ్విళ్లూరుచుండిరి. ఎవనికివాఁడే యేకాంగ వీరుఁ డనిపించుకొనవలెనని యాశ. కొండయెత్తు తాడిని గుప్పిటఁబట్టి యెక్కి యాపున నున్న పండ్లన్నియుఁ గురిపించవలయును. చెట్టుపై నొక్క తాటిపండు మిగిలెనా, తనకుమఱి తలపండు మిగులదు. గడ్డికోఁతలలోఁ, గలుపుతీఁతలలో, నేటియీఁతలలో, నెల్ల చేఁతలలోఁ బల్లెయువకులకు బవరపుఁ దలపోఁతలే యయ్యెను.

అన్నయమంత్రితో నాలోచించి, గుమరగిరిప్రభుని యామోదముద్ర వహించి లకుమాదేవి యహోబిలమునకు బయలుదేరెను.

కొండవీడు తనకు నాట్యరాజ్ఞీపట్టము గట్టెను. కుమారగిరిప్రభువు తన్ను రెండవప్రాణముగా మన్నించును. ఆ రాజ్యమునకు, నా ప్రభువునకుఁ దానేమి చేసెను. అభినయములచే వేయివిధముల నలరించెను. నిజమే. ఆ రాజ్యమును, నా ప్రభువును సుఖముగ నుండినంత కాలము దన యాటలు సాగును. కొండవీటి చుట్టును గుఱ్ఱములు గ్రమ్ముకొని వచ్చుచున్నవి. కుమారగిరి ప్రభువు సింహాసనమునఁ గూరుచుండెనే కాని ఆసింహాసన మింకను గుదుటఁ బట్టలేదు. వెలమరాజు లొకవంకను, విద్యానగర మొకవంకను నెత్తివచ్చినచో నంతయుఁ దల్లక్రిందు లగును. అప్పుడు తా నెచ్చట, తన నాట్య మెచ్చట ? రాజ్యము స్థిరపడవలెను. రాజు స్థిమితపడవలెను. కళలు విరిసి జీవితము కలకలలాడవలెను. సంపద వేళ శృంగారములు. విపత్తువేళ వీరములు. వామనభట్టునకు దైవికముగఁ జక్కని యవకాశము చిక్కినది. తా నెట్టయిన సందుచేసికొని యందులోఁ జొరఁబడవలెను. ఆయన పౌరోహిత్యము చేయును. తాను పెండ్లిపీటలు పఱచుటకైనఁ బనికిరాక పోవునా ? శ్రావణ శుక్రవారపుఁ గన్నె పేరటాండ్రు మంగళాలంకృతలై కొండవీటి వీథులలో గుంపులుగుంపులుగాఁ గులుకు నడకలు పోవుచుండిరి. క్రొత్త పెండ్లికూఁతురిని గొండవీటికిఁ గొనివచ్చుటకై పూలపల్లకి యహోబిలమునకు బయలుదేరెను.

అహోబిలమున నెగువకొండపై విద్యానగరప్రభువుల రాజసౌధమున గంగాదేవి కనకపుగంటము తాళపత్రములపై నమృతపుఁ జినుకులు చిలుకుచుండెను. ఎదలోఁ గాటయవేమారెడ్డిరూపము, నెదపైఁ గస్తూరికాలేపమునై హీరాంబిక తను వహోబిలముపైని దలపు కొండవీటిపైని దహతహలాడుచుండెను. వామనభట్టు మూఁడువేళలను శాకుంతల వ్యాఖ్యానము నామె చెవులకుఁ జెప్పఁ బోవుచుండెను. జనీసుమయుఁగారె,

విహరించుచుండుఁగాక, ఆయావేళలనామె స్వామిని దర్శింపవలసినదే. ఆలయమున నర్చకులు ప్రభాతమంగళగీతము లాలపింతురు. అదుగో! స్వామి మేల్కాంచినాఁడు. అదె యభ్యంగనమాడినాఁడు. ఫాలమునఁ గస్తూరితిలకము దిద్దుకొనినాఁడు. కంఠమునఁ దులసిమాలధరించినాఁడు. హీరాంబిక యలంకృతయై యాలయమునకుఁ బరువెత్తును. స్వామి కంఠమునఁ దాను పుష్పమాల యర్పింపవలెను. ఆమె మంటపసోపానము లెక్కుచుండును. సోపానపంక్తిపై స్వామి తన కెదురువచ్చి కౌఁగిలించుచున్నాఁడు. హీరాంబిక హస్తములలోఁ బూలమాలిక పట్టు సడలిపోవును. అర్చకుఁ డద్దాని నంజలితో గ్రహించును. హీరాంబిక స్వామిగళమునఁ బూలమాలిక యైపోవును. గర్భాలయమున నర్చకుని చేగంట గణగణ మ్రోఁగును. హీరాంబిక ద్వారముచేరువనిల్చి స్వామి కారగింపుచేయించును. కర్పూరనీరాజనమిప్పించును. కస్తూరితాంబూలమిప్పించును. తాంబూలరక్తిమచేఁ గించిదరుణములైన దంతములు తోఁచియుఁ దోఁచనట్లు స్వామి మందహాసముచేయును. ఆమందహాసములను గన్నులలోఁ బదిలించుకొని, మల్లాంబిక తులసీదళము, ప్రసాదముస్వీకరించి యాలయము వెడలివచ్చును. పటికతాలమెట్లపైఁ దన కాళ్ళకై కలువపూరేకుఁబొత్తులు పఱచియుండును. మెత్తనిపాదముల యొత్తిడి కవి నలిగిపోవునేమోయని హీరాంబిక తేలితేలి నడచును.

శ్రావణపూర్ణిమనాఁడు చంద్రోదయవేళకు లకుమాదేవి యెగువ యహోబిలమునఁ గోవెలసత్రము ముందు పల్లకిదిగెను. ఆమెవెంట నిరువది మందికంటెఁ బరివారములేదు. తోడుగానుండుటకై యామె తనవెంట దుర్గనుగూడఁ దెచ్చికొనెను. తానొక నెలయో రెండునెలలో అహోబిలమున నుండవచ్చును. పిల్లకు నాట్యము వెనుకఁ బట్టవచ్చును. సదోవ్యాపకములోనుండినచోఁ బిల్లకు దిగులుకొంత తీరవచ్చును. మఱియు

నాఁడు లకుమాదేవి కోవెలలో హీరాంబికకుఁ గనిపించెను. ఒకరినిజూచి యొకరు చకితులై పోయిరి. అరనిముసములోఁ జూపులు చిఱునగవులై చిఱునగవులు పలుకరింపులై, పలుకరింపులు పరిచయము లయ్యెను. పూజావిధి జరుగుచుండినంతసేపును నిరువురకు నొకేభావన, యొకేపారవశ్యము. ఒకరొకరినిఁజూచుకొందురు. ఇరువురును స్వామిసంకఁజూతురు. వేఱువేఱుగఁ జూచినచో నామెయే యీమెయను భ్రాంతి జనించును. కలిపిచూచినచోఁ గవలపిల్లలో కాక యొకామె యించుక పెద్దదిగా నుండుటచే నక్క-చెల్లెండ్రో యను సందేహము గల్గును. హీరాంబిక నైదేండ్లనాఁడుఁనీవలెనుండునని లకుమాదేవికిని, నైదేండ్లుగడచినచో రాజకుమారి లకుమాదేవివలె నుండునని గంగాదేవికిని జెప్పియే యుండెను. ఇరువురనడుమ దుర్గయే పొరపడుచుండ గంగాదేవిమాట చెప్పనేల? నాఁటిసాయంకాలమే లకుమాదేవి నివాసము సత్రమునుండి యంతఃపురమునకు మార్చునంతవఱకును హీరాంబికయు గంగాదేవియు నామెను నిలువనీయలేదు. లకుమాదేవి తన పరివారమునం దిరువురనుమాత్రము తనతోనుంచుకొని మిగిలినవారిని నైదాఱుదినముల యనంతరము తిరిగి పంపివైచెను. తిరిగి వచ్చునప్పుడు పచ్చమల యడవులలోఁ దాము మెడకుగొలుసు దగిలించివిడిచిన కొఱుదున్ననుఁ బట్టుకొనిరండని కాటయవేమారెడ్డి వారికానతియిచ్చియుండెను. వారాయడవులలో దాని వెదకులాడుచుఁ దిరుగుచుండిరి.

లకుమాదేవి కచ్చుటి శబరికన్నెల గాత్రలావణ్యము, నవయవ సౌష్ఠవముఁ గన్నులపండువుగనుండెను. రాజకుమారి నాటపాటలచే నలరించి యామెకడ నదియోయిదియో గడించుట కలవాటుపడి వారు సంజవేళల నప్పుడప్పుడామె దర్శనమునకు వచ్చుచుందురు. లకుమాదేవి వారి బృందనాట్యములను విలకించి యాశ్చర్యపడెను. నిసర్గసుందరము

లగు వారి యంగభంగిమములు, సమూయికములగు వారి హావభావములు, సశిక్షితములగు వారి యభినయరీతులు నామెను ముగ్ధురాలి నొనర్చెను. వారి వ్యష్టిసమష్టి నృత్తములవలనఁ దాను నేర్చుకొనవలసిన విశేషములెన్నియో యున్నవి.

జన్మాష్టమి యింకను నైదు దినములేయున్నది. శబరకన్యలచే రాసలీలానృత్యము చేయింపవలెనని లకుమాదేవికి మనసు కలిగెను. దుర్గకృష్ణుఁడు, శబరబాలికలు గోపికలు. లకుమాదేవి యీ యైదాఱు దినములును వారి కూపిరిసలుపనీయలేదు. అష్టమినాఁటి సాయంకాలము కోయగూడెమంతయుఁ గోవెల యావరణయందే యుండెను. కోయలు వారి యాచారము ననుసరించి గర్భనృత్యము, కుండలీనృత్యము, చెంచులక్ష్మీనృసింహ సంవాదము మున్నగునవి ప్రదర్శించిరి. నెమలినృత్యము, నేదునృత్యము నద్భుతముగ నుండెను. అనంతరము లకుమాదేవి రాసలీలానాట్యము చేయించెను. పచ్చమలయడవులు బృందావనముగాఁ బరిణమించెను. కన్ను లిన్నివిధములుగాఁ ద్రిప్పవచ్చునని, కంఠ మిన్నివిధములుగాఁ గదల్పవచ్చునని, అవయవముల నిన్నివిధములుగా నాడింపవచ్చునని వారెన్నఁడు నూహించి యెఱుఁగరు. వారికొక క్రొత్తలోకములో నున్నట్లుతోఁచెను. ఈ ప్రదర్శనమున హీరారాంకంటె లకుమాదేవియే కోయలహృదయములకుఁ జేరువయయ్యెను.

ప్రదర్శనములు చూడవచ్చినవారిలోఁ గోయలుకాని యపరిచితులుగూడఁ గొందఱుండిరి. వామనభట్టునకు వారెవ్వరో తెలియలేదు. ఎవరో యాత్రికులు కాఁబోలు ననుకొనెను. నటునాఁ డొకఁడు కోవెలలో నగపడి "యీ యిరువురిలో రాజకుమారి యెవ్వ" రని వామనుని బ్రశ్నించెను. వామనున కాతని వాలక మనుమానాస్పదముగనుండెను. రాజకుమారి యెవ్వరైన వీని కేల? "ఇరువురు"

యని వామనుఁడు బదులు చెప్పెను. "ఇరువురిలో విద్యానగర రాజకుమారి యెవ్వ" రని వాఁడు తిరిగి ప్రశ్నించెను." ఆమెయే యని వామనుఁడు వ్రేలితోఁ జూపెను. వాఁడింకను నేదియో యడుగఁ బోయెను. వామనుఁడు విసుగుకొనుచు వానిఁ దప్పించుకొనిపోయెను. అంతఃపురమున కేఁగినపిదప వామనభట్టీమాట యందఱకును జెప్పెను. అందఱును పకపక నవ్వుకొనిరి.

శ్రావణబహుళపంచమినాఁడు విద్యారణ్యులు సిద్ధిపొందిరని విద్యానగరమునుండి వార్తవచ్చెను. వామనభట్టునకు, డిండిములకుఁ బిడుగుపడినట్లయ్యెను. తక్షణమే వారు ప్రయాణమునకు సిద్ధపడిరి. గంగాదేవికిఁగూడ బయలుదేరవలె ననిపించెను. లకుమాదేవి సాహచర్యమువీడుట హీరాంబికకుఁ గష్టముగ నుండెను. ఆమె యీ యాకస్మిక ప్రయాణమునకు వెనుకాడఁజొచ్చెను. బిడ్డయుత్సాహమును, దన వ్రతమును భంగపఱచుకొని గంగాదేవి యిప్పుడువచ్చి చేయునదిమాత్ర మేమున్నదని డిండిము లామెనుండిపొండని సమాధానపఱచెను. తమతోవచ్చిన విద్యానగరపరివారమును "రాఁబోవునవి చీఁకటిదినములు. భద్రముసుఁడీ" యని హెచ్చరించి వామనుఁడు డిండిముల నందలముపై వెనుకరండనిచెప్పి గుఱ్ఱముపైఁ దాను ముందు పరువెత్తి పోయెను. వానవంగుడులకు లెక్కసేయక వామనభట్టు తరిమి తరిమి పయనించి యేకాదశినాఁ డర్ధరాత్రమున విద్యానగరము చేరుకొనెను. తిన్నగా విద్యారణ్యుల యాశ్రమమునకుఁ బోయెను. విద్యానగరమే యంధకారమున మునిఁగియుండెను. ఆశ్రమ మచ్చముగ నంధకారపు ముద్ద. తెల్లవాఱువఱకును వామనభట్టు గురువులవారి సమాధిప్రోలనే యొడలెఱుఁగక పడియుండెను. తెల్లవాఱినంత నాతని కించుక తెలివివచ్చెను. ఆతని మనస్సు వెంటనే యహోబిలమునకుఁ బరు

వెళ్లెను. అమావాస్య సమీపించుచున్నది. అంతఃపురస్త్రీల నొంటరిగ విడిచి వచ్చినందులకు హరిహరరాయలవా రేమందురో. పరివార మొకవందమంది భటులుండినను భారమంతయు వారిపై వీడివచ్చుట ప్రభువంగీకరించునా? అడుగులో నడుగు వైచుకొనుచు వామనభట్టు రాజభవనము దెస నడచుచుండెను. త్రోవలో నాగమణిభవనము వామనునిచూపు నాకర్షించెను. ఆతఁడు ద్వారముకడ కేఁగి "నాగమణి యున్నదా?" యనెను. దాసినేత్త మాకంఠము గుటుకించి యొక్కగంతున వీధిలో దుమికెను. నాగమణి యింటనేయున్నది. ప్రభుదర్శనమున కరుగుటకై యలంకరించుకొనుచున్నది. దాసిది వామనుని దిగులుమొగముచూచి దిగ్భ్రమఁజెంది "అప్పుడే మైపోయినదా?" యని నీరు నమలెను! వామనున కీప్రశ్న మర్థముకాలేదు. "అయిపోయిన దేమి?" యని యాతఁడు తిరుగఁబ్రశ్నించెను. "హీరాంబిక నపహరించుట" యని యది యాతని చెవిలోనూదెను. వామనభట్టు మొగమున నెత్తుటిచుక్కలేదు. "ఆ" యని యాతఁడు నోరువెలిచి యొకక్షణమట్లె నిలిచిపోయెను. అతనికచ్చట నిముసమేనియుఁ గాలు నిలువలేదు. "మఱల నిప్పుడే వత్తు" నని యాతఁ డచ్చటనుండి చరచర నడచిపోయెను.

హరిహరరాయలవారి కీవార్త వెంటనే యెఱిఁగింపవలయును. కోమటివేముఁ డెంతనీచమునకుఁ బాల్పడినాఁడు! తన యనుమానము నిజమేయయ్యెను. రాయలవారితోఁ జెప్పి తగినసిబ్బందితో నిప్పుడే యహోబిలమునకుఁ బోవలెను. రాజద్వార మల్లంత దూరముగా నుండెను. వామనభట్టు తటాలున నిలిచిపోయెను. అతని కేదో యూహా స్ఫురించినది. కోమటివేముని యెత్తు కొండవీటికే వంచిది. రాయలవారిని గొండవీటిపై కుసికొల్పవలెనని కదా ఏన్నాళ్ళుగాఁ

దాను పాల్పడినది. ఈ దుశ్చర్యతోఁ దనగోతిని దానే త్రవ్వుకొని నట్లయినది. కోమటివేముఁడు హీరాంబిక నపహరింపవలయును. రాయలవారి కావార్త యందవలయును. కోమటివేముని కాయనయే గోరీకట్టవలయును. ఈయాలోచనతో వామనభట్టు చివాలున వెనుకకుఁ దిరిగెను. నాగమణి పల్లకి యాతనికగపడెను. ఆతఁడు దారితప్పించి యావలసందునఁ దిరిగి దానియింటికే పోయెను. దాసినిఁబిలిచి యా వివరములన్నియు నడిగెను అది కోమటివేమారెడ్డి లేఖయందలియంశము లన్నియుఁ బూసగ్రుచ్చినట్లు వివరించెను. వామనభట్టంతయువిని దానికిఁ జెప్పవలసిన తీయనిమాటలుచెప్పి యటనుండి యాశ్రమమార్గముఁ బట్టెను. కోమటివేమారెడ్డి హీరాంబిక నపహరించుటయందలి నీచత్వమే యాతనికింతకుముందు గోచరించినది. ఈలేఖాంశములందలి కుటిలత్వమునుగూడ బయటఁబెట్టినవి. కోమటివేమునియెత్తు "ఏకా క్రియా ద్వ్యర్థకరీ" యను నట్లున్నది. హీరాంబికాపహరణాపరాధమును గొండవీటిపైఁ ద్రోయవలెననియా వీని పన్నుగడ? కానిమ్ము. అదియునుఁ జూతము. రాయలు గ్రుడ్డిగా నమ్మినను, నిరుగప్పదండనాథుఁడులేఁడా? డిండిమభట్లులేరా? గంగాదేవిలేదా? గంగాదేవియు, నామెవెంట లకుమాదేవియు నాతనికి గుఱుతువచ్చిరి. ఆతనికింక నచ్చటనిలువ బుద్ధిపుట్టలేదు. తాను తిరిగి యహోబిలము చేరునప్పటికే జరుగవలసినది జరిగినచో సరియే. లేనిచో గంగాదేవితో, లకుమాదేవితో నాలోచించి కర్తవ్యనిశ్చయము చేయవచ్చును. వామనభట్టు పరువుపరువున నాశ్రమమునకుఁబోయి విద్యారణ్యుల సమాధికిఁ బ్రణమిల్లి తన పవిత్రసంకల్పమునకా పరమగురుదేవుని యాశీర్వచన మర్థించి యవహితచిత్తుఁడై యశ్వమునెక్కి యప్పటికప్పుడే యహోబిలమార్గముపట్టెను.

౧౮

వీరభద్రునితో నొప్పందము కుదిరిన యనంతరము గజరావు తిప్పానాయకుఁడు రాయపనాయకుని యంతఃపురపరివారములోఁ బలువుర నేదోయొక సాకుపైఁ దొలఁగించి క్రొత్తవారిని నియమించెను. రాయపనాయకుఁడు రణరంగమునఁ గాలాహియేకాని యన్యత్ర కేవలము మన్నుదిన్న పెంజెరు. తనచుట్టు నల్లుకొనివచ్చుచున్న సాలిగూడే యాయనకుఁ గనిపించుటలేదు. వీరభద్రుఁ డొకటిరెండు పర్యాయము లహోబిలమునకుఁ బోయివచ్చెను. అచ్చట విజయనగర పరివారము నూఱుమందికి మించిలేదు. కోయగూడెము కోవెలకుఁ గొంత దూరముననే యున్నది. రెండువందలమంది మైనచోఁ గార్యమును గుట్టుచప్పుడుగాకుండఁ బూర్తి చేయవచ్చును. శ్రావణపూర్ణిమనాఁటికిఁ గార్యవిధానము నిశ్చితమైనది. అమావాస్యనాఁడు హీరాంబిక నపహరింపవలయును. అహోబిలమునుండి త్రిపురాంతకమువఱకు మొఱికలవంటి బోయీలను పదియంచెలుగా నేర్పాటు చేసిరి. కాకలుతీరిన యాత్రికులు రెండువందలమంది యడవులమఱుఁగునఁ జీకటివేళలఁ బ్రయాణము సాగించి యమావాస్య నాఁ డర్ధరాత్రమున నహోబిలము చేరవలెను. నిద్రావశులై యున్న విద్యానగర భటులను గిక్కురుమనకుండఁ గుత్తుక లుత్తరింపవలయును. వీరభద్రుఁడు పదిమంది భటులతోఁ బని చక్కఁబెట్టవలెను. భాద్రపదశుద్ధ ప్రతిపత్తున నర్ధరాత్రమునకు హీరాంబిక త్రిపురాంతకమున నుండవలయును.

పాడ్యమినాఁడు బారెడు ప్రొద్దెక్కినప్పటికి వామనభట్టు దిగువ యహోబిలమున నుండెను. కోవెలలో నేదియో గోలగా నున్నదని యాతని కచ్చటనే తెలిసెను. ఆతని గుండె గుభేలుమనెను. ధైర్యము చిక్కఁబట్టుకొని యాతఁడు కొండలుదాఁటి గుఱ్ఱముపై నురుకుచుండెను. మొట్లదారిని బరువులెత్తు ప్రజలయఱపు లాతని చెవులలోఁ జొఱఁబా

ఉటలేదు. మఱుగడియలో నాతఁడెగువ యహోబిలమున నంతఃపురము ముందు నిలిచెను. కోయమూకల నొత్తిగించుకొనుచు మందిరము లోనికిఁ బోయెను. హీరాంబిక కన్నులఁ బడినంతనే వామనభట్టునకుఁ బ్రాణములు లేచివచ్చెను. దుర్గవచ్చి యాతనినిఁ గౌఁగిలించుకొని బిగ్గరగా నేడ్చెను. గంగాదేవి కన్నులనీరు గ్రుక్కుకొనుచుండెను. వామనభట్టునుజూచి హీరాంబిక గొల్లుమనెను. వామనభట్టున కేమియు నర్థమగుటలేదు. లకుమాదేవి యేది? దుర్గ "అక్కా యక్కా" యని పలవించుచుండెను. "అమ్మా! లకుమాదేవి యేది?" యని వామనుఁడు గంగాదేవి నడిగెను." అపహరింపఁడినది వామనయ్యగారూ?" అని యామెయు వాపోవఁ దొడఁగెను. వామనభట్టున కాశ్చర్యము, శోకము, భయము నొకదానిపై నొకటి ముంచుకొని వచ్చెను. క్షణమాత్రము నిమీలిత నేత్రుఁడై యట్లేనిలిచి నిట్టూర్చుచు నాతఁడు నిలువఁ జాలక నేలపైఁ గూలఁబడెను. ఆతని ఇంద్రియము లేవియు నాతని వశమునలేవు. ఐదు దినములు నిద్రాహారము లెఱుంగని నిరంతర ప్రయాణము. తదంతమున విషాదవార్త. వామనభట్టు తటాలునలేచి ప్రాంగణమునమూగిన ప్రజలలోఁ బ్రధాన భిల్లనాయకులు తప్ప కడమవారెల్లరును నిండ్లకుఁ బోవలెనని యాదేశించెను. రాజకుమారి నర్ధరాత్రమున నెవరో యపహరించిరని యహోబిలమున వదంతి వ్యాపించెను. అంతఃపురమునఁ బరిచారికల యఱపులువిని కోయనాయకు లా యర్ధరాత్రమునఁ బరువెత్తుకొని వచ్చిరి. రాజకుమారి యపహరింపఁబడినదని వారిడిన బొబ్బలువిని యదరిపడి పరువిడివచ్చిన జనము లా మాటనే పట్టుకొనిరి.

గంగాదేవి వామనభట్టునకు జరిగినదంతయు వివరముగాఁ జెప్పెను. అర్ధరాత్రమున శిబిరములయందు పరివారము హాహాకారములు

వినవచ్చెను. అంతఃపురమున సందులను దద్దరిల్లి మేల్కొనిరి. పరిచారికలు ద్వారము దెఱచినంతఁ బ్రాంగణమునఁ గాలకింకరులవంటి దొంగలు పదిమంది ప్రత్యక్షమైరి. కెవ్వునఁ గేకవైచి పరిచారికలు వెనుదిరుగునంతలో నాపదిమందియు మందిరముఁ జొరఁబడిరి. వారిలోఁ బెద్దదొంగ "రాజకుమారి యెక్కడ?" అని గద్దించెను. మాకు గుండెలలోఁ బిడుగు పడెను. లకుమాదేవి యాగజదొంగ యెదుట నిలువఁబడి "రాజకుమారితో నీ కేమిపని?" యని ధిక్కరించి పలికెను. "రాజకుమారి యేది?" యనివాఁడు మఱల హుంకరించెను. లకుమాదేవి కన్నులలో నిప్పులు గ్రక్కుచు "ఇదిగో" యనెను. వారామెను బట్టుకొని బలవంతముగ నెత్తికొనిపోయిరి.

ఔరా! లకుమాదేవి యెంతసాహసము చేసినది. రాజకుమారిని రక్షించుటకుఁ దన మాన ప్రాణముల నడ్డువైచినది! వామన భట్టు సంభ్రమాశ్చర్య పరవశుఁడై నిస్తబ్ధుఁడై పోయెను. గంగాదేవి "వామనయ్యగారూ! మేము మహాపచారము గావించితిమి. హీరాంబికను రక్షించుటకై లకుమాదేవిని బలిచేసితిమి. రాజకుమారిని నేనే యని యామె యా ఘాతుకులకు వశమగుచుండ గ్రుడ్లప్పగించి చూచుచుంటిమి. రాజకుమారి యామెకాదని యనలేకపోతిమి. వామనయ్యగారూ! సిగ్గుతో, దుఃఖముతో నా మనస్సు క్రుంగిపోవుచున్నది. ఆ ప్రేమమూర్తిని, ఆ త్యాగమూర్తిని స్వార్థముకొఱకుఁ జేతులార బలియిచ్చి యిఁక మేమేమని తలయెత్తుకొని తిరుగవలయును." అని విలపింపసాగెను. దుర్గ రోదనము పట్టరాకుండెను. హీరాంబిక తలవాంచి కన్నీరేకధారగాఁ గార్చుచుండెను.

"తల్లీ యిది దైవసంకల్పము. లకుమాదేవి మీ కొఱకు త్యాగముచేయలేదు. కుమారగిరిప్రభువుకొఱకుఁ జేసినది. కొండవీటి

కొలకుఁజేసినది. కాటయవేమారెడ్డికొలకుఁ జేసినది. కాటయవేమా రెడ్డి యామెకు దైవము. ఆ దైవమును దానై సుఖపెట్టఁజాలదు. తానేమైననేమి? హీరాంబిక కుశలముగ నుండవలయును. కాటయ వేమభూపతి సుఖము, కుమారగిరి మహీపతిశాంతి, కొండవీటిభద్రత హీరాంబిక చేతులలో నున్నవి. ఆమె గంగాదేవి చేతులలో నున్నది." ఇట్లనుచు వామనభట్టు తత్క్షణ కర్తవ్యము నాదేశింపుమని గంగా దేవి నర్థించెను.

"వామనయ్యగారూ! విద్యానగరము లకుమాదేవిని విడిపించి యిచ్చి హీరాంబికను విడిపించుకొని పోవును" అని గంగాదేవి దృఢ స్వరమునఁ బలికెను. హీరాంబిక కన్నీటిజడి మఱుగుననుండి గంగాదేవి ముఖమునఁజూపు నిలిపెను. వామనభట్టు గంగాదేవి వాక్యమునకు వ్యాఖ్యానము నామె ముఖమున వెదకికొనుచుండెను. ఆముఖము నిర్వికారముగనుండెను. "హీరాంబికను బట్టుకొనునంతటి నైచ్యమునకుఁ గొండవీడు పాలుపడదు తల్లీ" యని వామనుఁడు తలవంచుకొనెను. "కొండవీడు వచ్చి పట్టుకొనిపోనేల? హీరాంబిక తానేపోయి పట్టు వడును. ఆమె తనధర్మముఁ దానెఱుఁగదా? వామనయ్యగారూ! పల్లకి సిద్ధముచేయింపుఁడు." గంగాదేవి నిర్మలాంతరంగమునుండి యమృత బిందువు లొలికెను. హీరాంబిక వదనరంగమున విషాదవర్షాతిరస్క రిణి యపాకృతమై యానందశారదచంద్రిక నర్తింపసాగెను. హీరాం బిక గంగాదేవికంఠము పెనవైచుకొని చివురుదొడిగిన తేఁగీవవలె నామె నిలువెల్ల నల్లుకొనిపోయెను. విష్ణుపదమునుండి హిమశైల శృంగాగ్రమున నవతరించు నమరగంగాలహరినిఁ దిలకించు భగీరథుని వలె వామనభట్టు భయవిస్మయానందవిభ్రాంతుఁడై గంగాదేవి చరణ

ములకు సాష్టాంగ మెఱఁగెను. ముప్పూరయానందమును దిలకించి దుర్గ కన్నులలోఁ జికిలినవ్వులు మొగలిపువ్వులు విరిసెను.

కొండవీటిలోఁ గుమరగిరిమహీపతి యంతఃపురమున వీరాస్వామి నాదస్వరమున సీమంతపుఁబాట యమృతపుఁదేలవలె మల్లాంబిక మధురమూర్తికి జిలుగుమవ్వలువ యగుచుండెను. ప్రభువు నాశలు ఫలించినవి. మల్లాంబిక సీమంతపుఁ బెండ్లికూఁతురైనది. ఈవానకాలమంతయు గాటయవేమభూపతి మల్లాంబిక పరిష్వంగపంజరమునఁ గీరమై తియ్యని తేటమాటలతో మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్యానము పలుకుచుండెను. జడివానలలో, నడుగుపెగలని యసుసనేలలోఁ, గొండలలోఁ, గానలలోఁ గొండవీటిసేనల విన్యాసములు జరుగుచునేయుండెను ఉడుతల దండు పండ్లతోఁటల నూడ్చివైచినట్లు, మిడుతలదండు పైరుచేల తలలు నాకివైచినట్లు, ఉడుములదండు మేడలనెగఁబ్రాకివైచినట్లు కొండవీటి యడవులలో, మైదానములలోఁ గొండకొమ్ములలో సేనాదళములు చిత్రచిత్ర సమరపద్ధతుల నభ్యసించుచుండెను. అవచితిప్పయసెట్టి యనుపుచుండిన యాయుధములు, నశ్వములు వారమునకొక నంతుగా వచ్చి చేరుచుండెను. అన్నయమంత్రికి జతనము పెద్దిరాజునకు, మామిడి ప్రెగడయ్యకుఁ జేతినిండుగాఁ బనియయ్యెను.

భాద్రపదశుద్ధ చతుర్థి. కుమరగిరి మహీపతి యొకక్రొత్త శిల్పమునకు విఘ్నేశ్వరపూజ యాచరించెను. కాటయవేమారెడ్డి శాకుంతల మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్యానముల ప్రతులకుఁ బసపుగుంకుమలు, గంధాక్షతములు నలంకరించి గణపతి మంటపముపై నుంచి యర్చించెను. సైనికులు ముసలముద్గరకుంత తోమరకరవాల భిండివాలాది సమర పరికరముల నలంకరించి యర్చించిరి. కర్షకులు జడ్డిగములపై మృణ్మయమైన యీశపుత్రుని ప్రతిమనుంచి యేకవింశతిపత్రములఁ బూజించిరి.

మూషిక వాహనమునకు మోదకములు నివేదించిరి. పార్వతీశనయు నకుఁ బప్పుబెల్లములుఁ బానకములునర్పించిరి. శ్యమంతకవృత్తాంతమును శ్రద్ధమై నాలించి శ్రీమహాగణపతి ప్రసాదమును శిరముల ధరించిరి.

అర్ధరాత్రమున నిరువురాశ్వికగూఢచారులు కొండవీటి కోట వాకిట వ్రాలిరి. ద్వారపాలకు లభిజ్ఞానముద్రికలఁ బరీక్షించి వారికిఁ బ్రవేశమిచ్చిరి. కాటయవేమభూపతి గాఢనిద్రలోఁ ద్రుళ్ళిపడి లేచెను. "త్రిపురాంతకమునఁ దిప్పానాయకుఁడు తిరుగుఁబాటుచేసెను. రాయప నాయకునిఁ గారాగారమున నంచెను. వెలమవీరులు కృష్ణవేణిదాఁటి బెలబెల వచ్చిపడుచుండిరి." క్షీరసాగరమున శేషశాయికి నిశాట సంరంభమున నిద్రాభంగ మయ్యెను. పుండరీకములఁ బురుడించు నా దేవుని నేత్రములు ద్వాదశాదిత్యులు, నిటలమున నేకాదశరుద్రులు నుదయించిరి. చతుర్భుజముల శంఖచక్ర గదా ఖడ్గములు ధరించి శ్రీమన్నారాయణుఁడు దనుజాలంభ సంరంభియయ్యెను. ఆయన వెనుకఁ దోకపై నిల్చి వేయిపడగలువిప్పి శేషాహి విశ్వమంతేయు నావరించెను. ఆ సంరంభమునకుఁ గొండవీడంతయు నదిరిపడి నిదుర మేల్కాంచెను. భాద్రపదశుద్ధ పంచమినాఁడరుణోదయవేళఁ గాటయవేమభూపతి త్రిపు రాంతకము మీఁదికి దండువెడలెను. ఆయనవెనుక వేయిమంది యాశ్వి కులు. ఆ వెనుక నేఁబదివేల కాల్బలము. సప్తమినాఁడు తెల్లవారు సరికిఁ గొండవీటిసేన త్రిపురాంతకదుర్గమును గొండచిలువ వలెఁ బెన నైచుకొనియుండెను. ప్రాటివంతెనమీఁదను, బుట్టీలమీఁదను వెలమ వీరులు వఱదపొంగులు నుఱుకులెత్తు కృష్ణవేణిదాఁటి వచ్చుచుండిరి కోటవెలుపల వెలమమూకలకు రెడ్డిమూకలకుఁ దుములముగ దొమ్మి సాగుచుండఁ బ్రెగడయ్యగారు కొంతదండుతోఁ బ్రాటివంతెన కెగఁబ డెను. వంతెనత్రాళ్ళు దెగనఱికించుట కాయన కరగడియయుఁ బట్ట

లేదు. వంతెన కృష్ణార్పణమయ్యెను. పుట్టీలపై దాటివచ్చుజంటవీరుల నీవలియొడ్డున నిల్చిన జెట్టివిలుకాండ్రు పొట్టఁబెట్టుకొనిరి. వెలమ మీద మఱఁచుటకును, త్రిపురాంతకదుర్గ ద్వారములు దెఱిపించుటకును గాటయవేమభూపతికి గడియసేపు పట్టలేదు.

గంగాదేవితో నాలోచించి వామనుఁడు కార్యవిధానము నిర్ణయించుకొనెను. భిల్లనాయకులను బిలిచి వెలమదొరలు విద్యానగర రాజకుమారి నపహరించిరనియుఁ గొండవీటినుండివచ్చిన లక్ష్మాదేవిని దగురక్షణతోఁ గొండవీటికిఁ జేర్పవలయుననియు వారికి నమ్మఁజెప్పి లక్ష్మాదేవిని సురక్షితముగఁ గుమరగిరిమహీపతి కప్పగించినచో గొప్ప బహుమానము లభించునని యాసపెట్టెను. పల్లకులు సిద్ధముచేయించి గంగాదేవిని, హీరాంబికను, దుర్గను, నెక్కించి నూర్వురు కోయదొర లను దోడిచ్చి వారిని గొండవీటికిఁ బయనము చేయించెను. పరివార మంతయు మడిసెఁ గదా! పరిచారికలు పదిగుందియుండిరి. వారికిఁ గోయలను గాపువెట్టి యర్చకున కప్పఁజెప్పి వామనుఁడు తిరిగి విద్యానగరమునకు దప్పుకుతీసెను. తనకంటె ముందుగా రాజకుమారికాపహరణవార్త విద్యానగరము చేరరాదు. కొండవీడే యీపని చేసెనను నాగమణికొండెములు తలకెక్కినా రాయలవారి మనస్సు మఱలించుట హరిహరాదులకుఁ గాదు. ఆయన తత్త్వమట్టిది. ఆయన పట్టిన దేపట్టు. ఆపట్టు విడిపించఁగల గంగాదేవి యచ్చట లేదాయె. ఎంత తెక్కలపై నెగిరివచ్చినను దనకంటె ముందే యావార్త విద్యానగరమున వ్రాలినది. నగరము గందరగోళముగ నున్నది. వామనభట్టుతిన్నగా డిండిముల యింటికిఁబోయి యసలు విషయ మాయనకు వివరించెను. ఆయనను వెంటఁ బెట్టుకొని యిరుగప్ప దండనాథుని మందిరమునకుఁ బోయెను. ఆయన ప్రభుమందిరమున కేఁగియుండెను. వామనభట్టు

నాగమణి సౌధమునకు త్రోవతీసెను. ప్రభువు పిలిపింపఁగా నామెయు రాజభవనమునకే పోయియుండెను. తనకొంప మునిఁగిపోవుచున్నట్లు దాసి వామనభట్టును గాంచి లబలబ మొత్తుకొనెను. "లేఖను సంగ్రహించితివా?" యని వామనభట్టామె నాతురతతోఁ బ్రశ్నించెను. ఆమె కంచుకమున దాఁచియుంచిన లేఖ నాతనిచేతిలో నుంచెను. వామనునకుఁ బ్రాణములు నిలువఁబడెను. బ్రహ్మాస్త్రము తనచేతికిఁ జిక్కినది. తానింకఁ ద్రిపురసంహారము గావింపఁగలఁడు. పరిదీనమూర్తి యగు వామనుఁడు ప్రళయ రుద్రాకృతి యయ్యెను.

హరిహరరాయలు నాలోచనామందిరమున నుండిరి. వామనభట్టు డిండిములను, దాసిని వెంటనిడికొని యాలోచనామందిరమున కల్లంతదవ్వులఁ దమ్ము నిలువరించిన కావలివానిచేఁ దన యాగమన వార్త ప్రభువునకుఁ బంపెను. వామనభట్టు పేరువిని రాయలు భగ్గున మండిపడెను. వామనడిండిము లాలోచనామందిరము ప్రవేశించిరి. రాయలవారు కన్నుల నిప్పులు చెఱుగుచుండిరి. సాయణమాధవులు, ముద్దప్ప, మునగప్ప మొగములు జేగురించియుండిరి. నాగమణి యలంకారములు సవరించుకొనుచు నాలోచనామందిరము తన శయనాగారమన్నట్లు సొగసులు పోవుచుండెను.

హరిహర :— వామనభట్టూ!

వామన :— ప్రభూ!

హరిహర :— రాజపుత్రిని, మహారాణిని గొండపీటి కప్పగింత పెట్టితివిగదా! ఇంకెవరికోసము వచ్చితివి?

వామన :— అట్టి యపరాధము చేసి మరలఁ దమ కంటఁబడుదునా? ప్రభూ?

హరిహర :— వామనభట్టూ! నాదములతో మాకుఁ బనిలేదు. నేఁడు నీ మేనుతుంచెదము నేలరాలును. తేపు కొండవీటి కోటగోడలు ఖండఖండములై నేలఁగూలును. ఎవఁడురా అక్కడ!

యమదంష్ట్రలవంటి యిరువురుభటులు వామనభట్టు నిరుదెసలఁ బొడివినిలిచిరి. సాయణాదులు నిర్విణ్ణులైరి.

వామన :— ప్రభూ! ఈలేఖను చిత్తగింపుఁడు. అని యఱచేత డాఁచియుంచినలేఖ నాతఁడు ప్రభువునకుఁ జూపెను. హరిహరరాయల వారాలేఖను జదువుకొనుచుండెను. ఆయన ముఖమున నలుపు, తెలుపు నీడలు క్షణక్షణమునకుఁ దారుమారగుచుండెను. ఆయన లేఖను సాంతముగఁ జదువుకొనలేదు. దాని నెడమకాలి నేలరాచుచు నాయన నాగ మణిని గాల్చివేయునట్లుచూచెను. ప్రభువు నుగ్రరూపముగాంచి నాగ మణి వడవడ వణఁకిపోయెను. తత్తరమెత్తి యామె పరునెత్తఁ జూచు చుండెను. రాయలవారి కన్నుబొమ్మలామె కాలుసేతులుగట్టి ముడి వైచెను. ఆయన గ్రుడ్లుఱిమిచూచెను. ఆచూపుత్రోపున నామె తల వరులచేతులలోఁ దూలిపడెను. సాయణమాధవు లోకధర్మము నిలిచి నంత సంతసించెను. డిండిములోక పండితుని గెలిచినంత పొంగిపోయెను. "ప్రభూ! కుమరగిరిరెడ్డి ధర్మప్రభువు. కొండవీడు కళాక్షేత్రము. కాటయవేమభూపతి కార్యకార్యవివేకశాలి. కొండపల్లి పాములపుట్ట. కోమటిరెడ్డి కుటిలవర్తనుఁడు. విద్యానగరమునకు విషమెక్కింప నాతఁడు పంపిన నాగుపాము నాగమణి." యని విన్నవించి, వాకిట నున్న దాసిని రాయలకుఁజూపి "కొండవీడు దీనిఋణము నెట్లు తీర్చు కొనునో" యనెను.

మఱునాఁడుదయమున నాగమణి సుకుమారశరీర ముప్పు పాతి టిలో నూరుచుండెను, విద్యానగరసేనలు వెలమరాజులపై దాడి

వెడలుచుండెను. లక్షకాల్బలము, ఐదువేల యశ్వబలము, వేయిగజ బలము ఇదిరాయలవారి మూలబలము. తుంగభద్రపొంగినట్లు త్రెంచుకొని వఱదలుపాతెనో యన విద్యానగర సేనావాహిని నఱువులు గ్రక్కుకొనుచుఁ గందనవోలుమీఁదుగా నుఱికివచ్చుచుండెను. విద్యానగరమునకు, విద్యారణ్యులకు జయజయధ్వానములు చెల్లరేచుచు వామనభట్టు సేనాగ్రమునఁ గాహళపూరించుచుండెను.

౧౯

భాద్రపదశుద్ధదశమినాఁటి సాయంకాలమున నూఱ్వురు కోయదొరలు మూఁడు పల్లకులతోఁ గొండపీటఁ బ్రవేశించిరి. అందొక పల్లకి లకుమాదేవిది. అది కొండపీట నాబాలగోపాలమునకుఁ బరిచితమైనదే. మూపులపై మొగలిపొత్తికలమోపులు, శిరములపై వెలగ, నారింజ, దబ్బ, యనంటిపండ్ల గంపలు, కక్షములఁ బుట్టతేనె తిత్తులు, బుజములపై నెమలియీఁకలకట్టలు మోసికొనివచ్చు కోయదొరలఁ గాంచి లకుమాదేవి యహోబిలమునుండి యీ సరకులు కొనివచ్చుచున్నది కాఁబోలునని యందఱు ననుకొనిరి. మిగిలిన రెండు పల్ల లెక్కడివో వా రూహించుకొనలేకపోయిరి. ఆ పల్లకుల నొకటిచీపదువురు కోయలతో నరియేటి యన్నయమంత్రిగారి యింటి దిక్కునబోయెను. తక్కినవి రాజభవనమునకుఁ బోయెను. పల్లకులు రాభవనద్వారమున దింపించి కోయనాయకుఁడు కుమరగిరి మహీపతిదర్శ మపేక్షించెను. ప్రభువాతనికి దర్శనమిచ్చెను. కోయదొర ప్రభువు చేకొక లేఖ యందిచ్చెను. ఆలేఖ వామనభట్టు కాటయవేమారెడ్డికి వ్రానది. ప్రభు వీవార్త వినినఁ గలఁతపడిపోవునని వామనభట్టు లేఖ కాటయవేమారెడ్డికే వ్రాసెను. వామనభట్టు చేవ్రాలుచూచి ప్రభు వా లేఖనఁజదువుకొనెను. ఆయనగుండె జల్లుమనెను. లకుమాదేవి సాహసమునకు

త్యాగమునకు నాయన బ్రహ్మానందమందెను. ప్రతిపక్షుల చేఁజిక్కిన యామె యెట్టిబాధలపాలగునోయని యాయనకుఁ బ్రాణములు పోవునంత భయమయ్యెను. ఇంతలో నింకొక యుత్తరము చేతఁబట్టుకొని యన్నయమంత్రిగారు పరువిడి వచ్చిరి. తాననుకొన్నట్లే ప్రభువు మోమున దైన్య మలముకొనినది. అన్నయమంత్రిని జూడఁగనే ప్రభు వెదురేఁగి తన చేతిలేఖ నాయనకుఁ జూపించెను. అన్నయమంత్రిగా రా లేఖను జదువుకొని తన లేఖాంశములను బ్రభువునకు వివరించెను. ప్రభువు మల్లాంబికకు ముందుగా రాయప్పచే వర్తమానమంపి గంగాదేవిని, హీరాంబికను గాటయవేమారెడ్డి భవనమునకుఁ బంపెను. ఆయన హృదయ మంతయు లకుమాదేవి యావరించెను. ఆమె కేమగునో యనున దొక్కఁడే యాయనభయము. కోయనాయకుని సేవను బ్రశంసించి యుచిత సత్కారములచే నాతనిని సపరివారముగ సంతోషపఱచి పంపివైచి కుమారగిరి ప్రభువు గోపాలనామస్మరణము గావించుకొనుచు నంతఃపురమున నేమియుఁ దోచక నటునిటు దిరుగుచుండెను.

మల్లాంబిక గంగాదేవికిని, హీరాంబికకును నాదరముగ స్వాగతి నెఱపెను. కాటయవేమారెడ్డి యంతఃపురమున వారిని విడియించెను. వారికిఁ బ్రత్యేకము పరిచారికావర్గము నియమించెను, అనుక్షణము వారియవసరములు గనిపట్టుచు వీసమంతయేని లోపము రానీక కాపాడుచుండెను. లకుమాదేవి యామె కిప్పుడు సంపూర్ణముగ సఖ్యమైనది. కొండవీటి కోట కామె చేసిన సాహసము, కాటయవేమారెడ్డి కొఱ కామె చేసిన త్యాగము మల్లాంబిక మాటిమాటికిని స్మరించుకొనుచు ముగ్ధురాలగుచుండెను. లకుమాదేవి తీరనికోరికలు హీరాంబికయై వచ్చి నట్లామెకుఁ దోఁచుచుండెను. దుర్గ కాలమంతయు నచ్చటనే వెళ్లఁబుచ్చుచు మల్లాంబిక సంగీతవిద్యా ప్రశస్తి హీరాంబిక యెదుటను,

హీరాంబిక సాహిత్యవిద్యా ప్రశస్తి మల్లాంబిక యెదుటను జరుపుచుం డెను. గీతగోవిందగానములతో హీరాంబికను, కాళిదాస శ్లోకపారిణము లతో మల్లాంబికను మురిపించుచుండెను. భిల్లనాట్యాభినయములతో నిరువురను గలిపి యలరించుచుండెను.

చందవోలుసేన లద్దంకి కందుకూరులఁ (బోగైన యదనపు) సేన లతో నాగార్జునకొండకుఁ జేరవలెను. వినుకొండ బెల్లంకొండ సేనలు కొండపల్లిలో నుండ నేయున్నవి. కోరుకొండ రాజమహేంద్రవర సేనలు పాపికొండలప్రాంతముల నమీపింపఁబడవలెను. అల్లాడరెడ్డి యదును చూచి వానిని రాజుకొండమీఁదికి నడిపింపవలయును. ఈయేర్పాట్లెంత వఱకేట్లుగా నడచుచున్నవో కాటయవేమారెడ్డి యేగడీయ కాగడీయ విచారించుచునే యుండెను. త్రిపురాంతకము వశమైనపిమ్మట నాయన తనసేనలను శ్రీశైలమువఱకు నడిపించెను. గజరావు తిప్పఁడు తప్పించు కొనిపోయెను. రాయపనాయకుఁడు వానిపైఁ గారములు మిరియములు నూరుచుండెను. కృష్ణదక్షిణమునఁ గొండవీటిసేనలు, కృష్ణయుత్తర మున రాజుకొండసేనలు, మీసములు మెలివెట్టి మిఱ్ఱిమిఱ్ఱిచూచు చుండెను. కరకరనూరినకత్తులు తళతళ మెఱపించుచుండెను. శ్రీశైల నాగార్జునకొండలనడుమఁ గాటయవేమారెడ్డి కృష్ణవేణీతీరము నసివారు లుగా నేగుచుండెను. తానే యగస్త్యుఁడైనచో నీపాటికిఁ గృష్ణ వేణీజలము లాపోశనము పట్టియుండును. వెలమసేనను గబళించి గట్టునఁ ద్రేన్చియుండును. రాజుకొండ దేవరకొండలను బాతాళమంట నణఁగఁద్రొక్కియుండును.

విద్యానగర సేనలు వెలమరాజ్యముమీఁదికి వచ్చుచున్నవని వేద గిరినాయనికి వేగరులు వార్తలు దెచ్చిరి. కందనోలునకు రెండామడల దిగువ గాఁగృష్ణవేణి నుత్తరించినవి. వేదగిరినాయకుఁ డీవార్త రాజు

కొండకుఁబంపెను. విద్యానగరసేనలు రెండుపక్షములపైఁ బడియుండుటచే క్రొత్తకొండయందలి బహ్మనీ సుల్తానుసేనలకుఁ దోడుగా దేవరకొండ నుండి కొంతసైన్యము పోవలయును. ఆసేనకు నాయకులు వేదగిరి నాయకుఁడు వీరభద్రుఁడు. సింగమనాయకుఁడు, కోమటివేముఁడు రాజుకొండలలోనుండిరి. పిలుచూచి కొండపల్లెదిక్కునకుఁ బోవ వలెనని వారియూహ. క్రొత్తకొండలో యుద్ధము ప్రారంభమైనది. ఐదుదినములు తుములముగ సమరము జరిగినది. ఆసమరమున కొక దారియుఁ దెన్నునులేదు. మీఁద జడివానలు, క్రింద పెనుఱొంపులు గడియసేపు పోరాటమునకు జామునే పారాటము. కోటలోని సైన్యము నకుఁ బనియేలేదు. ప్రాకుపట్టి పచ్చగానున్న కోటగోడల కెగఁబ్రాకు శత్రువుపనుఁడే లేఁడు. తడియారనితలలో ప్రాచిపోవుపాదములతో, నెమ్ము కలుగుచుండు నీముపగాలులలోఁ, జెళ్లునఁ జఱచు జల్లువానలలో విద్యా నగరసేనలు రోగములచే సగముచచ్చుచుండెను.

పూర్ణిమనాఁడు పాపికొండలలో గోదావరిదాఁటి యల్లాడరెడ్డి యావైపునఁ జొచ్చుకొనివచ్చెను. సింగమనాయకుఁడాయన కడ్డుతగి లెను. కోయకొండవీరులు జలదుర్గ విభాగవిరుదాంచితులు. తెప్పలు, నావలు వారికి లెక్కలేదు. అల్లాడరెడ్డి సేనలోఁ గోయమూకలు దండిగా నుండెను. తెరిపియిచ్చినంతసేపు దొమ్మి పోరాటము. ముసురు పట్టినంతసేపు శరవర్షము. కోయదండే యల్లాడరెడ్డికిఁ గొండంతయండ యైనది. మన్యప్రాంతములఁ బుట్టి పెరిగిన కోయమూకలు జలుబులను దిగమ్రింగును, జ్వరములను జీర్ణము చేసికొనును.

విదియనాఁడు కాటయవేమారెడ్డి కొండవీటి సైన్యములను కృష్ణదాటించి దేవరకొండకుఁ బట్టించెను. దేవరకొండకుఁ గాపులగా నన్నెదేవచోడుఁడు కొలఁదిసైన్యముతో నుండెను. కాటయవేమారెడ్డి

లక్షసేనతోఁ గోట ముట్టడించెను. జడివానకు వెనుకాడక నడురేయిఁ గటికిచీకటిలోఁ గోటకు లగ్గలు పట్టించెను. నడుములకుఁ బగ్గములు బిగించి యుడుములను గోటగోడల కెగఁబ్రాకించెను. పగ్గములవెంట నుక్కుతునకలవంటి యేకాంగవీరులను గోటమీఁది కెక్కించెను. ఆవీరులు పిడిచిన త్రాటి నిచ్చెనలవెంట జట్లుజట్లుగా జెట్టివీరుల నెక్కించెను. రెండుగడియలలోఁ గోటగోడలనిండఁ గొండవీటిదండే నిండిపోయెను. పైనుండి దొరలునవి బండఱాలో, శత్రుశిరాలో, మీఁదినుండి కురియునవి వర్షధారలో వైరులరక్తధారలో! తెలతెలవాఱుచుండ దేవరకొండ కోటతలుపులు తెఱచుకొనెను. అన్నెదేవరచోడఁడు పట్టువడెను.

వేదగిరినాయకున కీ వార్త తెలిసి కొంతసైన్యముతో నాతఁడు వచ్చిచేరునప్పటికి రెండుదినము లయ్యెను. సింగమనాయకుఁడు కోమటి వేమారెడ్డితోఁ గొంతసేనను బంపెను. ఆసేన నాల్గవనాఁటికిఁ జేరెను. కొండవీటి సైన్య మంతయుఁ గోటలో నుండెను. వేదగిరినాయకుఁడును గోమటివేమారెడ్డియుఁ గోటబయట గొల్లెనలెత్తి విడిసి కూర్చుండిరి. వెలమసేన సగము వెనుదిరుగుటలో విద్యానగరసేనలు విజృంభింప సాగెను. కొత్తకొండసేన లీయొత్తిడికాగలేక కోటలోఁ దూరి తలుపులు బిగించుకొనెను. కోటముట్టడి కెలగోలుమూకల నట్టెయుంచి దేవరకొండ దిక్కున నాశ్వదళమును, గజదళమును, గరవాలబలమును సెలగోలబలమును దరలింపవలెనని హరిహరరాయలు నిశ్చయించెను. హీరాంబిక దేవరకొండలోనున్నదో, రాజుకొండలోనున్నదో యాయనకుఁ దెలియలేదు. క్రోధావేశమున నాయన వేళగానివేళ దండువచ్చెను. వర్షకాలపు యుద్ధ మాయన కనుభవమయ్యెను. వచ్చినసేన సమరమునఁ జావలేదు. జబ్బులకుఁ జచ్చెను. ధైర్యముతూలి తాను కాలు వెన

కాడు వేళకుఁ గొండవీటిసేనలు దేవరకొండ ముట్టడించెను. ఆయన గుండెలకు నిబ్బరము కలిగించెను. వామనభట్టాయన వెనువెంటనే యుండి యంతయు జోస్యము చెప్పినట్లు చెప్పుచుండెను. కాటయవేమ భూపతి దేవరకొండ కోటలోఁ జేరెను గదా! తాను కోటబయటి ముట్టడి సేనలను మట్టుపెట్టవలెను.

కోమటివేమారెడ్డికి గుండె జారిపోవుచుండెను. తానొకటి తలఁచిన దైవ మొకటి తలఁచినట్లయినది. ఒకదిక్కున హరిహరరాయలు, నింకొకదిక్కున నల్లాడరెడ్డి, యిరువురి నడుమఁ గాటయవేమారెడ్డి — మూఁడు మొనలుగాఁ దాకుదురని యాయన యూహింపలేదు. పరమేశ్వరుఁడు తనఫాలముపైకిఁ ద్రిశూలమునఁ బొడువఁబోవు చున్నాఁడా? బహుళపంచమినాఁడు కొండపల్లి సేనలతో భీమదేవచోడఁడు దేవరకొండ తూర్పుదిక్కునఁ దాకెను. పడమట హరిహరరాయల సేనలు, తూర్పున భీమదేవచోడని సేనలు. పెదవేదగిరియుఁ గోమటివేముఁడును జక్రబంధనమునఁ జిక్కుకొనిరి. పెదవేదగిరినాయకుఁడు ధర్మదార యూదించెను. కోమటివేమారెడ్డి రాయబారము పోవలెను. ఆయనకుఁ దల తీసివైచినట్లుండెను. యుద్ధమునకుఁ దానే మూలము. సంధిబేరమునకుఁ బోక తనకెట్లు తీరును?

కోమటివేమారెడ్డి హరిహరరాయలవారిని దర్శింపఁబోయెను. రాయలు నిలువెత్తు గద్దెపైఁ గూర్చుండెను. కోమటివేమారెడ్డి యంత పైకిఁ దలయెత్తి చూడలేకపోయెను. "మిమ్ము క్షమింపవలసినది మేము కాదు. కాటయవేమభూపతి" యని మందలించుచు రాయలవారు కోమటివేమారెడ్డిని వెంటఁబెట్టుకొని కోటలోనికిఁ బోయెను. హీరాంబికసంగతి రాయల వా రాతని నడుగలేదు. ఆమె విషయము కాటయవేమభూపతియే చూచుకొనును. దుర్గద్వారమునఁ గాటయ

వేమభూపతి హరిహరరాయలవారి కెదురువచ్చి యభివాద మొనరించెను. ఆయనయీూ ర్తిమత్వము రాయలవారిని ముగ్ధుల నొనర్చెను. రాయలవారాయన నాలింగనము చేసికొని యానందాశ్రువుల నభిషేకించెను. కోమటివేమారెడ్డికిఁ దల గ్రుంగిపోవుచుండెను. కాటయ వేమారెడ్డి "వేమయ్యగారూ! రాజకుమారి యెచ్చట?" నని ప్రశ్నించెను.

కోమటి :— ఆమె రాజకుమారి కాదు.

కాటయ :— అనఁగా?

కోమటి :— లకుమాదేవి.

కాటయ :— మీరు పొరపడుచున్నారు.

కోమటి :— పొరపాటుననే యామె లకుమయైనది.

హరిహరరాయల కంతయు నగమ్యముగ నుండెను. కాటయ వేమారెడ్డి కాశ్చర్యముగ నుండెను. "ఆమె యెచ్చటనున్న" దని యాయన కోమటిరెడ్డిని బ్రశ్నించెను. "పాతాళగృహమునం" దని యాతఁడు తడఁబడుచు బదులుచెప్పెను. ఒక యరగడియలో నామె యచ్చటికిఁ బ్రత్యక్షమయ్యెను. హరిహరరాయ లామెనుగాంచి యాశ్చర్యచకితుండయ్యెను. హీరాంబిక యింత పెద్దదెప్పుడయ్యెను? లకుమాదేవి నడచిన కథయంతయు వివరించెను. కాటయవేమారెడ్డి ప్రశంసామధురసుందరహాసమున లకుమాదేవిని లాలించెను. హరిహరరాయలవారామె యద్భుతసాహసౌదార్యముల నభినందించెను. "ప్రభూ! హీరాంబికను గొండవీటికర్పించి నన్ను విద్యానగరమునకుఁగొనిపొండు. నేను మీకు దైవదత్తయగు పుత్రికను" అనుచు లకుమాదేవి రాయలవారి పాదములచెంత మోకరిల్లెను. హరిహరరాయలవారామె నాశీర్వ

దించి "తల్లీ! అహోబిలనృసింహదేవుఁడే హీరాంబిక నత్తవారింటికంపించెను. మనమాస్వామి యాదేశము శిరసావహించి యానందింపఁదగినవారముమాత్రమే" యనెను.

వామనభట్టీ శుభవార్తను మోచికొనిపోయి కుమారగిరిమహీపతికి నివేదించెను. ఆయన మల్లాంబికను బిలిపించి యావిషయము నెఱిఁగించెను. ఆమెయానందముతో నెగిరిపోయి హీరాంబికను గౌఁగిలించుకొనెను. కొమార్తె కళ్యాణవార్తవిని గంగాదేవి పొంగిపోయెను. మల్లాంబిక వామనభట్టునుజూచి "వామనయ్యగారూ! కొండవీటికి మీరు కళ్యాణదూతలైతిరి." యని యభినందించెను. "తల్లీ! ఇది యంతయు నీనోటి చలువయే! ఆనాఁడు నాగళమందలి బిరుదపతకమునుగాంచి "ఈమంగళసూత్ర మెవరుకట్టిరి?" అని నీవు చమత్కరించితివి. "హరిహరరాయలవారుకట్టి" రని నేను హాస్యమునకంటిని. "కొండవీటికి విద్యానగరమునకుఁ బెండ్లిచేసితివన్నమాట" యని నీ భర్త వ్యాఖ్యానము చేసెను. ఆవ్యంగ్యమీశృంగారమైనది. అమ్మా! నీహృదయ మమృతముగనుక సర్వము నిట్లు సరసముగఁ బర్యవసించినది" అని వామనభట్టు మల్లాంబికను గొనియాడెను.

విజయవార్తయుఁ గళ్యాణవార్తయుఁ గొండవీట జాజిపూల వాసనవలె గుప్పున వ్యాపించెను. విజయలక్ష్మీ స్వయంవరశోభన మూర్తియయి కాటయవేమారెడ్డి కొండవీటికిఁ దిరిగివచ్చును. ఆయనకు స్వాగతమొసంగుటకై కొండవీడు మంగళాకృత మగుచుండెను. త్రయోదశినాఁటి యుదయము కొండవీటి దుర్గప్రాంగణమున వెలిమంచు తెఱమఱుఁగునఁ గొండవీటినగరలక్ష్మి క్రొత్తపెండ్లికూఁతురువలెఁ గులుకుచుండెను. కాటయవేమభూపతి కతిపయపరివార పరివేష్టితుఁడై పంచకళ్యాణిపైఁ దురికినడకలు వచ్చుచుండెను. వీరాస్వామి మాయూ

మాళవగౌళ రాగాలాప మాయనకుఁ జల్లగా స్వాగతము పలుకు చుండెను. స్వర్గ ప్రాంగణమునఁ గుమరగిరి మహీపతి యాయన కాలింగ నములతో నానంద బాష్పములతో నర్ఘ్యపాద్యము లర్పించెను. మంగళ వాద్యములు జయజయధ్వానములు శ్రవణశుభగములై ధ్వనించి హృదయరంజకములై ప్రతిధ్వనించెను.

కాటయ వేమభూపతియు నల్లాడ రెడ్డియు పరివారముతోఁ బ్రభు మందిరమునకరిగి ముహూర్తకాలమాయనతో ముచ్చటించిరి. ముఖ్యాంశముల నాయనకు విన్నవించిరి. ప్రభువునక వియన్నియుఁ బట్టినవారై ఆయన యానందమునఁ బరవశుఁ డగుచుండెను. ఈకథ నిట్లు నడిపించుచున్న దైవలీలావిలాస మాయన యంతరంగమంతయు నావరించి యుండెను. ఆదైవ మాయన నేత్రేంద్రియమంతయు నిండియుండెను. అల్లాడ రెడ్డికిఁ గుమరగిరిప్రభుని యార్ద్రహృదయత్వానాశ్చర్యము గలిగించెను. ఆ యమృతహృదయుని సుకుమారభావనాస్పర్శచే గండశిలలు కూడ కరిగి కళాఖండములై రసము చిప్పిలుటలో నాశ్చర్యమేమున్నది! ప్రభువెట్టకేలకుఁ గాటయ వేమభూపతికి స్వభవనమున కరుగ ననుమతించెను. వేమభూపతి వెడలిపోయినంతనే ప్రభువుహృదయమున లకుమాదేవి నిండిపోయెను. లకుమాదేవి తనకుఁ బ్రాణము. ఆమె నేఁడు కొండవీటికే ప్రాణమైనది. కొండవీటి విజయసేనావాహినిపై నామె రాజహంసవలెఁ దేలివచ్చుచున్నది. కొండవీటికి శరల్లక్ష్మివలె విజయోత్సవసంభారములు తెచ్చుచున్నది. ఆమె కాంచనపల్యంకి కావాహకుల ఝాంకారమనోహరనాదములు క్షణక్షణమును సన్నిహితతరములగుచుఁ బ్రభువు శ్రోత్రేంద్రియమునకుఁ జల్లఁగాఁ దగులుచుండెను.

కాటయ వేమభూపతి భద్రతురంగ రింగణ మృదంగ ధ్వనులు మల్లాంబిక హృదయమున ననురణితములై శృంగారము పొంగించుచుం

డెను. ప్రాంగణమునఁ దురంగము నవరోహించిన పతికి మల్లాంబిక పాదములు గడిగి తడియొత్తెను. కంఠమునఁ గెంపుకేళికాహారము నలంకరించెను. కన్నులకుఁ గస్తూరనీరాజన మర్పించెను. కాశ్మీరకుసుమపాండరములైన యామెకపోలములపైఁ గాలయవేమభూపతికటాక్షములు లిందీవరములై విరిసి యానందమకరందములు చిందెను. ముఖశాల యతిక్రమించి యాయన తన యంతఃపురమున కరుగుటకై దక్షిణాభిముఖుఁడగుచుండ మల్లాంబిక మందహాసముతోఁ "ప్రభువుల యంతఃపుర మన్యాక్రాంతమైన" దనెను. ఆయన తటాలునఁనాగి "అయినచోఁ బట్టపుదేవి యెట్లూరకున్నది?" యని ప్రతిహసించెను. "ప్రభువు లెట్లు స్వాధీనముచేసికొందురో చూడవలెనని యూరకున్న" దని మల్లాంబిక యుపహాసము గావించెను.

శరత్కాలనిర్మలనదీ ప్రవాహమువలె విజయానందభారసుందరమందగామినియైన కొండవీటిసేనావాహిని యాశ్వయుజ ప్రారంభమునఁ గొండవీడు చేరుకొని కోటకుఁ బ్రాగ్దక్షిణాదిశల మహాసముద్రమువలె విడిసియుండెను. కోటబురుజులపై నెక్కి జనము తండోపతండములుగ నా సేనాసముద్రమును దిలకించుచుండిరి. అల్లాడరెడ్డి యా దృశ్యమును దిలకించి తాను రాజమహేంద్రవరమున నుంటిననుకొనెను. పర్వతపంక్తులే పెట్టనిగోడలై గిరిశిఖరములే కట్టనిబురుజులై పరమేశ్వరుఁడీ కొండవీటిదుర్గమును కుమరగిరి మహీపతి కొఱకే నిర్మించెఁ గావలె. ఆయన సుందరకళా స్వప్నములకు సరిపడునట్లుగా ననపోతమహీపతి యీ గిరిదుర్గమును రాజధానిగా వరించెను.

కుమరగిరిప్రభువు నిముసమేని లకుమాదేవిని విడిచియుండలేకపోవుచుండెను. ఆమె యహోబిలమున కరిగిననాఁటినుండి నేఁటివఱకు నడచిన కథయంతయు తూచాతప్పకుండఁ దన కామె చెప్పవలెను.

చెప్పినదే మరలమరలఁ జెప్పవలయును. ఆ చెప్పినదంతయుఁ దనకన్నులఁ గట్టవలయును. హీరాంబికతో నామె యెట్లు కాలము పుచ్చెను? ఆ నవ్వులు, ఆ మాటలు, ఆ పాటలు, ఆ గుసగుసలు సర్వమునామె యప్పు డభినయింపవలెను. వీరభద్రుఁ డపహరింప వచ్చినప్పు డామె యేమి చేసెను? ఆ భయము, ఆ యాందోళనము, ఆ యాకోపము, ఆ దీక్ష, సర్వము నామె యప్పుడు మరల నభినయింపవలెను. కోమటివేమారెడ్డి తన్నవమానింపవచ్చినప్పు డామె యెట్లయ్యెను? ఆ యభిమానము, ఆ జుగుప్స, ఆ క్రోధము, ఆ యవధీరణ — సర్వము నామె యప్పు డభినయింపవలెను. పులివాతికిఁ దప్పి బ్రతికివచ్చిన యామెను జూచుకొని కుమారగిరిప్రభువు వాత్సల్య రసకల్లోలినియై పోవుచుండును.

## ౨౦

శరదుత్సవము లుత్సాహాభరితములై జరుగుచుండెను. నగరి వాకిటమైదానమున దేవీమూర్తి ప్రతిష్ఠింపఁబడెను. మైదానమున నచ్చటచ్చటఁ గుమరగిరి ప్రభువు నిర్మించిన శిల్పప్రతిమలు దారు పీఠములపై నిలుపఁబడి యుండెను. దేవీమూర్తిచుట్టును ప్రభువు పాలతాలితో నిర్మించిన దేవి తొమ్మిది యవతారముల కథాశిల్పములు ప్రదర్శింపఁబడియుండెను. వాని యగ్రమునఁ బ్రభువు ప్రత్యేకమినానదుమ నిర్మించిన శిల్పమూర్తి స్థాపింపఁబడియుండెను. దుర్గము లోపలఁబౌరులును, దుర్గము వెలుపల వీరులును తొమ్మిదిదినములు దుర్గాపూజలు నిర్వర్తించిరి. పవల్ల దేవికి రథగజతురంగమాందోళికాది వాహనములపై నుత్సవములు. రాత్రులందామె యవతారగాథలు చిత్రించు వేషముల యూరేగింపులు. దేవియే శైవులకు శక్తిరూపిణి, వైష్ణవులకు మాయారూపిణి. వైష్ణవమాయ జగన్మోహిని, శైవశక్తి జగత్సంహారిణి. ఆమెయే లోకమును మోహపెట్టును. ఆమోహమునఁ జిక్కిన

లోకమును సంహరించును. మోహాతీతులకామె ముక్తి నిచ్చును. కొండవీటిప్రజలు శైవవైష్ణవభేదము విస్మరించి శరన్నవరాత్రము లందా శక్తినే మధుకైటభసంహారిణినిగా, మహిషాసురమర్దనినిగా, శుంభనిశుంభ సమాలంభినిగా, కంసాసురభర్జనిగా, దుర్గదైత్యభంజనినిగా నారాధింతురు. దేవి నల్లనిది. ఆమెకుఁ బదితలలును బదిచేతులును బదికాళ్లును గలవు. ఆమె మహాకాళి. మాతంగిని, శాకాంబరి, చాముండి. ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి యామెయే. ఆమెయే సరస్వతి, పార్వతి, శ్రీమహాలక్ష్మియు. సర్వవిద్యలు, సర్వవృత్తులు, సర్వకళలు నామెయే. ఆమె సర్వజగత్ ప్రసవిని. సర్వరసప్రస్రవిణి.

ఆతొమ్మిది దినములలో దేవికి వివిధజంతువులు బలులొసంగఁబడెను. అట్లు బలి యొసంగఁబడిన వానిలోఁ బచ్చమల యడవులలోఁ బట్టుకొనివచ్చిన కాఱుదున్న యొకటి, లకుమాపహరణాపరాధియగు వీరభద్రుఁ డొకఁడు. ఆ తొమ్మిదిదినములును కవిపండితులు కవితాగోష్ఠులు, సాహితీశాస్త్ర చర్చలు సాగించిరి. వామనభట్టు, అనంతామాత్యుఁడు, పెద్దిభట్టు, ప్రకాశభారతీయోగి, ఎఱ్ఱ యావధాని, త్రిలోచనాచార్యుఁడు, లొల్లమహాదేవ పండితుఁడు, రాయసభాస్కరయ్య, నిశ్శంకకొమ్మన, మున్నగు కవులుఁ బండితులు రీత్యలంకారౌచిత్య వాదములు చర్చించి రసధ్వని సిద్ధాంతముల నంగీకరించిరి. సంస్కృతాంధ్ర సాహిత్య సాగరములు మథించి యమృతరసము నాస్వాదించిరి. కొండవీటి ప్రభువుల సారస్వతాభిమానమును గొనియాడిరి. వారికవిపండితపోషణౌదార్యము నభినందించిరి. వారి సాహిత్యకృషిని ప్రశంసించిరి. "కొండవీటిప్రభువులు సంస్కృత సాహిత్యము నారాధించిరి. ఆంధ్రసాహిత్యము నాదరించిరి. ప్రబంధ పరమే

శ్వరుని హరివంశసుధా స్వాదము మఱిగినవారి రసజ్ఞ నీరసకావ్యములపై వ్రాలఁ జాలదు. వారికవితాదర్శము మహోదాత్తమైనది. కావ్యమునం దాదికవి కథాశిల్పము, శబ్దమాధుర్యము, నర్థవైచిత్ర్యము నుండవలెను. కవిబ్రహ్మ వాక్పాటవము, పాత్రనిర్మాణము, రసపోషణము నుండవలెను. అట్టి విశిష్టకావ్యము నే వారు స్వీకరింతురు." ఈవిధముగ వసంతామాత్యులు గావించిన రెడ్డిప్రభువుల యభిరుచి వ్యాఖ్యానము పరిషదంగీకారము వడసెను.

నవమినాఁడు కుమారగిరి ప్రభువు నిర్మించిన స్ఫటికశిలాశిల్పము వీథులలో నూరేగింపఁబడెను. సాయంకాలమా మూర్తి రాజసౌధము నెదుటఁ బ్రతిష్ఠింపఁబడెను. ఆమూర్తి కలహంస వాహన, కమలకర్ణికాసీన, చతుర్భుజ, చంద్రకళావతంస. సవ్యాపసవ్యకరయుగళముల వీణాదండశూల దండములు ధరించియున్నది. ఉభయపార్శ్వముల భద్రేభములు తుండాగ్రములఁ బుష్కర బీజమాలిక లెత్తిపట్టుచున్నవి. అర్ధనిమీలితములగు నామె నేత్రములు హంస శిరోన్యస్తమగు పుస్తకముపైఁ బ్రసరించుచున్నవి. ప్రభువామూర్తి పాదములఁ బుష్పాంజలి యుంచెను. వక్షమున శ్రీగంధము, కంఠమునఁ గస్తూరి, ముఖమునఁ గాశ్మీరము, శిరమునఁ ఒటీరజలముఁ జిలుకరించెను. ప్రదక్షిణము తిరిగి సాష్టాంగప్రణామ మాచరించెను. ప్రయతాత్ముఁడై యొకక్షణము ధ్యానముచేసెను. ప్రభువునకు బాహ్యస్మృతి లేదు. ఆయన సర్వేంద్రియములు నంతర్ముఖములై యంతరంగమున లీనము లయ్యెను. లకుమాదేవి యాదేవతామూర్తికిఁ గర్పూర నీరాజనమెత్తెను. ఆ నీరాజనకాంతులు ప్రసరించి ప్రభువొక కాంచన శిల్పప్రతిమవలె భాసించెను.

అనంతరము లకుమాదేవితనశిష్యురాండ్రచే 'రసరాస' మను నృత్యము చేయించెను. రాజసౌధమున దుర్గాధిపసీమాధిప దండ నాథామాత్యవర్గము కిటకిటలాడు చుండెను. నానాదేశాగతులయిన కవులుఁ బండితులు, వీరులు సుచితాసనము లలంకరించియుండిరి. శరదు త్సవములలో విజయోత్సవములు కలిసివచ్చి కొండవీట సర్వరంగముల నుద్దండులగు పండితులు సమకూడియుండిరి. యవనికయపసర్పితమైనది. రంగమధ్యమునం దష్టదళమును, జిత్రవర్ణమునగు పద్మమున్నది. దాని కాంచన కర్ణికపైఁ బ్రసన్నవదనము, నిమీలితనేత్రముఁ బద్మాసనస్థ మునై శాంతరసము ప్రవేశించినది. మందరశ్రీయగు రంగశీర్షము నిస్తరంగ సముద్రమువలె నీలగగనాంగణమువలె నుండెను. వేణు వీణా మృదంగ తాళధ్వనులు విలంబితలయాశ్రయములై యారంభ మయ్యెను. క్రమప్రదీప్తరశ్మియై రంగస్థలము మిలమిల మెఱయుచుండఁ దతానద్ధఘన సుషిరవాద్యములు మధ్యద్రుతా నుద్రుతల యాశ్రయ ములై రంగశీర్షము మందరాచల మంథాన మథ్యమానమగు క్షీర సాగరమును దలపించెను. పద్మకర్ణిక పరికంపితమయ్యెను. అష్టదళము లష్టబాలస్రక్కులై యాడఁ దొడఁగెను. శ్యామ సిత గౌర పీత నీల కృష్ణ రక్తకపోతవర్ణములగు వేషములుదాల్చిన యాబాలికలు శృంగార హాస్య వీరాద్భుత బీభత్స భయానక రౌద్ర కరుణరసములు. అవి జట్టుగట్టుచు, విడిపోవుచుఁ గౌఁగిలించుకొనుచుఁ గయ్యమాడుచు, చిఱు నవ్వుచుఁ జిడిముడిపడుచు, వెక్కిరించుచు, వెక్కి యేడ్చుచుఁ బెక్కు తీరుల నృత్యమాడెను. ఒకసారి వీరశృంగారములు యుగళలాస్యము చేయును. హాస్యమా రెంటి నడుమఁ దల నిక్కించి వెకిలిగానిగిలిం చును. కొంతసేపు బీభత్సభయానకములు యుగళతాండవముచేయును. రౌద్ర మా రెంటినడుమఁ దలయెత్తి గ్రుడ్లుఱిమి చూచును. ఈ మూఁడింటిని విలయక్రీడలకడలి కరుణము వలవల విలపించును. నేను

నేనని యద్భుతరస మన్నింటిని బులుముకొనును. కొంత సేపు నండఱలా సకమును గొంత సేపు మండలనృత్యము గావించి నా బాలస ర్తకులు మరలఁ బద్మదళమ్ములై రి. కంపముశమించి శాంతరసము కర్ణికపై (బద్మా సనస్థమై, నిమీలితనేత్రముఁ బ్రసన్న వదనము నయ్యెను. రంగశీర్షము యవనికాచ్ఛన్న మయ్యెను. సభయంతయు నద్భుత రసమునఁ దేలి యాడెను. లకుమాదేవి రంగపీఠమున నవతరించి పరిషత్తునకుఁ బ్రభు వునకుఁ బ్రణామాంజలిపట్టెను. ముఖ యవనికాపతనము సామాజికులకు నాట్యాంతము నివేదించెను.

విజయదశమినాఁడు దేవినిఁ బల్యంకికలోనుంచి యూరేగించిరి. ఊరేగింపువెంట సమలంకృతములూ సమర్చితములునైన భద్రగజభద్రా శ్వములు నడచెను. మైదానమునను, స్కంధావారమునను నాయుధ పూజలుజరిగెను. సాయంకాలము ప్రభువు గజాశ్వభటసందోహములు, సామంతదండనాథామాత్యులు వెంటరా మంగళవాద్యములతోఁ గోట వెలుపలి పురాతన శమీవృక్షము సమీపించెను. పెద్దియజ్వ ప్రభువుచే యథావిధి శమీపూజ నిర్వర్తింపఁజేసెను. అనంతరము పెద్దియజ్వ

"శమీ శమయతేపాపం శమీ శత్రువినాశినీ
అర్జునస్య ధనుర్ధారీ రామస్యప్రియదర్శినీ"

యని పఠించి "స్వస్తిశ్రీ అక్షయనామసంవత్సర ఆశ్వయుజ శుద్ధదశమీ ప్రభృతి ప్రభవనామసంవత్సర ఆశ్వయుజ శుద్ధదశమీ పర్యంతము శ్రీమన్మహారాజాధిరాజ శ్రీ కుమారగిరినృపతికి అభ్యు దయ పరంపరాభివృద్ధియు, దిగ్విజయసిద్ధియు నగుఁగాక" యని యాశీ ర్వదించి ప్రభువుశిరస్సునఁ బుష్పాక్షతలుంచెను. తరువాతఁ గుమారా న్నపోతారెడ్డి పేరుచెప్పియక్లే పుష్పాక్షతలుంపఁబోయెను. యువ

రాజు రాయప్పరయొడిలోఁ గూరుచుండెను. పెద్దియజ్వ యా కూరు చున్న యువరాజు శీర్షమునఁ బుష్పాక్షతలుంచెను. ఆపిమ్మటఁ బెద్దియజ్వ కాటయ వేమభూపతి నాశీర్వదించి పుష్పాక్షతలాయనశిరమునం దుంచెను. పేరుపేరునఁ బెద్దియజ్వ యల్లాడరెడ్డి మొదలుగాఁగల యందఱ శిరములను బుష్పాక్షతలుంచెను. (కాటయ వేమారెడ్డి యశ్వముపై నసివారుగాఁ బోయి గొండవీటినగరసీమాంతమునుదాఁటి తిరిగి వచ్చెను.)

ప్రభు వసంతరము మైదానమున బహిరంగముగఁ గొలువు తీర్చెను. దుర్గాధిపతుల విశ్వాసము నుగ్గడించియగ్గించెను. సేనాపతుల శౌర్యసాహసముల నభినందించెను. అల్లాడరెడ్డి యండదండలను గొండంతగాఁ గొనియాడెను. కాటయ వేమభూపతి బుద్ధిబలమును భుజబలమును బ్రశంసించెను. ఆసనమునుండి లేచి రాయప్పయందిచ్చిన గండపెండెరమును సభకు జూపించి ప్రభువు దానిని గాటయ వేమ భూపతి కాలికిఁ దొడుగఁబోయెను. వేమభూపతి యా గండపెండెరమును గరమున గ్రహించి "కుమరగిరి మహీపతులు మహోదారులు. ధర్మమూర్తులు. ప్రభువులయౌదార్యము ధర్మముఁ బ్రజలకు శ్రీరామరక్ష. మన మెల్లరముఁ గొండవీటి రాజ్యప్రజలము. ప్రజలబలము ప్రభువుబలమే. ప్రజల జయము ప్రభువు జయమే. మనము సాధించిన విజయములన్నియుఁ బ్రభువుపేరిటనే సాధించితిమి. ప్రభువే యీగండపెండరము ధరింపఁ దగుదురు." అని యా గండపెండెరమును ప్రభువు పాదమునఁ దొడిగెను. కొలువంతయు జయ శబ్దములతోఁ గలఁగిపోయెను. వేమారెడ్డి మఱియు నిట్లు పలికెను. "ప్రభువు కళాశీలి. నాట్యశిల్పములు రెండును ప్రభువునకు రెండుకన్నులు. ప్రభువురచించిన వసంతరాజీయము అపర నాట్యవేదము. ప్రభువునాట్య సూత్రముల ననుసరించియే నేను కాళి

దాస నాటకములకు వ్యాఖ్యానము వ్రాయనభిలషించితిని. శాకుంతల మాళవికాగ్నిమిత్రముల వ్యాఖ్యానము పూర్తియైనది. ఆవ్యాఖ్యాన మునకు "కుమారగిరిరాజీయ" మని నామకరణము గావింతునని యీనాఁడు మనవిచేసితిని. ఈశరచ్ఛుభసమయమున నావ్యాఖ్యాన మును ప్రభువునకంకితము చేయఁగోరుచున్నాను" ప్రభువు ఆమోద మందహాసముచేసెను. ప్రజలు హర్షాట్టహాసముచేసిరి. వేమారెడ్డి రాయనబాచయ్య చేతులనుండి యందికొని బంగరుపళ్లెమునందలి గ్రంథములను ప్రభువు హస్తములందుంచెను. ప్రభువునకు గంధము, కర్పూరతాంబూలముఁ జేతికిచ్చెను. కనకాంబరములు భుజములపైఁ గప్పెను. ప్రభువునకుఁ బరిషత్తునకుఁ నమస్కరించి యవతారికాశ్లోక ములు పఠించి కూర్చుండెను.

ప్రభువు కృతిని, కృతికర్తను ప్రశంసించి, తనజీవితచరితార్థతను గొనియాడుకొని, కొండవీడు విద్యానగరముల స్నేహబాంధవ్యముల నుగ్గడించి రాజపురుషులను, రణవీరులను, కవిపండితులనుయథోచితముగ సత్కరించెను. కృష్ణాష్టమినాఁడు ఉట్లుగొట్టిన యువకులకు పతకములుఁ, బతాకములునిచ్చి సేనలలోఁ జేర్పించెను. ఈకార్యక్రమమంతయు ముగియునప్పటి కర్ధరాత్రమయ్యెను.

మఱునాఁ డరుణోదయవేళ దుర్గాధిప సీమాధిపు లశ్వదళమా త్రానుయాతులై యెవరిదుర్గములకువారు బయలుదేరిరి. కార్తికశుద్ధ పంచమినాఁడు యువరాజు పూర్వదిగ్విజయయాత్రకు బయలుదేరవలయు నని కార్తాంతికులు ముహూర్తమునిర్ణయించిరి. దుర్గాధిపులానాఁటికిఁ గొండవీటికిఁ దిరిగిరావలయును. కవులుఁ బండితులుఁ గుమారగిరిప్రభువు వితరణమునుగొనియాడుచు బాలభాస్కర కిరణప్రసారములలో మూపుల యందలి యుడుగరల మోపులు కనకగిరి శృంగములఁ దలపించుచుండ

నెవరియగ్రహారములకు వారేఁగుచుండిరి. ఈనాలుగునెలలుగా శ్రీనాథుఁడెచ్చటనుండెనో యెవ్వరికినిఁ దెలియలేదు. తిప్పయ్యగారాతని సంగతి పట్టించుకొనలేదు. అన్నయమంత్రి వీలయినంత యత్నించెను గాని యాచోకీయెంతమాత్రముఁ జిక్కలేదు. అహోబిలముపోయి వచ్చి నప్పటినుండియు దుర్గయు నాతనిమాట మఱచిపోయి మల్లాంబికా హీరాంబికలనడుమ నాటపాటలతోఁ గాలము గడుపుచుండెను. రసరాసమున శాంతరస మభినయించిన దామెయే. అవచితిప్పయసెట్టి యిచ్చిన క్రొత్తపంచె యెండవానలకుఁ జివికిజీర్ణములై పోయెను. తలయంతయు రెల్లుదుబ్బువలెనుండెను. తిప్పయ్యగారియింట నాఁదినమున దిన్నదే తిండి. కన్నులలోఁ బ్రాణమును పెట్టుకొని శ్రీనాథుఁడు తిరిగితిరిగి యమవసనాఁటి గోధూళివేళఁ గొండవీడుచేరెను. కోమటి వేమారెడ్డి కొండపల్లెనుండి పలాయనము చిత్తగించి రాజుకొండలో నున్నట్లు కొంతకాలమునకుఁ దెలిసి తానును రాజుకొండకుఁ జేరెను. రాజుకొండలో నొకకాలు, దేవరకొండలో నొకకాలుగాఁ దిరుగుచు శ్రీనాథునకుఁ గోమటిరెడ్డి దర్శనమే చిక్కలేదు. కొండపల్లెపైఁ, గోమటిరెడ్డిపై సింగనమంత్రి తనకుఁబెట్టిన యాస లడవులపాలయ్యెను. సిగ్గు విడిచిమరలఁ గొండవీటికే చేరవలసివచ్చెను. తిప్పయ్యగారాతనికి నాలుగుచీవాట్లుపెట్టి యింతటనైనఁ గుదురుగాఁ గొండవీటినే నమ్ముకొని యుండుమని మందలించి తలకు నొడలికిఁబట్టిన మడ్డి వదలునట్లు తలయంటి పోయించెను. బావను జూడగనే దుర్గకు మఱుగుపడిన మమకారము మరలఁ దలసూపెను. రుచికరములయిన వంటకములతో నాతని నాలుక త్రుప్పువదలించెను. దుర్గ యొక్క యందకత్తెయు కాదు ఆటకత్తెయుఁ బాటకత్తెయునైనది. శ్రీనాథునకామెను జూడఁగాఁ గవితావేశముఁ బుట్టుకొనివచ్చుచుండెను. చదివిన చదువంతయు నెమరు వేయుచు జీర్ణముచేసికొనుచు శ్రీనాథుఁడు తిప్పయ్యగారియింట

ఓరికగాఁ గూర్చుండి సప్తశతి తెలుఁగుసేత తిరిగి క్రొత్త తెన్నున సాగించుచుండెను.

శ్రీశైలాహోబిలములు సీమాంతములుగాఁ గొండవీటికి విద్యానగరమునకు సంధి యైనది. ఆ సంధికిఁ బ్రథమశుభఫలితము హీరాంబికా వేమభూపతుల వివాహము. హరిహరరాయల వారైదు వందల యేనుఁగులను, రెండువేలగుఱ్ఱములను, వెలలేని కాంచనాంబరములను, రత్నాభరణములను, బరిచారకాగణమును హీరాంబిక కరణముగా నిచ్చి కుమరగిరిమహీపతి సన్నిధికిఁ బురోహితునిబంపించెను. బహుళ పంచమినాఁడు ప్రభువు వరదగోపీనాథుని సన్నిధిలో హీరాంబికా వేమ భూపతులకుఁ గళ్యాణము చేయించెను. కాటయవేమభూపతి కళ్యాణ మహోత్సవమును దిలకింపఁ గొండవీడంతయు గోపీనాథుని యాలయమున కొడ్డిగిలిపోయెను. మందిరప్రాంగణమున మల్లాంబిక మగనికిఁ జెల్లెలికి మంగళహారతులు పట్టెను. గంగాదేవి యంతరంగము ప్రసన్నతా మధురమై మధురావిజయమునఁ గావ్యరసము గంగాలహరియై విద్యానగరమున వెల్లివిరిసెను. లకుమాదేవియు, వామనభట్టును కుమరగిరి ప్రభువుతో సల్లాపములాడుచుండిరి. లకుమాదేవి వేమారెడ్డినిఁ బ్రశంసించును. వామనభట్టు హీరాంబికను గొనియాడును. ప్రభువు మా మల్లాంబిక యందఱికంటె దొడ్డదని యానందించును.

విద్యానగరపరివారము వెంట నాగమణి దాసియుఁ గొండవీటికి వచ్చెను. దాని దసలు కొండవీడే. నాగమణి కది పినతల్లి కూఁతురు. అది నాగమణితోఁ గొండపల్లెకుఁ బోయి యటనుండి విద్యానగరమునకుఁ బోయెను. తన కైశ్వర్యమబ్బినంతనే నాగమణి దానిని దాసిగాఁ బరిగణింపసాగెను. అది దానికిఁ గడుపులో గుఱ్ఱుగానుండెను. వామన

భట్టు దానికిఁ గుమారగిరిప్రభువు దర్శనము చేయించెను. ప్రభువామె సేవను గొనియాడి యడిగినన్ని మడిమాన్యము లొసఁగి యాదరించెను.

## ౨౧

ఈ పదునైదు దినములునుఁ గాటయవేమ భూపతికిఁ గంటిపై రెప్ప వ్రాల్చుటకుఁగూడఁ దీరిక లేదు. పవలెల్ల స్కంధావారమున వీరోపన్యాసములు, విన్యాస పరిశీలనములు. రేయెల్ల మల్లాంబికతో సరససల్లాపములు, హీరాంబికతో శృంగార విహారములు. మల్లాంబికకును హీరాంబికకును బగళ్లు గడువమియే యగపడుచుండెఁగాని రేలెంతపొడవెదుగుచున్నదియు నగపడుటలేదు. చంద్రశాలపైఁ జల్లని వెన్నెలలు శయనమందిరమునఁ జిఱునవ్వులగుచుండెను. హీరాంబిక యుపగూహనములలో నోదుగులుపోవుచు వేమారెడ్డి మల్లాంబికను మధురోహలతో పొంగులువాఱించును. మల్లాంబికమధురాలాపములఁ దేలియాడుచుఁ గాటయవేమభూపతి హీరాంబికను మందహాస రోమాంచపారవశ్యమునఁ జొక్కించి సోలించును.

కార్తికశుద్ధచతుర్థినాఁటి సంధ్యాసమయమునఁ గుమారగిరి మహీపతి కోట తూరుపు బురుజుపై నిలిచి స్కంధావారమును సమీక్షించెను. సంధ్యాతప రాగరంజితములైన శరన్మేఘములు ప్రాగ్దిశాంగణమున నరుణోదయమును బురుడించుచుండెను. మాణిక్యమణి శిల్పప్రతిముఁడై కోటకొమ్మున నిలిచియున్న ప్రభువునుగాంచి స్కంధావారము జయనినాద మేదురమై యుప్పొంగిపోయెను. కుమారగిరి ప్రభువు చిత్తమునఁ గొండవీడు రాజమహేంద్రవరముగా, నాసేనావాహిని గోదావరీ గంభీరప్రవాహముగా భాసించెను. కాటయవేమభూపతి ప్రభువునకా స్కంధావారమును జూపుచు "ప్రభూ! రాజమహేంద్రవరము

నింకొక యింత స్కంధావారము సిద్ధముగ నున్నది. ఈ ఉభయసేనా వాహినులను కృష్ణా గౌతమీ ప్రవాహములవలె జోడుగా నడిపించి పూర్వదిగ్విజయయాత్ర మూఁడు నెలలలో ముగించి వత్తును.” అనెను. ప్రభువాయన భుజముదట్టి సేనావ్యూహజయజయాభివందనములనుఁ జేయెత్తి యందుకొని బురుజుదిగి బయలుదేరెను.

దీపావళినాఁడు చెలరేగిన చిచ్చుబుడ్లింకనుఁ బూవులుచిమ్ము చుండెను. దసరాపండుగలోఁ దీరని సరదాలను గొండవీటిబాలబాలికలు దీపావళిలోఁ దీర్చుకొనుచుండిరి. రాజవీథులన్నియు నవరాత్రములలో సేనాంగముల సంచారములచే సంకులమ్ములై బాలల విల్లంబుల యాత్రా రేగింపులు సందుగొందులలో నొదిగి పోవలసివచ్చెను. రాజవీథు లిప్పుడు బాలవిహార యోగ్యములైనవి. దివిటీలు త్రిప్పికొనుచు, తారాజువ్వ లెగురవైచుచు బాణసంచుల ప్రయోగించుచు బాలవీరులు రాజవీథులలో స్వైరసంచారములు గావించుచుండిరి. ప్రభువాపసి వారి యుత్సాహమున కానందించుచు భవనములోని కేఁగెను.

మరునాఁ డరుణోదయమువేళఁ గొండవీటి దుర్గద్వారమున రణభేరి మ్రోగెను. భద్రగజముపై నెక్కి యువరాజు దిగ్విజయ యాత్రకు వెడలుచున్నాఁడు. కుమరగిరి మహీపతి విశ్వమంతయు యువరాజు కన్నులలోఁ గనిపించెను. ప్రభువు నేత్రములలో, వదనములో, సర్వగాత్రమునఁ దృప్తిరూపమగు నానందము వ్యక్తమగుచుండెను. పురోహితు లథర్వమంత్రములు ఘోషించుచుండిరి. పౌరాంగనలు పుష్పాక్షతలు చల్లుచుండిరి. వీరాస్వామి మంగళగానము, వకుళావంజులాదుల మంగళనృత్యము చెలఁగుచుండెను. మల్లాంబిక యుల్లుని మొగమున వీరతిలకము దీర్చినది. లకుమాదేవి వామనభట్టు యువరాజును జూపులతో దీవించుచుండిరి. పట్టగజము బయలుదేరినది.

వీడెల్లవిరుగఁబడి చూచినది. వృద్ధరామప్ప యూరేగింపుముందు నెట్టి యానందములో గంతులువేయుచుండెను. దుర్గద్వారమునఁ గాటయ వేమభూపతియు నితర దుర్గాధిప సేనాధిపులు యువరాజునకు జయ వెట్టిరి. యువరాజుపట్టగజము నవరోహించెను. "యువరాజ ప్రతినిధినై పూర్వదిగ్విజయము గావించిరండు" అనుచుఁ గుమరగిరిమహీపతి కుమారునిచేఁ గాటయవేమభూతికిఁ వీరతాంబూలము, వీరగంధము నిప్పించెను. అట్లే దుర్గాధిపతులకు, సేనాధిపతులకు నిప్పించెను. కోట వాకిట రణభేరి మ్రోగెను. స్కంధావారమున శంఖకాహళతమట నిస్సాణపటహ భేరీధ్వనులు మిన్నందెను. స్కంధావారము కదలి పోయెను. కుమరగిరి కన్నులలో గిఱ్ఱున నీరు దిరిగెను. యువరాజు దిగ్విజయముఁ జేయును. యువరాజు సామ్రాజ్యము నిర్మించును. నరసింహ పండితులు నుడివినది సత్యమే.

సేనాముఖమునఁ గైజీతగాండ్రు, సెలగోలుబలము గదలెను. తలకుఁ జుంగులరుమాళ్లు, మేనఁ బొట్టి యంగీలు, తొడలకుఁ జల్లడము, నడుమునఁ గాసె దట్టీలు, దట్టీలలోఁ గత్తికటారులు. కాల్బలము నేల యీనినట్లు బెలబెల గదలెను. తలపై దట్టు పాగలు, పాగలలో నెమ్మికుచ్చులు, నడుమున మచ్చల దట్టీలు, దట్టీలలోఁ జుర కత్తులు, వీపున నమ్ముల పొదులు, మూపున వెండికట్ల విండ్లు. చిఱుతపులులనంటి భిల్లసైనికులా వెనుక నడచిరి. కాళ్ల యం దినుపకడియములు గల్లుగల్లురన నేనుంగులవంటి యేకాంగవీరులు బుజములపైఁ బుట్టెడేసి గదలు కుదురుకొల్పి యావెంటఁ గదలిరి. రాగిమీసములు, రక్తలోచనములు, నిగనిగని గిరజాలపై మెలిపెట్టిచుట్టి షేలిరంగుల పాగలు, నడుమున నెఱ్ఱజరీ దట్టీలు, దట్టీలలోఁ బట్టాకత్తులు, చేత బల్లెము, వాలెలుపైఁ దమ్ములము. సుందరవేషులగు బొందిలి వీరులా వెనుకఁ సాగిరి. తల

చుట్టు జరీరుమాళ్లు, ఒడలినిండ నిలువుటంగీలు, నడుమునఁ గమర్ బందులు, కమర్‌బందులో రుమీకత్తులు, చేతఁ గరవాలము, జీనులో గండ్రగొడ్డలి, తురికి విల్లు. మొగముల నుక్కుకవచములు దొడిగిన గుఱ్ఱములెక్కి యాశ్వికదళ మా పిఱుఁదున బయలుదేరెను. తలకుఁ గుచ్చులపాగలు, మొగమునఁ బంగనామములు, మేనెల్ల గంధపుఁ బూఁతలు, బొటనవ్రేలిపై బైరిడేగలు, కుడిచేతఁ జిఱుబల్లెములు, పచ్చని యొడలెల్ల గాయపుమచ్చలతోఁ బెద్దపులులవంటి రెడ్డి వెలమ వీరు లా వెనుక నేనుంగున కెనమండ్రుగా నెక్కి బయలుదేరిరి. గొల్లెనలు, పటకుటీరములు, బల్లాకిపెట్టెలు, మంచములు, తమ్మపడిగెలు, బొక్కసములు, భోనకావిళ్లు, నెద్దులపై, బండ్లపైఁ, బల్లకులపై నా సేనా పృష్ఠమున సాగిపోయెను.

బహుళపంచమి నాఁటికిఁ బదాతిదళములతోఁ బ్రధానసేనాపతులు రాజమహేంద్రవరమున దిగిరి. గజాశ్వదళములు, సమర సామగ్రి, యాహారసంభారములు గోదావరి దాఁటుచున్నవి. సేనలకుఁ గొంత విశ్రాంతి యిచ్చి దశమినాఁడు యాత్రారంభము చేయవలయునని యల్లాడరెడ్డితో నాలోచించి వేమభూపతి నిశ్చయించెను. ఆ యయిదు దినములును రాజమహేంద్ర సౌందర్యములఁ దిలకించుటలో, గోదావరీ జలమున నీదులాడుటలో దండునకుఁ గాలక్షేపమగుచుండెను. కాటయ వేమారెడ్డి యనుదినమును గోదావరీస్నానమాచరించి, గోపీచందన తిలకముదీర్చి గోపీనాథస్వామి నారాధించుచుండెను. కుమారాన్న పోతారెడ్డి విజయయాత్ర నిర్విఘ్నముగ నెఱవేర్పుమని స్వామిని వేడుకొని స్వామి కళ్యాణోత్సవ నిర్వహణమునకై యొక యగ్రహారము సమర్పించెను. గోదావరిపై నౌకావిహారము సలుపుచుండగాఁ దీరమున నెత్తయిన గుట్టపై నొక సుందరభవననిర్మాణ మాయన దృష్టినాకర్షిం

చెను. అది యేమని యాయన యల్లాడరెడ్డి నడిగెను. ఎట్లున్నదని యల్లాడరెడ్డి నవ్వుచు నెదురు ప్రశ్నించెను. లోకోత్తరముగ నున్నదని యాయన ప్రశంసించెను.

వసంతోత్సవములనుండి తిరిగివచ్చినతరువాత నల్లాడరెడ్డి కొక యూహ కలిగెను. కుమారాన్నపోతారెడ్డి యౌవరాజ్యాభిషిక్తుఁడయ్యెఁగదా. శరదుత్సవముల యనంతరమాయనను రాజమహేంద్రవరమునకుఁ దీసికొనిరావలెను. రాజు కొండవీటిలో నుండును. యువరాజు రాజమహేంద్రవరమున నుండును. గోదావరీతీర నివాసము కుమారాన్నపోతారెడ్డి యారోగ్యమున ననుకూల పరిణామము గలిగింపవచ్చును. యువరాజునకు సుందరమైన యంతఃపురమందిరము కావలయుఁగదా. గోదావరీతీరమునఁ గాటయవేమభూపతి దృష్టినాకర్షించిన దివ్య భవనమే యది. నిర్మాణమిప్పుడిప్పుడే పూర్తియగుచున్నది. సేద దేరిన సేనావాహిని దశమినాఁడు దండయాత్ర ప్రారంభించెను. ఆసేన కృష్ణాగోదావరు లేకవాహినియైనట్లుండెను. రాజమహేంద్రవరమునఁ జేరిన సేనలో కోయదొరలే యిరువదివేల వఱకు నుండిరి. పదివేల యేనుఁగులు, ముప్పదివేల గుఱ్ఱములు, నైదులక్షలకాల్బలము.

కార్తికమాసమునఁ గొండవీట వెట్టివెన్నెల లెవరికొఱకుఁ గాసినట్లు? మల్లాంబిక యొడలెల్ల పాలిపోయి, యధరముమీఁది యెఱుపు తూలిపోయి, కన్నులలోని నలుపు తేలిపోయి యామెయే శరద్రాకాయామినివలె నైపోయెను. ఆమె చూపులలో వెన్నెలలు. నవ్వులలో వెన్నెలలు. హీరాంబికకుఁ జంద్రశాలమీఁది కేఁగుటయే భయముగనుండెను. వేమభూపతిలేని వెన్నెలలోఁ దాను వెన్నముద్దవలెఁ గరిఁగిపోవునేమో. వేమభూపతియుండినచోఁ గరగిపోవు తన్నుఁ గౌఁగిటిలోఁ బట్టుకొనును. అయినను వెన్నెలలాయిరువురను విడిచిపెట్ట వయ్యెను. మార్గ

శీర్షమున మంచుగా డిగివచ్చి వారి యంతఃపురములు ముట్టడించెను. మంచు విరిసిపోయినదని పరిచారికలు ప్రత్యయముగలుగఁ బలుకు నంతవఱకును వారిరువురును గాశ్మీరపు దుప్పటములలోనుండి తల యెత్తకుండిరి. వేమభూపతి విజయయాత్ర గావింపనేగినాఁడు. కనుక నే యీ కౌముదీ సంరంభము, తుషార విజృంభణము సాగివచ్చినవి.

వేమభూపతి మొల్లేటిదుర్గముఁ గొల్లగొట్టినాఁడఁట. వామనభట్టీ వార్తను గుమరగిరిప్రభువునకు జెప్పుచుండెను. విఱుచుకొనిపడుచున్న సేనాసాగరమునుజూచి మొల్లేటిపాలకుఁడు దుర్గము విడిచిపఱచినాఁడఁట. పుప్పాలమానుమయ్యను దుర్గరక్షణకు నియోగించి వేమారెడ్డి కిమ్మూరు దుర్గముమీఁదికి దూకుచున్నాఁడఁట. రాయప్ప యీ విజయవార్త యువరాజునకుఁ జెప్పెను. యువరాజు నవ్వఁబోయినాఁడు. అనవ్వుటలో నాయనకుఁ దెగనిదగ్గుతెఱ ముంచుకొనివచ్చినది. రాయప్ప పరుగున వచ్చి ప్రభువునకుఁజెప్పెను. ప్రభువు భాస్కరాచార్యులవారికిఁ గబు రంపెను. యువరాజుస్థితి నానాఁటికిఁ దీసికట్టుగా నున్నది. మార్గశిర మున నీమంచుపట్టినప్పటినుండి తడిగాలితగిలి యాయన యూపిరితిత్తులు దెబ్బతినుచున్నవి. ఆయనకుగుండె బరువుబరువుగా నున్నది. భాస్కరా చార్యులవారేవో యౌషధములుపోసి కాలముగడుపుచున్నారు.

మార్గశీర్షమంతయుఁ గొండవీడువిజయవార్తలతో నిండిపోవు చుండెను. కిమ్మూరుదుర్గము మిక్కిలి పురాతనమైనది. కిమ్మీరుఁడను కిరాతుఁడాదుర్గము నేనాఁడో నిర్మించెనఁట. అదిదృఢమైన గిరిదుర్గము. చీకట్లుఁ బొగమంచులు దట్టముగఁ బట్టిన యొకనాటిరాత్రి, పదిదినముల ముట్టడి యనంతరమాదుర్గము స్వాధీనమైనది. మంచుచీకట్ల మఱుగునఁ గోటకులగ్గలెత్తి కోయదొరలనుఁ గోడలపై కెగఁబ్రాకించిరి. ఆ కోయ దొరగాఁడడ నిసాక్షములుగ నమ్ముచుండెను. వారు కోటలో నా

యమ్ములవర్షము గురియించిరి. కోటలోనిసేనలు గగ్గోలుపడిపోయినవి. ఈసందడిలోఁ గొండవీటిసేనలు గుంపులుగుంపులుగాఁ గోటలోఁ బ్రవేశించినవి. కోటవశమైనది. రెడ్డి పెదవెంకప్పరెడ్డి యీదుర్గాధిపతిగాను నియమింపఁబడెను. మార్గశీర్షపూర్ణిమనాఁడు బెండపూడిదుర్గము పట్టువడినది.

ఒడ్డాదిరాజ్యమును మత్స్యవంశీయుఁడు ప్రతాపార్జునదేవుఁడు పాలించుచుండెను. ఆయన గతవత్సరము వీరకూటరాజ్యాధిపతియగు పల్లవసౌభాగ్యదేవరాయనితోఁ బోరి సలిపియుండెను. సౌభాగ్యదేవరాయఁడు వజ్రకూటరాజ్యమును, నొడ్డాదిరాజ్యమును జయించి వీరకూటమును బలమగురాజ్యముగాఁ బెంపొందింపవలెనని తలఁచెను. యుద్ధమువలన మూఁడురాజ్యములును బలహీనములయ్యెనే కాని యేకముకాలేదు. బలపడలేదు. ప్రతాపార్జునదేవుఁడు వేమభూపతికి శిరమువంచి యరిగాపయ్యెను. వీరకూటము రెండుకొండలనడుమ నిర్మింపఁబడిన బలిష్ఠమైనదుర్గము. దుర్గము సప్తప్రాకారగుప్తమై శత్రుదుర్భేద్యముగ నున్నది. కాటయవేమారెడ్డి సైన్యమును రెండుభాగములు చేసెను. అల్లాడరెడ్డి యొకదిక్కు, తానొకదిక్కు దలపడనలెను. ఉత్తరదక్షిణదిశలఁ గొండలు ప్రాక్పశ్చిమదిశలఁ బ్రాకారములుగల యీదుర్గమును, కొండలుసాధించిననేకాని చొరవీలుపడదు. కొండవీటిసేనలు పర్వతదుర్గములను సాధించుటలోనారితేరినవి. వానకాలమంతయు జిడ్డునజారు బండలపై బల్లులవలె నెగఁబ్రాకుట కొండవీటిసేన లభ్యసించియుండెను. వజ్రకూటపుఁగొండలు నాలుగునిలువులయెత్తు నిట్టూరుగానుండునట్లు చెక్కఁబడియున్నవి. వేమభూపతి యొక యుపాయ మాలోచించెను. పర్వతపాదమున రెండేసియేనుఁగులఁ బగుండఁబెట్టి వానివీపులపై మూఁడవయేనుఁగు నెక్కించి దానిశుండాగ్రమునం దొక వీరుఁడునిలిచి తనభుజములపై నింకొకవీరు నెక్కించుకొనవలయును.

ఆ యెక్కినవాఁడు వీరుఁడు కొండరాతిలో బెజ్జమువైచి యొక యినుప గూటము నందు బిగింపవలయును. ఆ గూటమునకు త్రాటినిచ్చెన దగిలింపవలయును. త్రాటినిచ్చెనలవెంట సైనికు లొక్కొక్కరుగా కొండకొండకు నరువది-చోటుల నెక్కి వచ్చుచుండిరి. కొండమీఁదినుండి వజ్రకూట సైనికులు రాతిగుండులు దొరలించుచుండిరి. దొరలి వచ్చు గుండులను దప్పించుకొనుచుఁ గొండవీటిసేనలద్భుతమువంటి కొండ పలకపై నంటికొని బల్లులవలెఁ బ్రాకుచుండిరి. కోటపైఁ దలయెత్తిన వాని నేటున కొక్కఁడుగాఁ గోయదొరలు పొట్టనిడుకొనుచుండిరి. కొండకు వేయివంతున నెక్కించి వేమభూపతి తాను క్రొత్తగా గని పట్టిన ప్రేలుడుగుండ్లను గోతాములలో వారికందఁజేసెను. మఱు నిముసమున వజ్రకూటదుర్గమున నగ్నివర్షము గురియఁదొడఁగెను. కోటలోఁ గలవరము చెలరేగెను. కోటతలుపులు దెఱచి లోపలి సేన యంతయు వెలుపలికి వచ్చెను. రెండుగడియలలో వజ్రకూటదుర్గము వేమభూపతి వశమయ్యెను.

పుష్యమాసారంభమునఁ గుమారాన్నపోతారెడ్డికి గుండెల బరువధికమయ్యెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములే యాయనకు వశముగుట లేదు. ఊపిరితిత్తులు తూటులుపడిపోయి యుండును. ఊపిరిచాలక యువరాజున కెగఊప్పు ప్రారంభమయ్యెను. ప్రభువున కాందోళన యధికమయ్యెను. భాస్కరాచార్యులవారు తపస్సు చేసి సాధించిన యమృతమయౌషధములు పోయుచుండెను. గుణమేమియుఁ గనఁ బడుటలేదు. ప్రభువునకు గుండెలలో గుబులుపుట్టుచుండెను. మల్లాంబిక, లకుమాదేవి, వామనభట్టు సకలవిధముల యత్నించియుఁ బ్రభువునకు ధైర్యము గొలుపఁజాలకుండిరి. రాయప్ప, రాజు పరిస్థితి యువరాజు పరిస్థితిఁ జూచుచుఁ గుమిలిపోవుచుండెను. కుమారగిరి ప్రభువునకు యువ

రాజు జీవితముపై నాసలు సన్నగిల్లుచుండెను. తాతగారివలెఁ దన బిడ్డయు సామ్రాజ్య మేలునని తా నాశలు పడుచుండెను. ఆ బిడ్డయే తప్ప తన కింక నెవ్వరున్నారు? ఈ నిసుగు మరణించినచో నీ దిగ్విజయ మెవ్వరికొఱకు? ప్రభువు పారశీకతురంగముపై వేమభూపతికి వర్తమాన మంపెను. రెండుదినములైనది. మూఁడుదినములైనది. యువరాజునకు పై గ్రుడ్లుపడుచుండెను. మైకముగ్రమ్ముకొని వచ్చుచుండెను. అర్ధరాత్రమున యువరాజు నిశ్చలము నిర్నిమేషముగ శయ్యపైఁ బడియుండెను. ప్రభువుగుండెలు గుండెలలోలేవు. రాయప్ప ప్రభువు చెవిలో నేమో చెప్పెను. ఆయనకుఁ బ్రాణము లేచివచ్చిన ట్లయ్యెను. ఆ యర్ధరాత్రమున నాయన పీరాస్వామికొఱకుఁ బరువెత్తించెను. తన నాదస్వరమునఁ బ్రశమనశక్తి లేదు. ప్రకోపనశక్తి యున్నదని పీరాస్వామి యనెను గదా! పీరాస్వామి వచ్చి యువరాజుస్థితికి మిగుల శోకముఁ బొందెను. ఆ దుఃఖావేశములో నాతఁడు నట్భైరవీరాగము నెత్తుకొని నాఁడు. తనయొడలు తనకే తెలియని యావేశముతో పీరాస్వామి రాగాలాపము గావించుచుండెను. సన్నాయిగొట్ట మాతనిచేతిలోఁ గాలసర్పము పడగవిప్పి యాడినట్లాడి పోవుచుండెను. చక్రాకారమున సన్నాయిగొట్టమును ద్రిప్పుచు నాతఁడు తారమునుండి యతితారమున కెగిరి తారలు రాల్చినట్లు స్వరములు గలగలఁ గురియించుచుండెను. తారతరస్వరమున నా నాదస్వరము విని దేవతలు గూడఁ గంపించి పోయి రన్నట్లుండెను. యువరాజు కంఠమునఁ గునుకుచున్న కొన యూపిరి కోడెనాగమువలెఁ బడగవిప్పెను. శిరస్సు చిటికిన త్రాచు పిల్లవలె యువరాజు గిలగిలఁ దన్నుకొనసాగెను. కుమరగిరిప్రభు వాపిల్లవాని యాతన చూడఁ జాలకపోయెను. కన్నులు మూసికొని ప్రభువు పీరాస్వామిని పాట యాపుమనినట్లు చేమొత్తెను. నాదస్వర మాఁగి

పోయినది. అరనిముసమట్లే తన్నుకొని యువరాజు దీర్ఘనిశ్వాసముతోఁ బ్రాణవాయువు విసర్జించెను.

ప్రభువు దుఃఖము నెవరుపట్టఁగలరు. కుమారుని కళేబరముపైఁ బొరలి పొరలి రోదించి రోదించి ప్రభువు ప్రాణములు శోషిల్లి మూర్ఛాగతుఁడై పోయెను. తెల్లవాఱువఱకీవార్త కొండవీట నగ్గిపలె నలముకొనెను. పురమెల్ల నొక్కఁడై పురపురఁ బొక్కిపోయెను. ఆనందమందిరమైన యంతఃపురమున శోకదేవత తాండవమాడెను. పేడవనాఁటికి వేమభూపతి వచ్చెను. ఎవరువచ్చి మాత్ర మేమిచేయుదురు. చచ్చిన యువరాజును బ్రతికింతురా! ప్రభువు శయనమందిరమునఁ గూర్చుండి యుండెను. కాటయ వేమభూపతి యాయనను దర్శించెను. శోకపరిదీనమూర్తి యగు ప్రభువునుగాంచి వేమభూపతి భయకంపితుఁడై పోయెను. ప్రభువు నిజముగ బ్రతికి యుండెనా? ఆకూర్చుండినది ప్రభువా? ప్రభువు శిల్పప్రతిమయా! ప్రభువాయనను గాంచినంతనే చివాలునలేచి కంఠమును గాఁగిలించికొని "వేమయ్యా! నాబిడ్డ యింక లేఁడు" అని యాక్రోశించెను. వేమభూపతికి దుఃఖము పొంగి వచ్చెను. ఒకక్షణముండి యాయన గద్గదకంఠముతో "ప్రభూ! నేను మీబిడ్డను గానా? ప్రజలందఱు మీబిడ్డలు కారా? మీరు దుఃఖమును నిగ్రహింగవలెను. మీరు దుఃఖించినచోఁ బ్రజయంతేయు దుఃఖించును. మీరు దుఃఖపడిన నోదార్పఁగలవా రెవ్వరు? ప్రభూ! కొండవీడంతయు దుఃఖమున మునిఁగి యున్నది. మీరు కన్నీరు దిగమ్రింగి మీబిడ్డల నోదార్పవలయును." అనుచుఁ బ్రభువుకన్నులను రెంటు చేతులతోఁ దుడిచెను.

పది దినములు గడచెను. ప్రభువు క్రమక్రమముగ స్థిమితపడుచుండెను. అనంతామాత్యుఁడు ప్రతిదినమును ప్రభువునకు శాంతిపర్వము

జదివి వినిపించుచుండెను. ఒకనాఁడు షోడశమహారాజుల చరిత్ర చదివెను. కవిబ్రహ్మ యేమి శిల్పి! ఒక్కొకమహారాజు చరిత్ర నాయన యొక్కొక్క సీసపద్యమునఁ జెప్పెను. ఒక్కొక్క పద్యమువినినప్పుడు కుమరగిరి కన్నులయెదుటఁ గిరీటకేయూరధారియై యొక్కొక్కమహారాజు సాక్షాత్కరించుచుండెను. పదునాఱు సీసపద్యములును ముగిసెను. ప్రభువు కన్నులయెదుటఁ బదునాలుగురు చక్రవర్తులును సాక్షాత్కరించిరి. ప్రభువున కెక్కడలేని చిత్తశాంతి జనించెను. దేహము లస్థిరములు. ధర్మము స్థిరము. రాజులు స్థాపించిన రాజ్యములు శాశ్వతములుగావు. రాజులు సాధించిన ఘనకార్యములు శాశ్వతములు.

కోమటివేమారెడ్డి యిన్నాళ్లనుండియుఁ గొండవీటనేయుండెను. వెలమప్రభువులు వేమభూపతితోఁ జేసికొనిన సంధి ననుసరించి కోమటి వేమారెడ్డిని కొండవీటికొప్పగించిరి. కొండవీట నాతఁడు తనకొఱకు నియమింపఁబడిన భవనమున నొంటరిగ నివసించుచుండెను. కొండవీటఁ దానెట్లు తలయెత్తుకొని తిరుగఁగలఁడు? ఇంతకాలము నాతఁడు వీథిలో నడుగిడలేదు. కుమరగిరి ప్రభువుపై నాతనికిఁ గోపములేదు. ఆతని కోపమంతయుఁ గాటయవేమభూపతి మీఁదనే. తననోటి కండ నాచికొన్నవాఁడాయనయే కదా! పరాభవముచే నాతఁడు కొంతకాల ముడికిపోయెను. సిగ్గుచే నాతఁడు కొంతకాలము చిమిడిపోయెను. తన కౌటిల్యమును దలపోసి పరితాపముఁబొందెను. కుమరగిరిధార్మికత యాయనకుఁ గ్రమముగఁ జిత్తమున కెక్కెను. ఆయనకాలమంతయు సంగీతసాహిత్య పరిశీలనలతోఁ గడపుచుండెను. విద్యాన్యాసంగ మాయనచిత్తమునకుఁ గ్రొత్తవెలుఁగు చేకూర్చెను. కొండవీటికిఁ దాను గావించిన యపరాధమున కాయన యప్పుడప్పుడు పశ్చాత్తాపము పడెను. కుమారాన్నపోతారెడ్డి మరణము విని యాయనయు దుఃఖం

చెను. కాని యే మొగము పెట్టుకొని తాను కుమరగిరిప్రభువు మొగము చూడఁగలఁడు? కాటయవేమభూపతి యిప్పు డాయనను బిలిపించెను. ప్రభువు సమక్షమునకుఁ గొనిపోయెను. ప్రభు వాయనవంక నార్ద్ర దృష్టులఁ దిలకించెను. ప్రభువుహ స్తమునుఁ గోమటివేమారెడ్డిహ స్తము నందుంచి వేమభూపతి యిట్లనెను. "వేమయ్యగారూ! ప్రభువు మీవాఁడు. రాజ్యము మీది. నేను ప్రభువునందనురక్తుఁడను. ఆయన ధర్మబుద్ధి, దయాగుణము, కళాశక్తి నన్నాకర్షించినవి. ఈరాజ్యముపై నా కాశ యెన్నఁడును లేదు. ప్రభువు నన్ను బెంచిపెద్దవానిఁ జేసెను. విద్యాబుద్ధులు చెప్పించి పెండ్లిగావించినాఁడు. నాబహిరంతరంగములను మల్లాంబికతో, వసంతరాజీయముతో నలంకరించినాఁడు. నా కింకేమి కావలెను? ప్రభువు శరీరము కుసుమ సుకుమారము. ప్రభువు హృదయము మకరంద మధురము. ప్రభువు నెట్లు కాపాడుదురో, భారము మీదే" కోమటివేమారెడ్డి యాశ్చర్యచకితుఁ డయ్యెను. ప్రభువ ద్భుత పరవశుఁ డయ్యెను.

కాటయవేమభూపతి ప్రభువుకడ సెలవు తీసికొని సేనలను గలిసికొనఁ బోయెను. సూర్యుఁడు మకరసంక్రాంతుఁడై యుత్తరాయణ మారంభమయ్యెను.

## ౨౨

కొండవీటిరాజ్యమంతయుఁ గుమారాన్నపోతారెడ్డి దివంగతుఁడైన వార్తకుఁ గన్నీటి మంచు తెఱలో మునిఁగిపోయెను. సంక్రాంతి పండుగ యువరాజ మరణశోకసమాక్రాంతమై పోయెను. రాజ్యమున మెట్టపొలములను మాగాణములను బంగారమును పండెను. ఎచ్చటఁజూచినను వరిచేలలోఁ బంటకుప్పలు బంగారుకొండకొమ్ముల వలెనుండెను. మెట్టచేలలోఁబండిన జొన్నకంకులు పసిడిముత్తెముల

కుచ్చులవలెనుండెను. ఖిరపలు మాణిక్యములుపండెను. మడులలో, గోడమదురులలోఁ గాఁగిటికమరని గుమ్మడిపండ్లు కుందనపుముద్దలవలె నుండెను. పసిఁడికణికలవంటి పచ్చిపసపుదుంపలు కళ్ళములలోఁగల కలలాడుచుండెను. చేయెత్తుపెరిగిన చెఱకుఁదోటలు వెన్నులువిరిసి కొండవీటిదండు పరువులను దలపించుచుండెను.

కాటయవేమభూపతి వీరకూటమునుజయించి సింహాద్రిపాదమున విడిసియున్న తనసేనలను గలిసికొనెను. స్కంధావారమున వీరోత్సాహము నీరసించి విచారపుఁగప్పు వ్యాపించి యుండెను. వేమభూపతి యల్లాడరెడ్డిని, భీమదేవచోడని; లింగనమంత్రిని, అన్నయమంత్రిని, దక్షిణదుర్గాధిపసేనాపతులను సమావేశపఱచి దండయాత్ర నంతటితోఁ గట్టిపెట్టుటయా, ముందుకుసాగించుటయాయని యాలోచించెను. ఇంత సన్నాహముచేసి యింతవఱకువచ్చి తిరిగిపోవుట యెవ్వరికిని రుచింపలేదు. కటకముద్రొక్కిగాని వెనుదిరుగరాదని యల్లాడరెడ్డి పట్టుపట్టెను. సేనాపతుల యుత్సాహము శోకపుఁబొరలో మఱుఁగుపడినదే కాని పదును తఱుగలేదని వేమభూపతి సంతసించెను. సింహాద్రిపాదముత్తరసీమగా సామ్రాజ్యముస్థాపించుటకును, గటకమువఱకును దిగ్విజయయాత్రసాగించుటకును నిర్ణయమయ్యెను. సింహాద్రినృసింహదేవునకుఁ గుమారాన్నవోతారెడ్డికిఁ బుణ్యముగావుటకునై వెలలేని కానుకలు చదివించి సేనలను బురికొల్పుటకై సేనాపతుల నియోగించి కాటయవేమభూపతి స్కంధావారమంతయుఁగలయదిరిగి యన్నిసేనాంగములయందును నివురుగవిసిన శౌర్యాగ్నులను బ్రజ్వలింపఁజేసెను. పుష్యబహుళదశమీప్రభాతమునఁ గొండవీటిసేనలు భేరీపటహశంఖకాహళకోలాహలమునుమించు సింహనాదములు చేయుచు సింహాచలమ్మునుండి కటకాభిముఖముగఁ గదలిపోయెను.

యువరాజు మరణించి నెలదినము లయినది. కుమారగిరిప్రభువు శాంతిపర్వము వినుచుండెను. ఆయన యంతరంగమునఁ బ్రసన్న రసవాహినులు ప్రవహించుచుండెను. ఆయన చిత్తమునంటియున్న సర్వకామములు, సర్వమోహములు, సర్వశోకములు క్షాళితములయ్యెను. మల్లాంబిక యిన్నాళ్లుగా నన్నగారియొద్దనే యుండెను. రాత్రులందామె జోలపాడి యాయనను నిద్రపుచ్చవలయును, ఉదయములందామె మేలుకొలుపులుపాడి యాయనను నిద్రలేపవలయును. సూర్యోదయమువేళ లకుమాదేవివచ్చి యాయనకు ఫాలమునఁ దిరుమణి తిరుచూర్ణముతో నూర్ధ్వపుండ్రములు దిద్దవలెను. గడియసేపాయన గోపాలనామస్మరణము గావించుకొనును. అనంతరము రాయప్ప మణిపాత్రికతో మాధవరసము దెచ్చును. లకుమాదేవి యా పాత్రికను ప్రభువు పెదవుల కందిచ్చును. ఆయనయింద్రియముల కప్పుడు చైతన్యమువచ్చును. ఆయన ముఖశాలలోనికి వచ్చి కూర్చుండును. కోమటివేమారెడ్డి యాయనను దర్శించును. కొంచెముసేపాయన యేదియో చెప్పును. ప్రభు వేదియో వినును. ఇంతలో సనంతామాత్యులు వచ్చి శాంతిపర్వము వినిపించును. ప్రభు వేకాగ్రచిత్తుఁడై యాలకించును. పిమ్మట వామనభట్టు వచ్చి దండయాత్రావిశేషములు వర్ణించి చెప్పును. కొండవీటి సేనలు ఝూడేశవనము కొల్లగొట్టెను. శిలావంశీయుఁడైన నందాపురేశ్వరుఁడు కొండవీటి సేనలకుఁ బాదాక్రాంతుఁడయ్యెను. ఏరాజ్యమోడినదో, యేకోట కూలినదో ప్రభువునకుఁ బట్టలేదు. ఆయనముఖమునం దే వికారమును గనిపించదు. కాటయవేమభూపతి పేరు విన్నప్పుడు మాత్ర మాయనకన్ను లింత విప్పార్చిచూచును.

హీరాంబికకుఁ బగళ్లు సందడిగా జరిగిపోవుచుండెను. ఉదయములు వామనభట్టు సాహిత్యగోష్ఠితోఁ బోవును. సాయంకాలములు

లకుమా దేవి వేమభూపతి విజయవార్తా కథనముతోఁ బోవును. మధ్యాహ్నములు దుర్గ నాట్యగానములతో నిద్రపోనీయదు. వంటయు వడ్డనయు ముగించుకొని దుర్గ హీరాంబికయొద్దకుఁ బోవును. శ్రీనాథుఁడు చెఱకుఁదోటలలోనికిఁ బోయి తిన్నన్ని తిని, ప్రొద్దుగ్రుంకు వేళ కొక దంటు చేతఁబట్టుకొని యింటికిఁ జేరును. దీపముముందు గూర్చుండి దుర్గకు వినఁబడునట్లు బిగ్గరగాఁ జదువుచు శాలివాహనస ప్తశతి యను వాద పద్యములు మూఁడో నాలుగో గంటముతోఁ దాటియాకుపై బరబర బరుకును. తిప్పయ్యగారు వచ్చి "తిని యూరక తిరుగుటకంటె పోయి యా వామనభట్టుగారివద్ద నేమయినఁ జదువుకొనరాదా ?" యనును. శ్రీనాథుఁడు పద్యములు గీకుచునే "వామనభట్టా ! వాఁడు నాకుఁ జెప్పెడి చదువేమిటి ?" యని వెకిలిగా నవ్వును. "హరిహర రాయలవారిచే బిరుదులందినవాఁడు, అరుణగిరినాథ డిండిమ కవిసార్వభౌముల శిష్యుఁడు — అట్టి వామనభట్టుగారిని వాఁడందు వఁటరా ! నీతిక్క యింకను దిరుగలేదే !" అని తిప్పయ్యగారు చిఱ్ఱుబుఱ్ఱులాడును శ్రీనాథుఁడు గంటము నాడించుచు "మామా ! మనసంగతి నీ కింకను దెలియలేదు. వామనభట్టుగాడు వాని గురువైనను మనముందు గడ గడ లాడవలసినదే" యని హుంకరించును. "అన్నియు నఘోరించి తివి గాని యదరిపాటు నింతటఁ గట్టిపెట్టుము" అనుచుఁ దిప్పయ్య గారు వెలుపలి కేఁగిరి.

మాఘపూర్ణిమనాఁటికిఁ గొండవీటిసేనలు జంతరనాఁటిని బిల్లి గంతులు వేయించి, భారహదొంతిని నేల దొరలించి, సప్తమాడెముల నొక్కకొలికికిఁ దెచ్చినవఁట. శృంగవరపుకోట జంతరనాఁటి రాజధాని. సురభివంశ సంభవుఁడు ప్రతాపవీరగంగరాజు జంతరనాఁటి పాలకుఁడు.

ఆయనకును, నాయనతమ్ముఁడు సంగవభూపునకును సరిపడుట లేదు. సంగవభూపుఁడు కొండవీటిసేన శరణు వేఁడెను. వేమభూపతి యాయన కభయమిచ్చి శృంగవరపుకోటఁ గొట్టి వీరగంగరాజునకు శృంగభంగము గావించి సంగవభూపతిని జంతరనాటికిఁ బట్టముగట్టెను. ఈవిజయమునకుఁ బ్రధానకారణము అల్లాడరెడ్డి. ఆయన ప్రతాపవిజృంభణము నెదుట నిలువఁజాలక వీరగంగరా జల్లాడిపోయెనఁట. బారహదొంతి పండ్రెండు రాజ్యములకూటమి. అదియంతయుఁ బర్వతారణ్యమయమైన మన్యప్రాంతము. ఆ పండ్రెండు రాజ్యముల పర్వతదుర్గములు నొకదానిపై నొకటి పేర్చినట్లుండును. బారహదొంతి బల మాకోటలలో లేదు. ఆకోటలకూటమిలో నున్నది. కాటయవేమభూపతి యాకోటల నేక కాలమున ముట్టడి చేయించెను. అగ్నిదళమును, గజదళమును బ్రయోగించి రెండుదినములలో సోపానపంక్తి నెక్కినట్లు బారహదొంతిని ద్రొక్కిపోయెను. సప్తమాడియలు పూర్వపర్వతపంక్తులలో మాలారూపముగ నమరియున్న యేడు మాడెములు. కొండుసవరజాతుల యాటవిక లీప్రాంతపుఁబ్రజలు. బలిగూడము, కాలహాండీపురము, మండువా, పండువాలీమాలికలోనికోటలు. పదివేలయశ్వదళమును బరవళ్ళుద్రొక్కించి కాటయవేమభూపతి మూఁడుదినములలో నేఁడు మాడెముల నేకముచేసెను. మాఘబహుళ చతుర్దశినాఁడు కొండవీటిసేనలు కంటకపురమునఁ జలిమంటలు వేయుచుండెను. గంగవంశీయుఁడు, కంటకపురాధిపతి, యొడ్డెధాత్రీనాథుఁడు నరసింహదేవగజపతి కాటయవేమభూపతి యవఘాట మహోద్భుత చండఖడ్గప్రహారముల ఘాటికి నిలువఁజాలక కొండలపాలయ్యెను. కొండవీడి పోటుబంటులు కంటకముననంటించిన మంటలాకసమునంటి మహాశివరాత్రినాఁడు కోటప్పకొండకుఁ దరలిపోవు శైవప్రజవలెనుండెను.

కొండవీట నీ విజయవార్తలతోపాటు పండిన పల్లపుఁ బంటలు మెట్ట పంటలు బండ్లపై వచ్చి నిండిపోవుచుండెను. కొండవీటి రైతు లాయేడు కుప్పనూర్పులలో విజయవార్తలే పొలికేకలు వైచిరి. సమర క్షేత్రములఁ గొండవీటి రౌతులు కరవాలములతో మునుముట్టి యరి సేనల నూచకోఁత గోయుచుండ సస్యక్షేత్రములఁ గొండవీటి రైతులు కక్కుల కొడవళ్లతో మునుములుపట్టి వరిపైరులు గోయుచుండిరి. కొండవీటి మావంతు లేనుంగుల పిండులచేఁ గోటలు ద్రొక్కించుచుండఁ బంటకాపు లెద్దులచేఁ గుప్పలు త్రొక్కించుచుండిరి. విక్రమసింహ పురమున, విద్యానగరమున వేమభూపతి విజయవార్తలు పూర్వాపూర్వ ములు ముగియకముందే యుత్తరోత్తరములు మొదలగుచుండెను. అవచి తిప్పయసెట్టి కా విజయములు తనవిగనే యుండెను. హరిహర రాయలవారి కా విజయములు తనవిగనేయుండెను. కొండవీటి వీర బలాంజ్యధర్మరక్షకులు మహాశివరాత్రి పర్వదినమున నారాధనలలో నభిషేకములతో మహేశ్వరు నర్చించి వేమభూపతి విజయపరంపరలను బ్రభలుగట్టి యూరేగిరి. సింగనమంత్రి యనుయాయులగు మైలారవీర భటులు శ్రీశైలమున వీరశిరోమండపమునఁ గుడియెడమ యఱచేతుల నారతులెత్తువారును, కరచరణసంధులఁ గఱకునారసములు గ్రుచ్చుకొను వారును, గరవాడి యలుగుల గనపసాతర్లలో నుట్టిచేరులుగోసి యుఱుకు వారును, కటి కరమోనాళిము గండగత్తెర వట్టి మిడిసిపడి మిడితలలిచ్చు వారును నై రౌద్రమూర్తియగు వీరభద్రునకు ఆత్మరక్తధారల నభి షేకములు చేయుచుండిరి.

కుమరగిరిమహీపతి రాయప్ప తెచ్చిన గండపెండెరమును బరిశీ లించుచుండెను. పెద వేదగిరినాయకుఁడు మొదలుగా నరసింహదేవ గజ పతి వఱకు వేమభూపతికిఁ బాదాక్రాంతులైన మండలేశ్వరు లా గండ

పెండెరమున శిల్పఖండములై యుండిరి. కంటకముఁ జూరఁగొని కొండ వీటి సేన లింటిమొగము పట్టినవి. ఫాల్గుణ పూర్ణిమనాఁడు సింహాచల మున విడిసినవి. కుమరగిరిమహీపతి చిత్తమున చిత్రచిత్రములగు నూహలు పొడముచుండెను. ఆయన రాయప్పను జేరఁబిలిచి యాతని చెవిలో నేదో గుసగుసలాడెను. రాయప్ప యెండిన గుండెలలో నమృతము చిలికిన ట్లయ్యెను.

కొండవీటఁ దొలికోయిలకూఁత కోయనెను. హేమంతమంతయు గన్నీరులు కార్చికార్చి, శిశిరమంతయుఁ జైతన్యముగోల్పడి ప్రోడు లయిన కొండవీట లతావృక్షముల కా కోయిల తొలికూఁత వసంతపుఁ దొలకరి యయ్యెను. వేణువనమునఁ దీవతీవకుఁ జెట్టుచెట్టునకుఁ దెల్ల వారుసరికిఁ జిగురుఁ బులకలు గుబురుకొనివచ్చెను. రాజసౌధశిఖర మున బంగరుకలశము లేయెండలో మిలమిల మెఱసెను. మల్లాంబిక యువరాజునోడిలో నిడికొని పట్టగజముసెక్కినట్లు పల్లకియెక్కి రాజమ హేంద్రవరమునకుఁ బోవుచున్నది. ముందు మల్లాంబికపల్లకి. ఆవెనుక హీరాంబిక. ఆవెనుక లకుమాదేవి. ఆవెనుకఁ బరివారము. ఆపరి వారము నగ్రమున వామనభట్టు. యువరాజును గడుపులోఁ బెట్టుకొని వేమారెడ్డి వామాంకమునఁ గూర్చుండి మల్లాంబిక రాజమహేంద్రవర సింహాసనమునఁ బట్టాభిషేకమునందఁ బోవుచున్నది. కొండవీటి దుర్గ ద్వారమున నిల్చి కుమరగిరి మహీపతి మల్లాంబిక కళ్యాణయాత్రా సుందరదృశ్యమును బరవశతాలసతాదర నిమీలితలోచనములఁ దిలకించుచున్నాఁడు. కొండవీడంతయుఁ జివురుగుత్తులలో నరవిచ్చిన విరిగన్నులతో నాయుత్సవము నవలోకించి యానందమకరంద బిందు వులు చిందుచున్నది. హజారమున వీరాస్వామి మాయామాళవ ధాగము నాలపించుచున్నాఁడు. ఆయాలాపసుధాబిందికలపైఁ దేలి

యాడుచు మల్లాంబిక ముత్యాలపల్లకి ముందుకుసాగిపోవుచున్నది. వామనభట్టు వెనుదిరిగిచూచెను. కొండవీటి నడిగడ్డపై రాజసౌధ శిఖరము తళతళలాడుచుండెను. కొండవీటి దుర్గద్వారమునఁ గుమరగిరి మహీపతి బాలాతపతపనీయకాంతులలోఁ గాంచనశిల్పమువలె నిలిచి యుండెను.

ప్రభవసంవత్సర మధుమాసారంభశుభముహూర్తమునఁ బవిత్ర గోదావరీజలములచేఁ బట్టాభిషిక్తుఁడై వేమభూపతి మల్లికా హీరా సమేతుఁడై త్రైలోక్యవిజయసౌధమునఁ గొలువుతీర్చెను. అల్లాడరెడ్డి యాయనవామపాదమున గండపెండేరము నలంకరించెను. లకుమాదేవి యాయనకుఁ గర్పూరనీరాజనమెత్తెను. గోపీనాథస్వామి యాలయమున ఘంటానాదములు శ్రవణసుభగములయ్యెను. వామనభట్టు "రాయవేశ్యాభుజంగ, జగదగోపాల, జగనొబ్బగండ, బారహదొంతి మన్నె సప్తమాడియ దళవిభాళ, కంటకచూరకార, కర్పూరవసంత రాయ, వీరనారాయణ, వేమభూపాల! జయీభవ! విజయీభవ" యని ప్రశస్తిపఠించి కుమరగిరిమహీపతి మంగళాశాసనము నిట్లు ః. పించెను.



వేమభూపతీ! కొండవీటిరెడ్డిప్రభువుల ప్రశస్తి నిన్ను జెందినది. రాజమహేంద్రవరము కేంద్రముగా నీవీ కొండవీటి సామ్రాజ్యమును బాలింపుము. భారమంతయు నీభుజములపై నుంచితిని. ప్రసన్నచిత్తుఁడనై యానందోపాసకుఁడనై నేనీకొండనడుమ గండశిలలఁగరగించి శిల్పఖండములు సృష్టించుకొనుచుందును. నీభుజబలము, బుద్ధిబలము, ధర్మబలము రెడ్డిసామ్రాజ్యమునకు శ్రీరామరక్ష!"



---

సరస్వతీ పవర్ ప్రెస్ — రాజమహేంద్రవరము